# సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీ

## 20 వ మహాసభలో

ప్రథమ కార్యదర్శి

## ఎన్. ఎస్. కృశ్చేవ్

సమర్పించిన

# కేంద్రకమిటీ నివేదిక



విశాలాంధ్ర ప్రచురణాలయం
విజయవాడ

# విషయ సూచిక

# సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీ 20 వ మహాసభలో ప్రథమ కార్యదర్శి ఎన్. ఎస్. కృశ్చేవ్ సమర్పించిన కేంద్ర కమిటీ నివేదిక

కామ్రేడ్స్, పందొమ్మిదవపార్టీ మహాసభ జరిగి ఎంతో కాలం కాలేదు; మూడుసంవత్సరాల నాలుగుమాసాలుమాత్రమే అయింది. అయితే ఈమధ్యకాలంలో పార్టీసాగించిన కృషినిబట్టి, ఇంటాబయటా సంభవించిన ఘటనల ప్రాధాన్యాన్ని బట్టి ఈమధ్యకాలం కమ్యూనిస్టుపార్టీచరిత్రలోని అతిప్రధానదశలలో ఒకటిఅయింది; మనదేశ శక్తిసామర్థ్యాలను యితోధికం చేసేందుకు, కమ్యూనిస్టు సమాజాన్ని నిర్మించేందుకు, ప్రపంచ శాంతిని పటిలపర్చేందుకు పార్టీ చేసిన కృషిదృష్ట్యా ఈమధ్యకాలానికి ఎంతో ప్రాధాన్యం వుంది.

దేశీయ కార్యవిధానానికి సంబంధించినంతవరకు, గడచిపోయిన ఈ మూడు సంవత్సరాల నాలుగుమాసలలోను మనదేశంలోని మొత్తం ప్రజలప్రయోజనాలను దృష్టిలోవుంచుకొని, వ్యావసాయిక, పారిశ్రామికరంగాలలోని పరిస్థితిని పార్టీ విమర్శనాదృష్టితో సింహావలోకనం చేసింది; అంతకుపూర్వమే సాధించిన విజయాలను ప్రాతిపదికగా చేసుకొని దేశంయొక్క సోషలిస్టు అభ్యున్నతిలో కొత్తగా మహత్తర పురోగమనాన్ని సాధించేందుకు పార్టీ అనేకానేక ప్రధానచర్యలు తైకొన్నది. ఆర్థిక, ప్రభుత్వ, పార్టీ ఆదిగాగల వివిధరంగాలలో కార్యకలాపాల లోని లోపాలను పార్టీ ధైర్యంగా త్రవ్వి బయటకు తీసింది; కాలదోషంపట్టిన దృక్పథాలను చీల్చిచెండాడింది; బూజుపట్టిన ప్రతిదానినీ, మన అభివృద్ధికి అవరోధంగా తయారైన ప్రతిదానినీ పార్టీ పట్టుదలతో వూడ్చి ఆవల పారేసింది.

పార్టీ తైకొన్న చర్యలన్నీకూడా సరియైనవనీ, సకాలంలో తీసుకొన్నవని యిప్పుడు స్పష్టంగా తేలిపోయింది. సోషలిస్టు ఆర్థిక క్రమానుగతాభివృద్ధికీ, సోవియట్ ప్రజల జీవన, సాంస్కృతిక ప్రమాణాల యితోధికాభివృద్ధికీ ఆచర్యలు తిరుగులేని సాధనాలుగా ఉపకరిస్తాయి.

మనం సమీక్షించుకొంటున్న ఈ దశలోనే ప్రపంచ వ్యవహారాలలో ప్రధానమైన పరిణామాలు సంభవించాయి. సోషలిస్టుదేశాలు అచంచలంగా అనుసరిస్తున్న శాంతిప్రియ వైదేశిక నీతిపుణ్యమా అంటూ మహాప్రమాదభరితంగా తయారైన అంతర్జాతీయ ఉద్రిక్తతలో కొంత సడలింపు సాధించబడింది. సోవియట్ యూనియన్, దాని మిత్రదేశాలైన చైనా ప్రజా రిపబ్లిక్, తదితర నూతన ప్రజాతంత్ర దేశాలు కలిసి, శాంతిప్రియ శక్తుల తోడ్పాటుతో దౌత్యసంబంధమైన అనేకానేక చర్యలను గైకొన్నందువల్లనే అది సాధ్యమైంది; అంతర్జాతీయ రంగంలో పరిస్థితులు బాగుపడటానికి వాస్తవావకాశాలు ఏర్పడ్డాయి.

దేశీయ, వైదేశిక విధానాలకు సంబంధించిన తక్షణావసరాలను పార్టీ పరిగణనలోకి తీసుకొని ఆ అవసరాలకు తగిన సత్వర చర్యలు తీసుకొనేందుకు పార్టీ సిద్ధమౌతున్నదని పైన పేర్కొన్నదంతా నిరూపిస్తున్నది. ప్రజలతో మన పార్టీకిగల సన్నిహితమైన అభేద్య సంబంధాలనూ, దాని లెనినిస్టు సమష్టి నాయకత్వంయొక్క విజ్ఞతనూ, పార్టీ కార్యకలాపాలకు ప్రాతిపదికగావున్న మార్క్సిస్టు-లెనినిస్టు ఉపదేశంయొక్క అప్రతిహత శక్తినీ అది స్పష్టంగా వ్యక్తం చేస్తోంది. మన పార్టీ సాధించే విజయాలన్నింటికీ మూలం లెనినిజానికి మనం కట్టుబడివుండటమే. (మిన్నుముట్టే హర్షధ్వానాలు).

సమీక్ష చేస్తున్న ఈ దశలో మనదేశంయొక్క అంతర్జాతీయ స్థానం గురించీ, దేశంలోపలి పరిస్థితిని గురించీ ఇక యిప్పుడు పరిశీలిద్దాం.

## I

## అంతర్జాతీయ రంగంలో సోవియట్ యూనియన్ స్థానం

ఒకే దేశంలో మొదట సామ్యవాదం అవతరించి, అటుపిమ్మట అది ప్రపంచ పరివ్యాప్త వ్యవస్థగా పరిణతి చెందటం అన్నదే మన యుగ ప్రధానలక్షణం. ప్రపంచ పరివ్యాప్త చారిత్రక ప్రాధాన్యంగల ఈ క్రమాన్ని నిరోధించే శక్తి పెట్టుబడిదారీ విధానానికి లేదని నిరూపితమైంది. ఏకకాలంలోనే రెండు విరుద్ధ ప్రపంచ ఆర్థిక వ్యవస్థలు - పెట్టుబడిదారీ, సోషలిస్టు ఆర్థిక వ్యవస్థలు, మనుగడ కొనసాగిస్తూ, అవి విభిన్న సూత్రాలతోను, విరుద్ధాభిముఖంగాను వృద్ధిచెందుతూండటం అన్నది నిర్వివాదాంశమైన వాస్తవం.

సమాజంలోని సకల జనుల జీవన, సాంస్కృతికావసరాలను నానాటి యితోధికంగా తీర్చి, సంతృప్తిపరచేవిధంగా సోషలిస్టు ఆర్థిక విధానం వృద్ధిచెందుతోంది; పురోగామి సాంకేతిక చాతుర్యాన్నీ, సోషలిస్టుదేశాలమధ్య సన్నిహితసహకారాన్నీ, పరస్పర సహాయాన్నీ ప్రాతిపదికగా చేసుకొని, ఉత్పత్తిని నిరంతరం విస్తరింపచేస్తూ అభివృద్ధిపర్చుకుంటోంది.

పెట్టుబడిదారీ ఆర్థిక విధాన ధోరణిని పరిశీలిస్తే, గుత్తాధిపతులు అధికంగా కుబేరులవుతూండటం, కోటానుకోట్ల శ్రామికజనులను, ముఖ్యంగా వలస, పరాధీన దేశాల ప్రజలను యింకా ఎక్కువగా దోపిడీచేస్తూ, వారి జీవన ప్రమాణాలకు కోతపెట్టుతూండటం, ఆర్థికవిధానాన్ని మరింతగా సైనికీకరించటం, పెట్టుబడిదారీ దేశాలమధ్య పోటీపోరాటం పెచ్చరిల్లటం, క్రొత్తక్రొత్త ఆర్థిక సంక్షోభాలు పరిపక్వం చెందుతూండటం మనకు కన్పిస్తుంది.

## 1. సోవియట్ యూనియన్, నూతన ప్రజాతంత్రదేశాలలో క్రమానుగత ఆర్థికాభ్యుదయం

సమీక్షించబడుతున్న ఈ దశలో సోవియట్ యూనియన్ జాతీయార్థిక వ్యవస్థలోను, అలాగే చైనా ప్రజారిపబ్లిక్, పోలిష్ ప్రజారిపబ్లిక్, చెకోస్లావిక్ రిపబ్లిక్, హంగేరియన్ ప్రజారిపబ్లిక్, రుమేనియన్ ప్రజారిపబ్లిక్, బల్గేరియా ప్రజారిపబ్లిక్, అల్బేనియా ప్రజారిపబ్లిక్, జర్మన్ ప్రజాతంత్రరిపబ్లిక్, కొరియా నూతన ప్రజాతంత్ర రిపబ్లిక్, మంగోలియన్ నూతన ప్రజాతంత్రరిపబ్లిక్, వియత్నామ్ ప్రజాతంత్రరిపబ్లిక్‌ల జాతీయార్థిక వ్యవస్థలలోను మహత్తర అభ్యుదయం సాధించబడింది.

1929 నుండి 1955 మధ్యకాలంలో సోవియట్ యూనియన్‌లోను, పెట్టుబడిదారీ దేశాలలోను పారిశ్రామికోత్పత్తి ఏ వంతున వృద్ధిచెందిందో ఈ క్రింది సంఖ్యా వివరాలు తేటతెల్లం చేస్తాయి :

### సోవియట్ యూనియన్‌లోను, పెట్టుబడిదారీ దేశాలలోను పారిశ్రామికోత్పత్తి పరిమాణం (1929 – 100)

| దేశం | 1929 | 1937 | 1943 | 1946 | 1949 | 1950 | 1952 | 1955 |
|---|---|---|---|---|---|---|---|---|
| సో. యూనియన్ | 100 | 429 | 573 | 466 | 870 | 1082 | 1421 | 2049 |
| అన్ని పెట్టుబడిదారీదేశాలు | 100 | 104 | — | 107 | 130 | 148 | 164 | 193 |
| అమెరికా | 100 | 103 | 215 | 153 | 164 | 190 | 210 | 234 |
| బ్రిటన్ | 100 | 124 | సంఖ్యా | 118 | 144 | 153 | 153 | 181 |
| ఫ్రాన్స్ | 100 | 82 | వివరాలు | 63 | 92 | 92 | 108 | 125 |
| ఇటలీ | 100 | 99 | ప్రకటించ | 72 | 108 | 124 | 148 | 194 |
| పశ్చిమ జర్మనీ | 100 | 114 | బడలేదు. | 35 | 93 | 117 | 150 | 213 |
| జపాన్ | 100 | 169 | 231 (1944 సంఖ్యా వివరాలు) | 51 | 101 | 115 | 173 | 239 |

పావు శతాబ్ద కాలంలో, ఇంకా స్పష్టంగా చెప్పాలంటే 26 సంవత్సరాలలో, సోవియట్ యూనియన్, యుద్ధంవల్ల తన ఆర్థిక వ్యవస్థకు వర్ణింపనలవికాని నష్టం వాటిల్లినప్పటికీ, తన పారిశ్రామికోత్పత్తిని 20 రెట్లు పెంచుకోగలిగిందని ఈ సంఖ్యా వివరాలు నిరూపిస్తున్నాయి. కాగా, ఎక్కడలేని అనుకూల పరిస్థితులను అనుభవించిన అమెరికా తనఉత్పత్తిని రెండింతలకు కాస్త హెచ్చుగా మాత్రమే పెంచుకోగల్గింది: పోతే, మిగతా పెట్టుబడిదారీ దేశాలు ఆ మాత్రం అభివృద్ధిని కూడా సాధించలేకపోయాయి.

పారిశ్రామికోత్పత్తి పెరుగుదల విషయంలో పెట్టుబడిదారీ దేశాలను నూతన ప్రజాతంత్ర దేశాలుకూడా తలదన్నాయి. గత సంత్సరంలో పోలెండ్ పారిశ్రామికోత్పత్తి యుద్ధాత్పూర్వపు ఉత్పత్తి స్థాయికి నాలుగు రెట్లకు మించి పెరిగింది. బల్గేరియా ఉత్పత్తి అయిదురెట్లకు మించింది; చెకొస్లావేకియాలో రెండింతలకు మించింది. హంగరీలో మూడున్నర రెట్లు, రుమేనియాలో యించుమించు మూడు రెట్లు, ఆల్బేనియాలో 11 రెట్లుకన్న హెచ్చుగాను, జర్మన్ ప్రజాతంత్ర రిపబ్లిక్‌లో రెండింతలకన్న హెచ్చుగాను పెరిగింది.

ఇతర దేశాలకన్నా ఆలస్యంగా సామ్యవాద నిర్మాణానికి ఉపక్రమించిన చైనా ప్రజారిపబ్లిక్ అద్వితీయాభివృద్ధిని సాధించింది. యుద్ధాత్పూర్వపు గరిష్ఠ పారిశ్రామికోత్పత్తికన్నా ఆదేశఉత్పత్తి రెండింతలనుమించి పెరిగింది; 1949-సంఖ్యతో పోల్చుకుంటే నాలుగింతలుగా వృద్ధిచెందింది.

యుగోస్లావియాలో సామ్యవాద నిర్మాణంలో కూడా చాలా సాధించబడింది. యుద్ధాత్పూర్వంకన్నా 1955లో దాని పారిశ్రామికోత్పత్తి నూటికి 180 వంతులు పెరిగింది.

సోషలిజంయొక్క పారిశ్రామికపునాది అధికాధికంగా పటిష్ఠతరమవుతున్నది. ప్రపంచ పారిశ్రామికోత్పత్తిలో సోషలిస్టుదేశాల పాలు క్రమంగా ఆనాటి కానాడు ఎక్కువ అవుతోంది. అభ్యుదయకర చారిత్రక క్రమానికి భౌతికరూపమే ఈ వాస్తవిక విషయం: పెట్టుబడిదారీ దోపిడిసాగే పరిధీ, ప్రపంచంలో పెట్టుబడిదారీ స్థావరాలూ కుంచించుకుపోవటం, ప్రపంచంలో సామ్యవాద స్థానం విస్తరిల్లటం.

పెట్టుబడిదారీ విధానంతో సామ్యవాదం సాగించే ఆర్థిక పోటీలో సామ్యవాదమే కొత్తకొత్త విజయాలు సాధిస్తుందనటానికి దాని పారిశ్రామికోత్పత్తి పెరుగుదల అత్యున్నత గతిని సాగుతూండడమే తిరుగులేని హామీ కాగలదు. మొత్తం పారిశ్రామికోత్పత్తి పరిమాణం విషయంలో సోవియట్ యూనియన్ ఈనాడు ద్వితీయ స్థానం ఆక్రమిస్తోంది. ముడి యినుము, ఉక్కు, అల్యూమినియమ్, రాగి, యంత్రాలు, విద్యుచ్ఛక్తి, సిమెంటు, బొగ్గు ఉత్పత్తులలో సోవియట్ యూనియన్ ఏనాడో ఫ్రాన్స్, పశ్చిమ జర్మనీ, బ్రిటన్‌లను తలదన్నింది; ఆ విషయంలో క్రమంగా అమెరికా స్థాయిని చేరుకుంటోంది.

సోవియట్ తదితర నూతన ప్రజాతంత్ర దేశాలలోని ఆర్థిక వ్యవస్థలు సర్వతోముఖాభివృద్ధిని సాధిస్తూ, శాంతియుత స్వభావాన్ని కలిగియుండడమే వాటి విశిష్ట లక్షణంగా పేర్కొనవచ్చు. సామాజికోత్పత్తి మొత్తంగా నిరంతరం విస్తరిల్లుతుండాలంటే అందుకు అన్నిటికన్నా ముఖ్యంగా భారీ పరిశ్రమ అభివృద్ధే మూలకందం అవుతుంది కనుక సోషలిస్టు దేశాలు ఆ విషయంలో ఏమరుపాటులేని శ్రద్ధను చూపుతున్నాయి. అదే సమయంలో అవి వ్యావసాయిక, తేలిక పరిశ్రమల అభివృద్ధిపట్ల కూడా కడు శ్రద్ధను ప్రదర్శిస్తున్నాయి. ప్రజల జీవన స్థితిగతులు క్రమానుగతంగా బాగుపడుతున్నాయి; సాంస్కృతిక వికాసం విరాజిల్లుతోంది.

మన ప్రజల ఎదుట మహదవకాశాలు ఏర్పడుతూండటం అన్నది అంతకన్నా గమనార్హమైన విషయంగా పేర్కొనాలి. సోవియట్ యూనియన్‌లో మానవసేవకై అణుశక్తి, ఆధునిక విజ్ఞానం సాధించిన తదితర విజయాలు, సాంకేతిక చాతుర్యాలను పెద్దఎత్తున వినియోగించే సుదినం ఎంతోదూరాన లేదు; సహజ సంపదను ఇంకా పూర్తిగా ఉపయోగించే శుభదినం, మహానదులను మచ్చికచేసి, బీళ్ళుగా వుంటున్న అపార విస్తీర్ణం గల భూములను పంటపొలాలుగా మార్చే శుభసమయం ఇంక అట్టే దూరాన లేదు. తత్ఫలితంగా ఆహార పదార్థాలు, తదితర వాడకం వస్తువులు పుష్కలంగా లభించగలవు. చైనా మహాదేశం, చారిత్రక దృష్ట్యా, బహు స్వల్పకాలంలోనే పారిశ్రామికదేశం కాగలదన్న విశ్వాసం మనకు ఉంది. ఆ దేశ వ్యావసాయికోత్పత్తి, సహకార సంస్థల ప్రాతిపదికపైన, ఉన్నతస్థాయినందుకోగలదన్న నమ్మకం మనకు ఉంది. నూతన ప్రజాతంత్ర దేశాలన్నీ సామ్యవాద పథంవెంట గణనీయమైన పురోగమనం సాధిస్తాయి.

సోషలిస్టు దేశాలు సంపూర్ణమైన స్వాతంత్ర్యం-ఇటు రాజకీయ స్వాతంత్ర్యం, అటు ఆర్థిక స్వాతంత్ర్యంకూడా-కలిగియుంటూ, అభివృద్ధి చెందుతూండటమే వాటి విశిష్టత. అదేసమయంలో సమీక్ష చేయబడుతున్న ఈదశలో ఆదేశాలమధ్య ఆర్థిక సంబంధాలు మరింత పటిష్టతరమై, సహకారం విస్తరిల్లింది; ఇది అధికతర ప్రాధాన్యం గల విషయం. సమాన ప్రతిపత్తి, ఉభయతారకం అన్న ప్రాతిపదికపైన సోషలిస్టు దేశాలు వాణిజ్య సంబంధాలను స్థాపించుకొంటున్నాయి. ఆదేశాలు పరస్పరం సాంకేతికానుభవాన్ని యిచ్చి పుచ్చుకొంటున్నాయి; పరస్పరం ఒక దేశాన్ని మరొకదేశం అన్ని విధాల ఆదుకొంటున్నాయి. తమ తమ జాతీయ ఆర్థిక ప్రణాళికలను సమర్థవంతంగా సమన్వయ పర్చుకొంటున్నాయి.

సోషలిస్టు శిబిరంలోని దేశాలన్నీ తమలోతాము సన్నిహితమైన ఆర్థిక సహకారం నెరపుకొంటున్నందువల్ల ఉన్న ఉత్పాదక శక్తిస్తోమతులను, సహజసంపదలను సాధ్యమైనంత ఎక్కువగా అందరి ప్రయోజనాలకు ప్రయోజనకరమైన విధంగా వినియోగించేందుకు వీలుచిక్కుతోంది. ప్రత్యేకత (స్పెషలైజేషన్), సహకారాలను అభివృద్ధి చేయటం అన్నదానికి ఈ సందర్భంలో మహత్తర ప్రాధాన్యం వుంది.

పెట్టుబడిదారీ వక్రబంధంలో చాలా కాలంపాటు ఏకైక సోషలిస్టుదేశంగా మనుగడ కొనసాగించుకొంటూ వచ్చిన సోవియట్ యూనియన్ చేసినట్లే ఈనాడు ప్రతి సోషలిస్టుదేశం భారీపరిశ్రమలకు చెందిన అన్నిశాఖలను అభివృద్ధి చేసుకోవలసిన అగత్యంలేదు. ఇప్పుడు బలీయమైన సోషలిస్టుదేశాల శిబిరం వుంది. మొత్తం సోషలిస్టుశిబిరంయొక్క పారిశ్రామిక శక్తిస్తోమతులమైననే వాటి రక్షణ స్తోమత, భద్రతలు ఆధారపడివుంటాయి. అందుకని యూరపులోని ప్రతి నూతన ప్రజాతంత్ర దేశమూ తనకుగల అత్యంత అనుకూల సహజ, ఆర్థికపరిస్థితులను బట్టి, ఏ ఏ పరిశ్రమలను, ఏ ఏ వస్తోత్పత్తిని అభివృద్ధిచేసేందుకు వీలుగావుంటుందో ఆయా పరిశ్రమలు, వస్తోత్పత్తి విషయంలో ప్రత్యేకతను సాధించవచ్చు. అంతేకాక, దీనివల్ల వ్యావసాయిక, తేలికపరిశ్రమలను అభివృద్ధిచేసేందుకై, గణనీయమైన సాధనసంపత్తిని వినియోగించేందుకు వీలుచిక్కుతుంది; తద్వారా ప్రజల జీవనసాంస్కృతిక అవసరాలను మరింత పరిపూర్ణంగా తీర్చేందుకు అవకాశం చిక్కుతుంది.

సోషలిస్టు దేశాలు, తమ మధ్య సోదర సౌహార్దం పటిష్ఠతరం చేసుకొనేందుకు, ఆర్థికాభివృద్ధి విషయంలో నిస్వార్థ దృష్టితో పరస్పరం చేయూత నిచ్చుకుంటున్నాయి. పెట్టుబడిదారీ ప్రపంచంలోని దేశాలమధ్యవుండే సంబంధాలకు, సామ్యవాదానికి చెందిన దేశాల మధ్యవుండే సంబంధాలకు మౌలికమైన వ్యత్యాసం వుంది. సోవియట్ యూనియన్ నూతన ప్రజాతంత్ర రాజ్యాలతో కుదుర్చుకొన్న ఒప్పందాల ప్రకారం ఆ దేశాలలో 391 పరిశ్రమలనూ, 90 ప్రత్యేక కర్మాగారాలను, యంత్రాగారాలను నెలకొల్పుతోంది. నూతన ప్రజాతంత్ర దేశాలకు దీర్ఘకాల ప్రాతిపదికమైన, అత్యంత అనుకూల షరతులమైన మనం 210 కోట్ల రూబుళ్ళ అప్పులను మంజూరు చేశాం. అణుశక్తి ఉత్పత్తి, శాంతియుత వినియోగం విషయంలో కూడ సోవియట్ యూనియన్ తన మిత్ర దేశాలకు సాయపడుతోంది.

సామ్యవాద పారిశ్రామికీకరణ విషయంలో చైనా సాధిస్తున్న విజయాలు మనకు అత్యంత సంతృప్తిదాయకంగా వున్నాయి. చరిత్రలో యింతకుముందెన్నడూ అత్యున్నత పారిశ్రామికవంత దేశమేదీకూడా యితర దేశాలు పారిశ్రామికవంతం కావటానికి యిష్టపూర్వకంగా సహాయం చేసివుండలేదు. పైగా పెట్టుబడిదారీ ప్రపంచంలో అత్యున్నత పారిశ్రామికవంత దేశాలుగా అవతరించిన బహు పరిమిత దేశాలు యితర దేశాల పారిశ్రామికీకరణకు, ముఖ్యంగా వలస, అర్ధవలస దేశాల పారిశ్రామికీకరణకు ఎల్లప్పుడూ అవరోధాలు కల్పిస్తూనే వచ్చాయి. అందుకనే ఆసియా, దక్షిణ అమెరికా, ఆఫ్రికాలలోని అత్యధిక దేశాలు పెద్ద పెద్ద పరిశ్రమలను స్థాపించుకొనలేకపోయాయి. అలాంటి ఉద్దేశాలు సోవియట్ యూనియన్ యింటా వంటా లేవు; కనుకనే, సోదర చైనా ప్రజలు బలీయమైన సొంత పరిశ్రమలను స్థాపించుకోవటంలో వారికి సోవియట్ యూనియన్ శాయశక్తులా సాయపడుతోంది. ఒక్క అయిదు సంవత్సరాల కాలంలోనే చైనా ప్రజారిపబ్లిక్ 156 పరిశ్రమలను, 21 ప్రత్యేక కర్మాగారాలను నెలకొల్పుకోటానికి మన దేశం సాయపడుతోంది;

మొత్తం 560 కోట్ల రూబుళ్ళ విలువచేసే పారిశ్రామిక యంత్రాలను మన దేశం చైనాకు సరఫరా చేస్తున్నది.

సోవియట్ యూనియన్ యిస్తున్నవాటికి బదులుగా చైనానుంచి, యితర నూతన ప్రజాతంత్ర దేశాలనుంచి మనకు అవసరమైన వస్తువులను మనం తెచ్చుకుంటున్నాము; ఆ దేశాలు అనాదిగా ఎగుమతి చేస్తూ వస్తున్న సరుకులను, వాడకం వస్తువులను సోవియట్ యూనియన్ పుచ్చుకొంటోంది.

ఆర్థిక, సాంకేతిక, శాస్త్రీయ, సాంస్కృతికాభివృద్ధి రంగాలలో పరస్పరం సర్వతోముఖ సహకారం నెరపుకోటాన్ని ఇకముందుకూడా మనం కొనసాగిస్తూనే వుంటాం. సామ్యవాద శిబిరంపట్ల మనకుగల సౌహార్ద్ర విశ్వాసక్తి ధర్మంగా దానిని మనం ఎంచుకొంటాం. మొత్తం సోషలిస్టు శిబిరం ఎంతగా బలవత్తర మౌతుందో అంతఎక్కువగా ఆ మహాశిబిరంలోగల దేశాలన్నింటియొక్క స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకూ, ఆర్థిక, సాంస్కృతికాభ్యుదయానికీ భద్రత చేకూరుతుంది.

సంక్షోభాలు, ఒడిదుడుకులు లేకుండా సోషలిస్టువ్యవస్థ దిగ్విజయంగా ముందుకు సాగిపోతోంది. సోషలిస్టు దేశాలలోని ప్రజలకు మహాప్రయోజనాలను అది సమకూర్చిపెట్టుతోంది; పెట్టుబడిదారీ వ్యవస్థకన్నా తనకుగల నిర్ణయాత్మక సదవకాశాలను అది నిరూపిస్తోంది. (దీర్ఘ హర్షధ్వానులు.)

## 2. పెట్టుబడిదారీ దేశాలలో ఆర్థిక పరిస్థితి : ఇంకా తీవ్రతరమైన పెట్టుబడిదారీ వైరుధ్యాలు

పై పట్టికను పరికిస్తే, 1929 నాటికన్నా 1955 లో మొత్తం పెట్టుబడిదారీ ప్రపంచ పారిశ్రామికోత్పత్తి నూటికి 93 వంతులు పెరిగింది.

దీనినిబట్టి పెట్టుబడిదారీ విధానం తన అంతర్గత వైరుధ్యాలను అధిగమించి, సుస్థిరతను సాధించిందని చెప్పగలమా ? అలా చెప్పేందుకు ఎంతమాత్రం వీలులేదు. పెట్టుబడిదారీ ఆర్థిక విధానం విపరీతమైన ఎగుడుదిగుడులతో వృద్ధి చెందుతోంది. ఇంతకు మునుపుకన్నా మరింత అస్థిరమైంది.

యుద్ధానంతర దశాబ్దంలో పాత పెట్టుబడిదారీ దేశాలైన బ్రిటన్, ఫ్రాన్సుల వంటి దేశాలు తమ పారిశ్రామికోత్పత్తిని యితోధికం చేసుకోగలిగినప్పటికీ, అది తాబేటి నడకతోను, పరస్పర విరుద్ధ ధోరణులలోను సాగుతోంది. పోతే పరాజిత దేశమైన జర్మనీ, ఇటలీలు 1949-50 సంవత్సరంలో మాత్రమే తమ యుద్ధాత్పూర్వపు ఉత్పత్తిస్థాయి నందుకొనగలిగినవి. కాగా, జపానుపారిశ్రామికోత్పత్తి యించుమించు 1944 స్థాయిలోనే వుంది. ప్రధాన పెట్టుబడిదారీ దేశమైన అమెరికా యుద్ధం ముగిసినదాదిగా మూడుసార్లు ఉత్పత్తిని గణనీయంగా తగ్గించుకోవలసి వచ్చింది; 1948 సంవత్సరాంతములో తీవ్రమైన సంక్షోభం ప్రారంభమైంది; అయితే అటుతర్వాత

కొరియాలో ప్రారంభించబడిన యుద్ధంతో ఆయుధధారణ పోటీని యితోధికం చేయటంవల్ల అది ఆగిపోయింది.

అనేక పెట్టుబడిదారీ దేశాలలో పారిశ్రామికోత్పత్తిలోని అస్థిరత్వానికితోడు ద్రవ్యసంబంధమైన అస్థిరత్వం ఏర్పడింది; విపరీతంగా నోట్లను అచ్చువేయటంతో నోట్ల విలువ పడిపోయింది. దీనితోపాటు అనేక దేశాలలో వ్యవసాయ సంక్షోభం అలముకొనటం, ఇటీవలి సంవత్సరాలలో పెట్టుబడిదారీ మార్కెట్టులో గోచరిస్తున్న ప్రపంచ వాణిజ్య స్తంభన కూడా ప్రత్యక్షమయ్యాయి.

పెట్టుబడిదారీ విధాన సర్వవ్యాపిత సంక్షోభం యింకా తీవ్రతర మవుతూనే వుంది. పెట్టుబడిదారీ విధానంలోని పరిష్కారాతీతమైన వైరుధ్యం—ఆధునిక ఉత్పత్తి శక్తులకు, పెట్టుబడిదారీ ఉత్పత్తి సంబంధాలకు మధ్య గల వైరుధ్యం - మరింత తీవ్రతరమైంది. వర్తమానకాలంలో త్వరితగతిని వృద్ధిచెందుతున్న సాంకేతిక చాతుర్యం ఈ వైరుధ్యాన్ని తొలగించకపోగా, దానిని యినుమడింపచేస్తోంది.

పెట్టుబడిదారీ విధాన సర్వవ్యాపిత సంక్షోభం అంటే సంపూర్ణస్తంభన అనిగానీ, ఉత్పత్తి, సాంకేతికాభివృద్ధి ఆగిపోవటం అనిగానీ చెప్పటం మార్క్సిస్టు-లెనినిస్టు దృక్పథానికి ఎప్పుడూ విరుద్ధమైనదేనని ఇక్కడ స్పష్టం చేయాల్సివుంటుంది. పెట్టుబడిదారీవిధానం సర్వవ్యాపిత పతనావస్థకు లోనైనప్పుడుకూడా ఒకదశలోనో లేక వేరొక దశలోనో, సాంకేతికాభివృద్ధి లేదా వుత్పత్తి వూపు (ఉఫ్‌స్వింగ్) ఉంటే ఉండవచ్చునని లెనిన్ స్పష్టం చేశారు. ఆయన ఇలా వ్రాశారు. "ఈ పతనావస్థధోరణి మూలాన పెట్టుబడిదారీ విధాన సత్వరాభివృద్ధికి తావుండదనుకోటం పొరపాటే కాగలదు. అలా జరగదు. సామ్రాజ్యవాదయుగంలో పరిశ్రమలలోని కొన్ని శాఖలు, బూర్జువావర్గంలోని కొంతభాగం, కొన్ని దేశాలు, ఒకప్పుడు ఇది, మరొకప్పుడు అది — ఈ ధోరణులను ప్రదర్శిస్తుంటాయి." (వర్క్స్ వాల్యూమ్ 22, 286వ పేజీ). అందువల్ల మనం పెట్టుబడిదారీ ఆర్థికవిధానాన్ని కడుశ్రద్ధతో పరిశీలించాలేగానీ, సామ్రాజ్యవాద పతనావస్థను గురించిన లెనిన్ సిద్ధాంతాన్ని తేలికగా చూడరాదు; పెట్టుబడిదారీ దేశాలకు చెందిన ఉత్తమ శాస్త్రీయ, సాంకేతిక విజ్ఞానాన్ని అధ్యయనంచేసి, సామ్యవాద ప్రయోజనాలకు అనుగుణంగా ప్రపంచ సాంకేతికాభివృద్ధి విజయాలను వినియోగించాలి.

సమీక్షించబడుతూన్న ఈ దశలో పెట్టుబడిదారీ దేశాలలోని ఉత్పత్తి పెరుగుదల సుస్థిరమైన ఆర్థిక పునాదిపై ఆధారపడి జరిగిందని చెప్పేందుకు వీలులేదు. ఈక్రింద పేర్కొన్న మౌలిక కారణాల మూలాన అది సాధ్యపడింది.

మొదటి విషయం: ఆర్థిక విధానాన్ని సైనికీకరించటం, ఆయుధపోటీ. ఈ వూపు అన్నది అన్ని పరిశ్రమలకు వర్తించిందనుకోరాదు. వాడకం వస్తువులను ఉత్పత్తిచేసే పరిశ్రమ చాలా వెనకబడివుంది; కాగా ఆ పరిశ్రమలోని కొన్ని శాఖలు స్తంభించాయి. కేవలం ఆయుధోత్పత్తితో ఏదో విధంగా సంబంధంగల పరిశ్రమలు

మాత్రమే విస్తరిల్లుతున్నాయి. ఒక్క అయిదు సంవత్సరాలలో, 1950 నుంచి 1954 వరకు, ఆయుధాలకోసం ప్రభుత్వం చేసిన వ్యయం అమెరికాలో నూటికి 300 వంతులు, బ్రిటనులో నూటికి 300 వంతులుకన్నా హెచ్చుగాను, ఫ్రాన్సులో నూటికి 200 వంతులు పెరిగింది. కనుక దీనినిబట్టి ఈ దేశాలలో పారిశ్రామికోత్పత్తి జనరల్ స్థాయిని నిర్ణయించటంలో అసాధారణ అత్యున్నత స్థాయిలో జరుగుతున్న ఆయుధోత్పత్తి ప్రభావం వుందని స్పష్టమవుతోంది.

రెండవ విషయం: ప్రధాన పెట్టుబడిదారీ దేశాలు సాధించిన అధికతర ఆర్థికవిస్తరణ ఉత్పత్తి పెరుగుదలకు తోడ్పడింది. పెట్టుబడిదారీ ప్రపంచ మార్కెట్టులో అమెరికాకు, కొంతవరకు బ్రిటన్, ఫ్రాన్సులకు, తాత్కాలికమైన అనుకూల పరిస్థితులు ఏర్పడ్డాయి. పోటీచేసే దేశాల గ్రూపునుంచి జర్మనీ, జపాన్, ఇటలీలు అనేక సంవత్సరాలపాటు వైదొలిగిపోయాయి. పశ్చిమ యూరపియన్ దేశాలు యుద్ధానంతరం చితికిపోయినందువల్ల ఆహారపదార్థాలకు ఎక్కువ గిరాకీ తగిలింది. ఈ పరిస్థితిని అదనుగా తీసుకొన్న అమెరికా, మార్షల్ ప్రణాళిక, తదితర పన్నాగాలను అమలుజరిపి, తన స్వార్థానికి సాధ్యమైనంత ఎక్కువగా ఉపయోగించుకొంది.

మూడవ విషయం: స్థిరపెట్టుబడిని తిరిగి జారీచేయుటం అన్న విషయం పెద్ద పాత్రను నిర్వహించింది. 1930 తర్వాత సంభవించిన సంక్షోభాలు, మాంద్యాల మూలంగానూ, అటుతర్వాతవచ్చిన యుద్ధంఫలితంగానూ 15-20 సంవత్సరాలపాటు యూరపియన్ పెట్టుబడిదారీ దేశాలలోని మౌలికపారిశ్రామిక కర్మాగారాలు జీర్ణమైపోయినా మార్చకుండా యథాతథంగా వుంచారు. మూలయంత్రాలు విపరీతంగా అరిగిపోయాయి. యుద్ధకాలంలో అవి బాగా దెబ్బతిన్నాయికూడా. అలాంటి వాటినన్నింటినీ 1951-54 మధ్యకాలంలో మాత్రమే ఆధునికం చేయసాగారు. దీని మూలాన భారీఉత్పత్తిసాధనాల ఉత్పత్తి గణనీయంగా పెరగటానికిదోహదమిచ్చింది.

చిట్టచివరివిషయం: కార్మికవర్గాన్ని మరింత ఎక్కువగా దోపిడీ చేయడం ద్వారాను, శ్రామికప్రజల జీవనప్రమాణాన్ని తగ్గించటంద్వారాను పెట్టుబడిదారీ దేశాలు తమ పారిశ్రామికోత్పత్తిని పెంచుకోగలిగినవి. ప్రధాన పెట్టుబడిదారీ దేశాలలో గత నాలుగేళ్ళలోను పారిశ్రామిక కార్మికుని సగటు సాంవత్సరికోత్పత్తి నూటికి 10 నుంచి 25 వంతులు పెరిగింది. అయితే అనేక పెట్టుబడిదారీ దేశాలలో ధరలు, అద్దెలు, తదితరమైన ఖర్చులు బాగా పెరిగినందువల్ల వాస్తవ వేతనాలు యుద్ధాత్పూర్వంకన్నా తక్కువగానే వున్నాయి.

ఈ సందర్భంలో శ్రామికప్రజల నెత్తినపడిన అపారమైన ఆయుధవ్యయ భారంకూడా పరిగణనలోకి తీసుకోవాలి. అమెరికాలో 1913-'14 ఆర్థికసంవత్సరంలో సైనికవ్యయం తల 1 కి 3.50 డాలర్లుకాగా, 1929-'30 సంవత్సరంలో 7.0 డాలర్లకు, 1954-'55 సంవత్సరంలో 250 డాలర్లకు పెరిగింది; అంటే సైనిక వ్యయం నాటికీ, నేటికీ 70 రెట్లు హెచ్చిందన్నమాట. బ్రిటన్‌లో 1913-'14 లో సైనికవ్యయం

తల 1 కి 1 పౌను 14 షిల్లింగు లుండగా, 1929-'30 లో 2 పౌనుల 10 షిల్లింగులకు, 1954-'55 లో 29 పౌనుల 6 షిల్లింగులకు హెచ్చింది. ప్రత్యక్ష, పరోక్ష పన్నులను క్రమంగా పెంచటంద్వారా విపరీతమైన ఈ సైనికవ్యయాన్ని పూడ్చుతున్నారు.

శ్రామికప్రజల స్థితిగతులపైన నిరుద్యోగసమస్య బలీయమైన వత్తిడి ప్రయోగిస్తోంది. 1955 లో "సౌభాగ్య" దశగా బూర్జువా ఆర్థిక శాస్త్రజ్ఞులు అభివర్ణిస్తున్న సమయంలోనే అమెరికాలో పూర్తిగా నిరుద్యోగులుగావున్న వారి సంఖ్య 30 లక్షలూ, పాక్షికంగా నిరుద్యోగులుగావున్న వారిసంఖ్య 90 లక్షలు ఉంది. అధికార లెక్కలను బట్టి పశ్చిమజర్మనీలో గత సంవత్సరం దాదాపు 10 లక్షలమంది పూర్ణ నిరుద్యోగులుగా వున్నారు. యుద్ధానంతరం ఇటలీలో దీర్ఘవ్యాధివలె వ్యాపించిన నిరుద్యోగం బాగా పెచ్చరిల్లిపోయింది; 1955 లో పూర్తిగా నిరుద్యోగులైనవారు 20 లక్షలమంది వున్నారు; పాక్షికంగా నిరుద్యోగులైనవారు కూడా అదేసంఖ్యలో వున్నారు. 1955 లో జపానులో అధికార అంచనాలప్రకారం 6 లక్షలమంది పూర్ణ నిరుద్యోగులు, 90 లక్షలమంది పాక్షిక నిరుద్యోగులు ఉన్నారని తేలుతోంది.

పెట్టుబడిదారీ ఉత్పత్తిలోని యుద్ధానంతర పెరుగుదలలో ప్రత్యేక పాత్రను నిర్వహించిన అంశాలు ఇవే. ప్రోత్సాహధాయకమైన ఈ తాత్కాలికాంశాలలో హెచ్చు భాగం అంతరించిపోయే దశను పెట్టుబడిదారీ ప్రపంచం ఈనాడు చేరుకొంటోంది. ఉదాహరణకు స్థిర పెట్టుబడిని తిరిగి పెద్ద ఎత్తున జారీ చేయటం, విదేశీ మార్కెట్లలో అనుకూలమైన పరిస్థితులేర్పడటం కేవలం తీవ్రాతితీవ్రమైన దీర్ఘకాల యుద్ధానంతర దశలో మాత్రమే సాధ్యపడతాయి. పోతే మిగతావి తాత్కాలికమైన ఉత్పత్తి పెరుగుదలకు మాత్రమే సర్వసాధారణంగా తోడ్పడగలవు. గతంలో తనలోని అంతర్గత శక్తులు పనిచేయటాన్నే ప్రాతిపదికగాచేసుకొని ఉత్పత్తిని యితోధికం చేయటంలో జయప్రదమైన పెట్టుబడిదారీ ఆర్థికవ్యవస్థ ఆనాటికానాడు దుర్బలమవుతోంది. ఉత్పత్తిని పెంపొందించుకొనేందుకు పెట్టుబడిదారీ విధానానికి ఈనాడు కృతకమైన ప్రోత్సాహ ప్రోద్బలాలు అధికాధికంగా అవసరమవుతున్నాయి.

పాశ్చాత్యవర్గాలు కొన్ని ప్రస్తుత తరుణాన్ని ఆధారం చేసుకుని "శ్రేయోసిద్ధి" గురించి ముచ్చటించసాగాయి. సంక్షోభాలు సంభవిస్తాయని చెప్పిన మార్క్సిస్టు సిద్ధాంతానికి కాలదోషం పట్టిందని నిరూపించేందుకు వారు నానా తంటాలు పడుతున్నారు. పెట్టుబడిదారీ విధానానికి అనుకూలమైన తాత్కాలిక పరిస్థితుల కలయిక వల్లనే దృగ్గోచరమౌతున్న సంరంభం తీవ్రమైన ఆర్థిక సంక్షోభంగా పరిణామం చెందకుండా అరికట్టబడిందన్న వాస్తవిక విషయం గురించి బూర్జువా ఆర్థికవేత్తలు నోరు మెదపరు. నేడుకూడా, శాస్త్ర కోలుకొంటున్న దశలో, అంతర్లీనంగా వున్న సంక్షోభ లక్షణాలు స్పష్టంగానే గోచరిస్తున్నాయి. ఉత్పాదన

స్తోమతులను పూర్తిగా వినియోగించుకోటమే లేదు. అమెరికాలో వస్తువుల నిల్వలు, అలాగే వాడకందారుల రుణాలు ప్రమాదకరమైన స్థాయిలను అందుకొంటున్నాయి.

అనేక పెట్టుబడిదారీ దేశాలలో వ్యవసాయిక సరుకులు అమ్ముడు పోక, విపరీతంగా కొట్లలో మూలుగుతుండటంతో పరిస్థితి మరింత క్లిష్టతరమైంది. ఆ దేశాల ప్రభుత్వాలు, ముఖ్యంగా అమెరికా ప్రభుత్వం, సాగవుతున్న భూ విస్తీర్ణాన్ని తగ్గించి, ఎలాగైనా సరే వ్యవసాయకోత్పత్తిని తగ్గించాలని యత్నిస్తోంది. అందులోను ఆగ్నేయాసియా, ఆఫ్రికాలలోని కోటానుకోట్ల జనం తిండిలేక బాధపడుతున్న సమయంలోనే, ప్రధాన పెట్టుబడిదారీ దేశాల జనాభాలోని అత్యధికులు అర్ధాకలితో సతమతమైపోతున్న తరుణంలోనే అలా జరుగుతోంది. ఇతోధికోత్పత్తి, కొంతవరకు సాంకేతికాభివృద్ధి, శ్రమశక్తిని ఉద్వేగపర్చటం-వీటన్నిటికి తోడు దేశీయ మార్కెట్లు విస్తరించకపోగా, కొంతవరకు సంకుచితమై పోతూండటం పెట్టుబడిదారీ దేశాలలో కొత్తకొత్త ఆర్థికసంక్షోభాలకు, ఒడిదుడుకులకు అనివార్యంగా దారి తీస్తాయి.

అవిచ్ఛిన్నమైన ఆయుధోత్పత్తి విస్తరణ కార్యక్రమంవల్ల ఆర్థిక సంక్షోభాలను నివారించే మార్గం లభ్యమైందన్న "సిద్ధాంతాన్ని" పెట్టుబడిదారులు, వారికి వంత పాడుతున్న ప్రబుద్ధులు ప్రచారం చేస్తున్నారు. ఇది కేవలం- పగటికల వంటిది మాత్రమేనని మార్క్సిస్టు - లెనినిస్టు శాస్త్ర ప్రతినిధులు పదేపదే స్పష్టం చేశారు. ఆయుధ పోటీవల్ల లంకించుకొన్న రోగం నయంకాదు సరిగదా, ఆ రోగం మరింత ప్రకోపించటానికి అది తోడ్పడుతుంది. ఆర్థిక విధానాన్ని ఎంత విస్తారంగా సైనికీకరిస్తారో, అంత ఎక్కువగా పెట్టుబడిదారీ విధానానికి చేటు మూడి తీరుతుంది.

ఆర్థిక విధానాన్ని ప్రభుత్వం క్రమబద్ధం చేయటం అన్నదానిపై పెట్టుబడిదారీ గ్రూపుల ప్రతినిధులు ప్రత్యేకంగా ఆశలు పెట్టుకొంటున్నారు. గుత్త పెట్టుబడిదారులు వివిధ ప్రభుత్వ శాఖలపైన ప్రత్యక్ష పెత్తనం సంపాదించుకొంటున్నారు; వాటిల్లో పనిచేసేందుకు తమ ప్రతినిధులను పంపుతున్నారు; తద్వారా ప్రభుత్వంచేత దేశార్థిక విధానాన్ని గుత్తాధిపత్య సంస్థల ప్రయోజనాలకు అనుగుణంగా 'క్రమబద్ధం' చేయిస్తున్నారు. వాణిజ్యం పడిపోకుండా కాపాడేందుకు ప్రభుత్వ సంస్థలు కోటానుకోట్ల డాలర్ల విలువగల ఆర్డర్లను కార్పొరేషన్లకు యిస్తున్నాయి; వాటికి ప్రత్యేక సౌకర్యాలు కల్పిస్తున్నాయి; సబ్సిడీలు యిస్తున్నాయి; ప్రభుత్వం వేతనాలను కంట్రోలు చేస్తోంది; మిగిలిపోయిన నిల్వలను ఖరీదుచేస్తూను, ఎగుమతులకు డబ్బు మంజూరుచేస్తూను అనేక వస్తువుల ధరలు పడిపోకుండా ప్రభుత్వం కాపాడుతోంది. వాణిజ్య కార్యకలాపాలలో ప్రభుత్వం తల దూర్చినంత మాత్రాన పెట్టుబడిదారీ విధానంలో గల మౌలిక అవలక్షణాలను తొలగించటం సాధ్యం కాదు. ఉత్పత్తి అరాచకత్వానికీ, ఆర్థిక సంక్షోభాలకు దారితీసే పెట్టుబడిదారీ ఆర్థిక విధానానికి చెందిన పరిణామ సూత్రాలను నిర్మూలించటం ప్రభుత్వానికి

సాధ్యంకాని విషయం. అసలు పెట్టుబడిదారీవిధాన స్వభావంలోనే సంక్షోభాలు అంతర్భూతమై వున్నాయికనుక, అవి అనివార్యం కాక తప్పదు.

పెట్టుబడిదారీ ప్రపంచమార్కెట్టులోని స్థితిగతులనుబట్టే అనేకవిధాల పెట్టుబడిదారీ ఆర్థికవ్యవస్థ తీరుతెన్నులు నిర్ణయించబడుతాయి. ఈ విషయంలో ఈమధ్యకాలంలో గణనీయమైనమార్పులు సంభవించాయి. యుద్ధానంతర తొలి సంవత్సరాలలో అమెరికా చేజిక్కించుకొన్న గుత్తాధిపత్యం నెమ్మదిగా చేయిజారి పోతోంది. ప్రపంచఎగుమతులలో అమెరికా వాటా 1947 లో అత్యున్నతస్థాయి (32.5%) నందుకొన్నది. అలాంటిది ఆటుతర్వాత ఇతరదేశాలనుంచి వచ్చిన పోటీ ఫలితంగా అది విపరీతంగా పడిపోయింది (19%). 1947-48 సంవత్సరంలో మొత్తం పెట్టుబడిదారీ ప్రపంచ పారిశ్రామికోత్పత్తిలో అమెరికా పాలు అయిదింట మూడు వంతులు ఉన్నది. కాని, ఈనాడు దానిపాలు నూటికి 50 వంతులు మాత్రమే. యుద్ధానంతరం అమెరికాకు లభించిన ఆర్థిక సదవకాశాల ఉచ్చదశ దాటిపోయింది. కొత్తమార్కెట్లు ఏవీ కనుచూపుమేరలో కానరావటంలేదు. అందువల్ల ఇక ఉత్పత్తి గణనీయంగా పెరగటానికి అవకాశంలేదు.

పెట్టుబడిదారీ ప్రపంచమార్కెట్టులో పశ్చిమజర్మనీ, జపానులు తిరిగి ప్రత్యక్ష మైనప్పటినుంచీ ఆ మార్కెట్ట పరిస్థితి ప్రత్యేకంగా విషమించ సాగింది. బ్రిటను, ఫ్రాన్సులవలెనే ఆ రెండుదేశాలుకూడా ప్రపంచ మార్కెట్టులో తమ యుద్ధాపూర్వపు స్థానాలను దాదాపు తిరిగి సంపాదించుకొన్నాయి. ఈనాడు ఏ ఒకదేశపు ఎగుమతులైనా యితోధికం కావాలంటే పోటీదార్లకు వ్యతిరేకంగా భీషణపోరాటం సాగించడంద్వారా మాత్రమే సాధ్యంకాని, అన్యథాకాదు. పశ్చిమజర్మనీ, జపాను దేశాల వాణిజ్యకలాపం వృద్ధిచెందడమంటే బ్రిటనుకు గిట్టదు; బ్రిటను తన మార్కెట్ల జోలికిరాకుండా తమను ఆటంకపరుస్తూన్నందుకు పశ్చిమజర్మనీ, జపానుదేశాలు అసంతృప్తి చెందుతున్నాయి. పోతే అమెరికా విషయంలో అందరూ అసంతృప్తి చెందటానికి కారణాలు కావలసినన్ని వున్నాయి. ఎందుకంటే ఏకఛత్రాధిపత్య వాణిజ్యాన్ని సాగించటంద్వారా ప్రపంచమార్కెట్టును అమెరికా తారుమారు చేసింది; తన దేశీయమార్కెట్టులోకి ఇతరదేశాలేవీ ప్రవేశించకుండా ఇనపకంచె వేసుకొని అమెరికా కూర్చున్నది. ప్రాచ్యప్రపంచంతో వాణిజ్యం నెరపుకోరాదని నిషేధించింది; వ్యావసాయిక సరుకులను ప్రపంచమార్కెట్టులో గుమ్మరించడద్వారాను, ఇతర చర్యలద్వారాను ఇతర దేశాలకు అత్యంత ప్రమాదకరంగా అమెరికా వ్యవహరిస్తోంది. పెట్టుబడిదారీ దేశాలమధ్య ఆర్థికపోరాటం సదా వుధృతమవుతూనే వున్నది.

ఇంతకు పూర్వంలాగానే యిప్పుడుకూడా అమెరికా, బ్రిటనుల మధ్యనే ప్రధాన సంఘర్షణ సాగుతోంది. ఆంగ్లో-అమెరికన్ వైమనస్యా అశేష సమస్యలకు పరివ్యాప్తమైవుంది. "అట్లాంటిక్ సహకారం" అన్న నినాదం పేరిట బ్రిటిషు సామ్రాజ్యానికి చెందిన ప్రధాన కీలక, ఆర్థిక స్థావరాలను ట్రాన్స్ అట్లాంటిక్ పోటీదార్లు

దిగ్రమింగుతున్నారు; ఇంపీరియల్ సముద్రాంతర మార్గాలపైన ఆలూనాలని వారు ప్రయత్నిస్తున్నారు. ప్రిఫరెన్షియల్ టారిఫ్‌ను తూట్లుపొడిచి, స్టరింగ్ ప్రాంతంలో పెత్తనం సంపాదించాలని చూస్తున్నారు. అందువల్ల బ్రిటనులోను, ఫ్రాన్సులో కూడా ఈ పరిస్థితిని-కేవలం ఒకే భాగస్వామికి ప్రయోజనకారిగా తయారైన 'అట్లాంటిక్ సహకారాన్ని'-తుదముట్టించాలన్న వాంఛ ప్రబలమవుతూండటంలో ఆశ్చర్యమేమీ లేదు.

పశ్చిమ జర్మనీ ఆర్థిక స్తోమత పునరుజ్జీవనం పొందటంవల్ల ప్రపంచ మార్కెట్టులోని పరిస్థితి ప్రత్యేకంగా విషమిస్తోంది. మార్కెట్ల సంపాదనకు సాగించే పోరాటంలో పశ్చిమ జర్మన్ గుత్తాధిపతులు దేనికైనా ఒడిగట్టక మానరని గత రెండు ప్రపంచ యుద్ధాల అనుభవం చాటిచెబులోంది. తత్ఫ్యవసానంగా పశ్చిమయూరప్ లోని పరిస్థితి మరింత విషమిస్తోంది. త్వరితంగా అభివృద్ధి చెందుతున్న జర్మన్ పోటీ దారు దాపురించటం బ్రిటను, ఫ్రాన్సులకు ఏమంత శుభప్రదమైన విషయం కాదు; అందులోను ముఖ్యంగా సైనికీకరణ పంథా వెంట జర్మనీ ముందుకు తోయబడుతూండటం మరింత ప్రమాదకరమైన విషయం. పశ్చిమ జర్మనీలో ట్రస్టులు, గుత్తాధిపత్య సంస్థలు తిరిగి తలెత్తుతున్నందువల్ల, ఒకప్పుడు ఫాసిజానికి అధికారం కట్టబెట్టిన శక్తులు పునర్జన్మ పొందే ప్రమాదం యితోధిక మవుతున్నది.

నూతన సోషలిస్టు ప్రపంచ మార్కెట్టు ఏనాడి ప్రవర్ధమానమవుతూన్నందువల్ల పెట్టుబడిదారీ ప్రపంచ మార్కెట్టు నానాటి కుంచించుకొని పోతోంది; తత్ఫలితంగా మార్కెట్ల సమస్య తీవ్రతర మవుతోంది. దీనికితోడు వలసబంధనాలను చీల్చుకొని బయటపడిన దళిత దేశాలు తమ సొంతపరిశ్రమలను అభివృద్ధి చేసుకోటం ప్రారంభించినందువల్ల పారిశ్రామిక వస్తువుల మార్కెట్లు మరింత కుంచించుకు పోవటానికి అనివార్యంగా దారితీస్తుంది. అంటే వీటన్నిటి మూలాన సామ్రాజ్యవాద శిబిరంలో మార్కెట్ల కొరకు, వివిధ ప్రాంతాలపై పెత్తనంకోసం కీచులాటలు తీవ్రతరం కాక తప్పవన్న మాట.

పెట్టుబడిదారీ దేశాలలో సాంఘిక వైరుధ్యాలు క్రమంగా తీవ్రతర మవుతూండటం కూడా ప్రస్తుత దశలోని ఒక లక్షణం.

పెట్టుబడిదారీ ప్రభుత్వాలు కార్మికవ్యతిరేక చండశాసనాలు ప్రత్యేకంగా అమలుజరిపినప్పటికీ, కార్మిక సంఘాలను ప్రభుత్వ "క్రమబద్ధ చట్టానికి" లోనుచేసినప్పటికీ, ట్రేడ్‌యూనియన్ హక్కులను పరిమితంచేసేందుకు పూనుకున్నప్పటికీ, యుద్ధాత్పూర్వరంకన్నా యుద్ధానంతరమే సమ్మెపోరాటాలు మరింత ఉన్నత స్థాయిల నందుకొన్నాయి. వాస్తవాన్ని కొంత కప్పిపుచ్చి ప్రకటించబడిన అధికారసంఖ్యావివరాల ప్రకారమే పదకొండుదేశాలలో (అమెరికా, బ్రిటను, ఫ్రాన్సు, పశ్చిమజర్మనీ, జపాను, కెనడా, ఆస్ట్రేలియా, స్వీడన్, బెల్జియమ్, హాలెండ్, అర్జెంటీనాలలో) యుద్ధాత్పూర్వపు పదిసంవత్సరాలలోను (1930-39)

జరిగిన సమ్మెలసంఖ్య 67,000 కాగా, యుద్ధానంతర పది సంవత్సరాలలోను (1945-56) ఆ సంఖ్య 1,01,000 కు పెరిగింది; సమ్మెల్లో పాల్గొన్న కార్మికులసంఖ్య 2 కోట్ల 10 లక్షల నుంచి 7 కోట్ల 30 లక్షలకు పెరిగింది; సమ్మెలవల్ల నష్టపడిన పనిరోజుల సంఖ్య 2 కోట్ల 40 లక్షలనుంచి 6 కోట్ల 72 లక్షలకు పెరిగింది. యుద్ధాపూర్వపు పదిసంవత్సరాలలో కన్నా యుద్ధానంతర పదిసంవత్సరాలలోను సమ్మెలసంఖ్య నూటికి 50 వంతులు, సమ్మెల్లో పాల్గొన్న వారిసంఖ్య, సమ్మెలవల్లనష్టపడినపనిరోజుల సంఖ్య ఏడురెట్లు పెరిగినవని పై లెక్కలనుబట్టి తేలుతోంది. అంటే పెట్టుబడిదారీ పీడనకు వ్యతిరేకంగా కార్మికవర్గం ఆనాటికానాడు మరింత గట్టిగాను, పట్టుదలతోను పోరాటం సాగిస్తున్నదని స్పష్టమవుతోంది. ఫ్రాన్సు, ఇటలీ, జపాను, అమెరికా, బ్రిటనులలోను, ఇటీవల సంవత్సరాలలో పశ్చిమజర్మనీలోకూడా సమ్మెపోరాటాలు ముఖ్యంగా ప్రజాస్వభావాన్ని, తీవ్రస్వభావాన్ని అందుకొన్నాయి.

మౌలికమైన రాజకీయ సమస్యలపైన కార్మికవర్గం అధికాధిక సంకల్పంతో కార్యాచరణకు ఉపక్రమించటం అన్నది యుద్ధానంతర దశలోని విశిష్ట లక్షణం. అనేకానేక ట్రేడ్‌యూనియన్లు, వాటి రాజకీయ స్వభావం ఎలాంటిదైనప్పటికీ అంతర్జాతీయ ఉద్రిక్తత సడలింపుకోసమూ, ఆయుధ పోటీని తుదముట్టించేందుకూ యినుమడించిన సంకల్పంతో కృషిచేస్తున్నాయి. ఫ్రెంచి, ఇటాలియన్ కార్మిక వర్గాలు, ఫ్రెంచి కమ్యూనిస్టుపార్టీ, ఇటలీలోని కమ్యూనిస్టులు, సోషలిస్టులు పార్లమెంటరీ ఎన్నికలలో ప్రధానమైన విజయాలను సాధించుకొన్నారు. కార్మికవర్గపార్టీలు తమ దేశాలలోని అశేష ప్రజాసామాన్యం యొక్క ప్రేమనూ, విశ్వాసాన్ని చూరగొన్నాయని పై విజయాలు నిరూపిస్తున్నాయి. (దీర్ఘ హర్షధ్వనులు).

పెట్టుబడిదారీ దేశాలలోని పరిస్థితి పరిశీలనదృష్ట్యా ఎలాంటి నిర్ణయాలకు మనం రావలసి వుంటుంది?

పెట్టుబడిదారీ ప్రపంచంలోని పరిస్థితి తీవ్రతర మవుతున్న ప్రబలతర వైరుధ్యాలతో కుతకుతలాడిపోతోంది. ఉత్పత్తికి సంబంధించిన సామాజిక స్వభావానికీ, వ్యక్తిగత పెట్టుబడిదారీ యాజమాన్యానికీ మధ్యగల వైరుధ్యం, ఉత్పత్తి విస్తరణకూ తగ్గిపోతున్న గిరాకీకీ మధ్యగల వైరుధ్యం-ఆర్థిక సంక్షోభాలకు ఇది దారితీస్తుంది - నానాట పెచ్చుపెరుగుతోంది. పెట్టుబడిదారీ దేశాలమధ్య వైరుధ్యాలు వృద్ధి చెందుతున్నాయి, మార్కెట్టుకోసం ఆయాప్రాంతాలపై పెత్తనం సంపాదించటం కోసం సాగిస్తున్న పోరాటం ఉధృతరూపం ధరిస్తోంది. సాంఘిక వైరుధ్యాలు తీవ్రతర మవుతున్నాయి. కార్మికవర్గమూ, అశేష ప్రజాసామాన్యమూ తమ హక్కుల కోసం, ప్రయోజనాలకోసం సాగిస్తున్న పోరాటాలు నానాట మరింత తీవ్రస్వరూపం ధరిస్తున్నాయి. ఆ విధంగా పెట్టుబడిదారీ విధానం క్రమంగా కొత్తకొత్త ఆర్థిక, సాంఘిక ఒడిదుడుకుల వైపుగా సాగిపోతోంది.

## 3. దురాక్రమణ కూటాలను నిర్మించే, ప్రచ్ఛన్న యుద్ధాన్ని రెచ్చగొట్టే సామ్రాజ్యవాద కార్యవిధానం : అంతర్జాతీయ ఉద్రిక్తత సడలింపుకొరకు ప్రజల పోరాటం

సోవియట్ కమ్యూనిస్టుపార్టీ 19–20 మహాసభల మధ్యకాలంలో అంతర్జాతీయ సంబంధాలలో చాల ప్రధానమైన మార్పులు వచ్చాయి.

రెండో ప్రపంచయుద్ధానంతరం అమెరికా, బ్రిటెన్, ఫ్రాన్స్ దేశాల విధానాలలో అభివృద్ధి నిరోధకులదీ, సైనిక ముఠాలదీ ప్రాబల్యం ఎక్కువ కాసాగింది. ఆర్థికంగానూ, రాజకీయంగానూ ఒత్తిడి తీసుకొచ్చి, బెదిరించీ, సైనికంగా కవ్వించీ ఇతర దేశాలను తమ చెప్పుచేతలలోకి తెచ్చుకోవాలనే కోరిక వారిలో ప్రబలింది. దీనినే 'బలోపేతస్థితి' అంటున్నారు. ఈనాటి సామ్రాజ్యవాదులలోని కరడుగట్టిన దురాక్రమణ వర్గాల ఆశలు ఆ శబ్దంలో ప్రతిబింబిస్తున్నాయి. ప్రపంచాధిపత్యం సంపాదించాలని వారి ఆశ. కార్మిక వర్గాన్ని, ప్రజాస్వామికోద్యమాన్ని, జాతీయ విముక్తిపోరాటాల్ని అణచివేయగలమని వారి వూహ. సోషలిస్టు శిబిరానికి వ్యతిరేకంగా సైనికచర్యలు సాగించాలని వారిపథకం.

యుద్ధ మనస్తత్వంతో అంతర్జాతీయ వాతావరణం విషపూరితం అయింది. ఆయుధోత్పత్తి పోటీ నానాటికీ భయంకర రూపం ధరిస్తూంది. అమెరికా సైనిక స్థావరాలు అమెరికాకు వేలాది మైళ్ళ దూరానవున్న దేశాలలో నిర్మించబడ్డాయి. సోవియట్ మీదా, ప్రజాస్వామిక దేశాలమీదా దాడికోసమే ఇవి వుద్దేశించబడ్డాయి. సోషలిస్టు శిబిరంమీద ప్రచ్ఛన్న యుద్ధం ప్రారంభించారు. అంతర్జాతీయంగా అనుమానాలను రగిల్చారు. దేశాలమధ్య విద్వేషాలు కల్పించారు. కొరియాలో యుద్ధం ప్రారంభించి రక్తం ప్రవహింపజేశారు. ఇండోచైనాలో యుద్ధం ఏళ్ళతరబడి కొనసాగించారు.

ఈ ప్రచ్ఛన్నయుద్ధ ప్రేరేపకులే యుద్ధకూటాల్ని నిర్మించడం ప్రారంభించారు. తమ ముఠాకు మాత్రమే పరిమితమైన దురాక్రమణ కూటాలైన ఉత్తర అట్లాంటిక్ కూటమీ, పశ్చిమ యూరపు రాజ్యకూటమీ, ఆగ్నేయాసియా కూటమీ, బాగ్దాద్ కూటమీ మొదలయిన దురాక్రమణ కూటాలలో అనేక దేశాలు తమ ప్రజల ఇష్టాలకు వ్యతిరేకంగా చిక్కుకున్నాయి.

'కమ్యూనిస్టు ప్రమాదం' నుంచి రక్షించుకొనేటందుకై తామీ కూటముల్ని నిర్మించినట్లు వీటిని నిర్మించినవారు చెప్పుకొంటున్నారు. కానీ, ఇది వట్టి మోసం. ప్రపంచాన్ని తిరిగి పంచుకొనేటందుకు ప్రయత్నించేటప్పుడల్లా సామ్రాజ్యవాద దేశాలు ఈ మాదిరి కూటాల్ని నిర్మిస్తూండడం మామూలేనని చరిత్ర చెపుతూనే వుంది. ప్రపంచాధిపత్యంకోసం ఒక రాజ్యం తాను చేస్తున్న ప్రయత్నాలను కప్పిపుచ్చుకొనే

టందుకే కమ్యూనిస్టు వ్యతిరేక నినాదాలను ఉపయోగిస్తూంది. ఇక్కడొక కొత్త సంగతి వుంది. ఈ ముఠాలూ, కూటాలూద్వారా పెట్టుబడిదారీ ప్రపంచంలో పెద్దరికాన్ని సాధించాలనీ, కూటాలలో చేరిన సహచరు లందర్నీ తన తాబేదార్లనుగా చేసుకోవాలనీ అమెరికా కోరుతూంది.

'బలోపేతస్థితి' విధానాన్ని అనుసరించడంవలన ప్రపంచరంగంలో బలాబలాల స్థితి తమకు అనుకూలంగా వుంటుందనీ, గనక మరో యుద్ధంవచ్చే ప్రమాదం లేదనీ ఆ విధానాన్ని బలపరిచేవారు అంటున్నారు. పాశ్చాత్య రాజకీయ వేత్తలలో ఈ అభిప్రాయం బాగా ప్రబలంగావుంది. అందుచేత దాని నిజాభిప్రాయాన్ని బట్టబయలు చేయడం అత్యవసరం.

ఆయుధ పోటీవలన శాంతి పెంపొందుతుందా? ఈ ప్రశ్నే అర్థం లేనిదని పిస్తుంది. కాని బలోపేత స్థితి విధానాన్ని సమర్థించే వారు శాంతిని రక్షించాలంటే ఆయుధోత్పత్తికి పూనుకోవాలని ఒక చిట్కా ఉపదేసిస్తున్నారు. దేశాలు తమ సైనిక శక్తిని బలపరచుకొనేటందుకు ప్రయత్నించినప్పుడల్లా యుద్ధ ప్రమాదం హెచ్చుతుందిగాని తగ్గదు. ఈ విషయం అందరికీ తెలుసు.

అమితంగా ఆయుధాలను ఉత్పత్తి చేయడం, బలోపేతస్థితి విధానాన్ని అనుసరించడం, యుద్ధ కూటాలను నిర్మించడం, ప్రచ్ఛన్న యుద్ధం సాగించడం మొద లయిన వానివలన అంతర్జాతీయ పరిస్థితి తీవ్రం కాకమానదు. అయిందికూడా. మనం సమీక్షిస్తున్న ఈ దశలో జరిగిన ప్రపంచ ఘటనలలో ఇదొక పోకడ.

అయితే ఇదే కాలంలో అంతర్జాతీయ రంగంలో ఇతరవిధమైన పరిణామాలు కూడా వచ్చాయి. వానిని చూస్తే ఈనాటి ప్రపంచంలో అంతా గుత్తస్వాములు చెప్పుచేతిల్లో మాత్రమే లేదని తెలుస్తుంది.

సోషలిస్టు, ప్రజాతంత్రవాద, శాంతిశక్తులూ, జాతీయ విమోచనోద్యమ శక్తులూ క్రమంగా బలపడుతున్నాయి. ఇది చాల ప్రధానమైన సంగతి. ఈ దశలో సోవియట్ యూనియనుకూ, నవచైనాకూ, ఇతర సోషలిస్టుదేశాలకూ అంతర్జాతీయంగా స్థానం బలపడింది. వాని పలుకుబడీ, అంతర్జాతీయ సంబంధాలూ అపారంగా పెంపొందాయి. అంతర్జాతీయ ఘటనల పరిణామాలపై సోషలిస్టు శిబిర ప్రభావం ప్రవర్థమానం అవుతూంది.

ఏకూటాలలోనూ ప్రవేశించకపోవడం తమ వైదేశికవిధానం అని ప్రకటించిన యూరపు, ఆసియాలలోని శాంతికాముక రాజ్యాలు కొన్ని ప్రపంచరంగంలో తలఎత్తడంతో శాంతి శక్తులకు బాగాబలం చేకూరింది. సామ్రాజ్యవాదులు నిర్మిస్తున్న ఈ ప్రాంతీయ సైనిక కూటాలలో చేరితే దురాక్రమణ వాదులు ఆడుతున్న యుద్ధ జూదాలలో తమ దేశాలుకూడా చిక్కుకొంటాయనీ, ఆయుధాల ఉత్పత్తి సుడిగుండంలోకి తాముకూడా జారిపోయే ప్రమాదం వుందనీ ఆ దేశాలలోని ప్రముఖ రాజకీయవేత్తలు భావిస్తున్నారు. అది సరైనదే.

దీనిఫలితంగా ప్రపంచంలో విశాలమైన శాంతిమండలం ఏర్పడింది. దానిలో యూరపు రాజ్యాలూ వున్నాయి; ఆసియా దేశాలూ వున్నాయి; సోషలిస్టేతర దేశాలూ వున్నాయి. సుమారు నూటఏభై కోట్లమంది ప్రజలు నివసిస్తున్న విస్తృత భూభాగాలు ఈ మండలంలో వున్నాయి. నూటయాభైకోట్లు అంటే ప్రపంచ జనాభాలో అధికభాగం అన్నమాట.

అశేషప్రజాసామాన్యం శాంతికోసంచేసిన తీవ్రప్రయత్నాలు ప్రపంచ ఘటనల తీరుతెన్నులను గణనీయంగా నిర్ధరించాయి. ఈ వేళ జరుగుతున్నంత పెద్ద ఎత్తున, ఇంత నిర్మాణయుక్తంగా యుద్ధ ప్రమాదాన్ని ప్రజలు ప్రతిఘటించి పోరాడడం చరిత్రలో అభూత పూర్వం.

యుద్ధ ప్రమాదాన్నీ, అభివృద్ధి నిరోధకశక్తుల్నీ ప్రతిఘటించి కమ్యూనిస్టు పార్టీలు ఎంతో పట్టుదలగా, వెనుతీయకుండా పోరాడుతాయని నిరూపితం అయింది. గతంలో లాగానే శాంతి రక్షణకోసమూ, శ్రామిక ప్రజల ప్రయోజనాలనూ, వారి దేశాల స్వాతంత్ర్యాన్నీ రక్షించేటందుకూ వారు ఎంతో పట్టుదలతో పోరాడు తున్నారు. ఈ మధ్యరోజుల్లో పెట్టుబడిదారీ దేశాలలో కమ్యూనిస్టులు ఎన్నెన్నో కష్టాలనూ, ఆపదలనూ అనుభవించారు. అయితే ఆ అగ్నిపరీక్షకు వారు నిలబడి ప్రతిష్ట తెచ్చుకొన్నారు. (హర్షధ్వానులు).

రెండోవైపున సమాజంలోని ఇతర తరగతులవారనేకులు యుద్ధాన్ని వ్యతిరే కిస్తున్నారు. శాంతికై పోరాడుతున్న వివిధశక్తులు తమలోవున్న అనైక్యతను తొలగించుకొని వున్నట్లయితే ఈ తరగతులవారి శాంతికృషి ఇంకా విజయవంతంగా వుండేదే. శ్రామికవర్గంయొక్క, కార్మికసంఘలయొక్క ఐక్యత కమ్యూనిస్టు, సోషలిస్టు, తదితర పార్టీల ఐక్యత ఇప్పుడు ప్రత్యేకంగా చాలా ప్రాముఖ్యత వహిస్తూంది.

చాలా దేశాలలో శ్రామికవర్గం చీలివుంది. వారిలోవున్న వివిధగ్రూపులు ఐక్యతచూపకపోవడంవలన అభివృద్ధినిరోధకులు లాభం పొందుతున్నారు. ఈనాడు ప్రపంచాన్ని పీడిస్తున్న చాల దురవస్థల కివే కారణం. ఈ పరిస్థితులు మారే అవకాశాలు ఇప్పుడు కనిపిస్తున్నాయని మా అభిప్రాయం. జీవితం ఎన్నో సమస్య లను సృష్టించింది. వానిని పరిష్కరించాలంటే కార్మికపార్టీలు అన్నింటిమధ్యా స్నేహసహకారాలు అవసరం. ఆ సహకారం ఏర్పడడానికి అవసరమైన పరిస్థితులను కూడా ఆ సమస్యలే కల్పిస్తున్నాయి. ఈ సమస్య లన్నింటిలోకి అతిప్రధానమైనది మరోయుద్ధం రాకుండా నిరోధించడం. శ్రామికవర్గం ఐక్యంగా, నిర్మాణయుక్తంగా ముందుకువచ్చి, పట్టుదలతో వ్యవహరిస్తే యుద్ధం వుండదు.

కార్మికోద్యమ నాయకులమీద ఇదంతా ఒక చరిత్రాత్మకమైన బాధ్యతను మోపుతూంది. శాంతి సమర ప్రయోజనాల కోసం సామరస్యంకూర్చే అంశాలను కనుక్కోవడం తప్పనిసరి అవుతుంది. వీటిని ఆధారంచేసుకొని సహకారానికి పునా

దులు వేసుకోవాలి. ఒకరిమీద ఒకరు నిందారోపణలు మానుకోవాలి. సోషలిజంలోకి పరిణామం పొందేటందుకున్న మార్గాల విషయమై సోషలిస్టు వుద్యమంలోనే అనేకాభిప్రాయాలున్నాయి. మన వూహలకి అవి భిన్నం కావచ్చు. అయినా వారితో సహకారం ముఖ్యమూ, అవసరమూ కూడా. ఈ విషయంలో నిజంగానే తప్పుదృక్పథంలో వున్నవాళ్ళు వారిలో చాలమందే వున్నారు. కాని, పరస్పర సహకారానికి అదేం అభ్యంతరం కాదు. ఈనాడు చాలమంది సోషల్ డెమాక్రట్లు యుద్ధ ప్రమాదాన్నీ, సైనికతత్వాన్నీ ప్రతిఘటించి గట్టిగా నిలబడుతున్నారు. సోషలిస్టు దేశాలతో దగ్గర సంబంధాలు పెట్టుకోడానికి ప్రయత్నిస్తున్నారు. కార్మికోద్యమంలో ఐక్యత తీసుకురావడానికి ప్రయత్నిస్తున్నారు. వీరందరినీ మనం మనస్ఫూర్తిగా అభినందిస్తున్నాం. శాంతి ప్రయోజనాల కోసమూ, కష్టజీవులయిన ప్రజల ప్రయోజనాల కోసమూ జరిగే పోరాటంలో మనవైపునుంచి కూడా అవసరమైనదంతా చేయడానికి మనం సిద్ధంగా వున్నాం.

ఇటీవల అంతర్జాతీయంగా కలిగిన పరిణామాలు చూస్తే శాంతిని కాపాడేటందుకు ప్రజానీకం నడుంకట్టిందని కనిపిస్తుంది. సామ్రాజ్యవాద పాలకవర్గాలు వీటిని పక్కకు నెట్టేసెయ్యడం సాధ్యంకాలేదు. బలోపేత స్థితివిధానాన్ని కొన్ని దేశాలమీద వొత్తిడి తేవడానికే అనుసరించబడిందనీ, కాని అది సఫలం కానేలేదనీ సామ్రాజ్యవాద పాలకవర్గాలలో కాస్త దూరదృష్టిగలవారు అంగీకరిస్తున్నారు. రెండోవేపున ఈ విధానం పెట్టుబడిదారీ దేశాలలోని ప్రజలనెత్తిన పెద్ద బరువుగా తయారయింది. వారిలో అసంతృప్తి కలిగించింది. ఈ బలోపేతస్థితి విధానం ప్రజలకు వ్యతిరేకంగా ఉద్దేశించబడిందనీ, యుద్ధ ప్రమాదాన్ని తీవ్రం చేస్తూందనీ మానవ జాతిలో అత్యధిక సంఖ్యాకులు భావిస్తున్నారు.

ఇవి నిర్వివాదాంశాలు. వీటి ఫలితంగా పాశ్చాత్యవర్గాలలో కొంతవరకూ తగ్గుదల కనిపిస్తూంది. సోషలిస్టు దేశాలతో యుద్ధం పెట్టుబడిదారీ దేశాల భవిష్యత్తు కెంత ప్రమాదకరమో ఈ వర్గాలలో నానాటికి ఎక్కువమంది గ్రహిస్తున్నారు. వారు సాహసించి యుద్ధాన్ని రెచ్చగొట్టారంటే పెట్టుబడిదారీ దేశాలలోని కార్మికవర్గమూ, శ్రామికప్రజలూ మాటిమాటికీ యుద్ధాలను కల్పించే ఆ వ్యవస్థ నిజస్వరూపాన్ని అర్థం చేసుకొంటారు. ఖచ్చితమైన నిర్ణయాలకు వస్తారు. అణ్వాయుధాల నుపయోగించిన యుద్ధంలో విజేతఅంటూ మిగలరని బూర్జువాదేశాలలోని ప్రముఖనాయకులు ఒప్పుకోవడం తరుచు జరుగుతూంది. ఇది యాదృచ్ఛిక ఘటనేంకాదు. పెట్టుబడిదారీ విధానం మరో యుద్ధాన్నిగనక ప్రారంభిస్తేఅది తన గోతిని తానే తవ్వుకొన్నట్లవుతుందనే విషయాన్ని చెప్పేటందుకు ఈ నాయకులకు ధైర్యంలేదు. కాని సోషలిస్టుశిబిరం అజేయమనేమాటను బహిరంగంగా ఒప్పుకోక తప్పడంలేదు. ఒప్పుకుంటున్నారు కూడా.

తమ దేశాలలోని ప్రజలే తమ దురాక్రమణ విధానాలను నిరాకరించడంతో సామ్రాజ్యవాద శక్తులస్థితి క్రమంగా బలహీనం అవుతూంది. గడిచిన పదేళ్ళలో

సామ్రాజ్యవాదం ప్రాచ్యదేశాలలో పరాజయం పొందడంకూడా వారు బలహీన పడడానికి మరో కారణం. ఇక్కడ శతాబ్దాల తరబడిగావున్న వలసవిధానపు మూల స్తంభాలు కూలిపోతున్నాయి. అక్కడి ప్రజలు అంతకంతకు ధైర్యంగా ముందు కొచ్చి తమ భవిష్యత్తును తామే నిర్ణయించుకోవడం ప్రారంభిస్తున్నారు.

## 4. సామ్రాజ్యవాద వలస వ్యవస్థ విచ్ఛిత్తి

సామ్రాజ్యవాదుల వలస విధానాన్ని అక్టోబరు విప్లవం చావుదెబ్బ కొట్టింది. అక్టోబరు మహా విప్లవానంతరం దానిని చూసిన వుత్సాహంతో వలసదేశాల ప్రజలలో జాతీయ విముక్తి పోరాటం పెద్దపెట్టున విజృంభించింది. తర్వాతకూడా అది కొన సాగుతూనేవచ్చి సామ్రాజ్యవాద వలస విధానంలో గొప్ప సంక్షోభాన్ని తెచ్చి పెట్టింది.

రెండో ప్రపంచ యుద్ధంలో ఫాసిస్టు జర్మనీ, సామ్రాజ్యవాద జపాను వోడి పోవడం వలసలలోనూ, పరాధీన దేశాలలోనూ స్వాతంత్ర్య పోరాటాలు విజృం భించడానికి బాగా తోడ్పడింది. ఫాసిజంమీద ప్రజాతంత్ర శక్తులు పొందిన విజయం పీడిత ప్రజల హృదయాలలో స్వాతంత్ర్యం సాధించగలమనే విశ్వాసాన్ని బలపరచింది.

తర్వాత చైనా విప్లవ విజయం వలస విధానంమీద మరో పెద్దదెబ్బ కొట్టింది. ఇది సామ్రాజ్యవాదానికి ఒక మహాపరాజయం.

జనాభావిషయంలో ప్రపంచంలోకల్లా రెండోస్థానం అలంకరిస్తున్న భారత దేశం రాజకీయ స్వాతంత్ర్యాన్ని సంపాదించుకొంది. బర్మా, ఇండోనేషియా, ఈజిప్ట్, సిరియా, లెబనాన్, సూడాన్ మొదలయిన దేశాలెన్నో వలస పీడననుంచి బయటపడ్డాయి. ఇంచుమించు నూట యిరవైకోట్లమంది ప్రజలు - అంటే ప్రపంచ జనాభాలో సగానికిపైగా జనం - గత పదేళ్ళలోనూ వలస, అర్థవలస స్థితినుంచి విముక్తి పొందారు.

ఈనాడు సామ్రాజ్యవాదుల వలసవిధానం శిథిలం అయిపోతూంది. యుద్ధా నంతరకాలంలో జరుగుతున్న చారిత్రక ప్రాముఖ్యతగల ఘటనలలో ఇదొకటి మానవజాతి పురోగమిస్తున్న రాజబాటమీద అడుగుపెట్టకుండా వలస ప్రభువులచే దూరంగా కొట్టబడిన ప్రజానీకం నేడు పునరుజ్జీవనం పొందుతూంది. నవచైనా, స్వతంత్ర భారతదేశమూ అగ్రరాజ్యాల స్థాయికి చేరుకొన్నాయి. ఆగ్నేయాసియా లోనూ, అరబ్బు రాజ్యాలలోనూ ప్రజలు సాగిస్తున్న రాజకీయ, ఆర్థిక పోరాటాల విజృంభణను మనకళ్ళతో మనం చూస్తున్నాం. ఆఫ్రికా ప్రజలు మేల్కొంటున్నారు. బ్రెజిల్, చిలీ మొదలైన దక్షిణ అమెరికా దేశాలలో జాతీయ విముక్తి పోరాటాలు పుంజుకొంటున్నాయి. స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకోసం పట్టుదలతో పోరాడే ప్రజల్ని సామ్రాజ్యవాదులు సాయుధ సేనలను ఉపయోగించినా అణచివేయడం సాధ్యంకాదని

కొరియా, ఇండోచైనా, ఇండోనేషియాలలో జరిగిన యుద్ధాలు స్పష్టం చేశాయి. వలస విధానాన్ని అందరూ అసహ్యించుకొంటున్నారు. దానిని పూర్తిగా నిర్మూలించడం నేడు ప్రధాన కర్తవ్యం అయింది. అత్యంత తీవ్రమైన తక్షణ సమస్యగా తయారయింది.

ప్రపంచ చరిత్రలో ఒక నూతన దశవచ్చింది. ఇటువంటి దశ వస్తుందని లెనిన్ ఏనాడో చెప్పాడు. ప్రాచ్య ఖండాల ప్రజ ప్రపంచ భవిష్యత్తును నిర్ణయించడానికై ముందుకొస్తూంది. అంతర్జాతీయ సంబంధాలలో వారొక బలవత్తరమైన శక్తిగా రూపొందుతున్నారు. యుద్ధానికి పూర్వంరోజుల్లోలాగ కాదు. ఆసియా దేశాలు ఎన్నో నేడు ప్రపంచరంగంలో స్వతంత్రంగా వ్యవహరిస్తున్నాయి. స్వతంత్రమైన విదేశాంగ విధానాన్ని అనుసరించడం తమ హక్కుగా పరిరక్షించుకొంటున్నాయి. అంతర్జాతీయ సంబంధాలన్నవి తెల్లవాళ్ళు నివసిస్తున్న దేశాల మధ్యగల సంబంధాలే అన్న దశ దాటింది. ఇప్పుడవి నిజంగా ప్రపంచ పరివ్యాప్త సంబంధాలుగా పరిణతం అవుతున్నాయి.

ఇదివరకు వలసలుగానూ-అర్ధవలసలుగానూ వున్న దేశాలలో ప్రజలు రాజకీయ స్వాతంత్ర్యం పొందడం వారు సంపూర్ణ స్వాతంత్ర్యం పొందడానికి అంటే ఆర్థిక స్వాతంత్ర్యం సంపాదించుకోటానికి మొట్టమొదటి అత్యంత ప్రధానమైన పూర్వ సోపానం (ప్రిరిక్విజిట్). విముక్తిపొందిన ఆసియాదేశాలు తమ పరిశ్రమల్ని తామే నిర్మించుకోడానికి పూనుకొన్నాయి. తమ సాంకేతిక నిపుణుల్ని తామే తయారుచేసుకొంటున్నాయి. ప్రజల జీవనప్రమాణాలను వృద్ధిపరుస్తున్నాయి. పురాతనములైన తమ జాతీయ సంస్కృతులను పునరుజ్జీవింపచేసుకొని వృద్ధిపొందించుకొంటున్నాయి. స్వతంత్రంగా అభివృద్ధిపొందేటందుకు పూనుకొన్న దేశాలు మంచి భవిష్యత్తు సంతరింప చేసుకొనేందుకు చారిత్రికావకాశాలు ఏర్పడుతున్నాయి.

ఈ దేశాలు సోషలిస్టు విధానాన్ని అనుసరిస్తున్నవి కాకపోయినా, సోషలిస్టు వ్యవస్థ సాధించిన విజయాల నుపయోగించుకొని, స్వతంత్రంగా తమ జాతీయార్థిక విధానాన్ని నిర్మించుకోవచ్చు. తమ ప్రజల జీవనస్థాయిని పెంపొందించుకోవచ్చును. ఇంతవరకూ తమ్ము పీడిస్తూవచ్చినవారివద్దకే ఆధునికయంత్రసామగ్రి నిమ్మని అవి యిక భిక్షాపాత్రతో బయలుదేర నక్కర్లేదు. సోషలిస్టు దేశాలు వాటి నిస్తాయి. ఇచ్చినందుకు ఏవిధమైన రాజకీయ బాధ్యతలుగాని, సైనిక బాధ్యతలుగాని వానిమీద మోపవు.

సోవియట్ యూనియన్, సోషలిస్టు శిబిరంలోని ఇతరదేశాల అస్తిత్వమూ, ఆదేశాలు తాము పొందిన పారిశ్రామికాభివృద్ధిని సమానహోదాతో పరస్పర లాభప్రాతిపదికపై బడుగుదేశాలకు సహాయం ఇవ్వడానికి సిద్ధంగావుండడం వలసవిధానానికి ఒక పెద్ద అవరోధం అయింది. గరిష్ఠలాభాలు గుంజుకొనేందుకు సంపన్న ఆగారాలుగా మాత్రమే వెనకబడినదేశాలను సామ్రాజ్యవాదులు యింకెంతమాత్రం పరిగణించ వీలులేదు. ఆ దేశాలకు వారు విధిలేక సదుపాయాలను కల్పించవలసివస్తోంది.

అయితే అన్ని దేశాలూ వలసపీడననుంచి బయటపడలేదు. ఆఫ్రికాలో చాల పెద్దభాగంలోనూ, ఆసియాలోని కొన్నిదేశాలలోనూ, మధ్యఅమెరికా, దక్షిణ అమెరికాలలోనూ వలస, అర్థవలస, పరాధీనత ఇంకా మిగిలేవుంది. సామ్రాజ్య వాద దేశాలకు వ్యావసాయిక ముడి పదార్థాలను సప్లయిచేసే స్థావరాలుగానే అవి వుంచబడ్డాయి. పరాధీన దేశాలలోని ప్రజల జీవనస్థాయి మరీ తక్కువగా వుంది.

తమ పలుకుబడిలో వుండగల మండలాలకోసమూ, తమకు ముడి సరుకులు పంపి, తమ వస్తువులు కొనుక్కొనే మార్కెట్ల కోసమూ వలసలుగల రాజ్యాల మధ్య వైరుధ్యాలూ, పోటీహెచ్చుతున్నాయి. యూరపు రాజ్యాల వలస లన్నింటినీ హరించడానికి అమెరికా పూనుకొంది. ఫ్రాన్సు చేతిలోంచి అమెరికా చేతిలోకి దక్షిణ వియత్నాం జారిపోతూంది. ఆఫ్రికాలోని ఫ్రెంచి, బెల్జియం, పోర్చుగీసు దేశాలకున్న స్థావరాలమీద అమెరికా గుత్తవ్యాపార సంస్థలు దాడి సాగిస్తున్నాయి. ఒకనాడు ఇరాన్ నూనె సంపద అంతా బ్రిటన్ అధీనంలో వుండేది. ఈనాడు ఆ అధికారంలో అమెరికాకు వాటా పెట్టవలసివచ్చింది. పైగా బ్రిటిష్ అధికారాన్ని పూర్తిగా తుడిచిపెట్టడానికై అమెరికా గుత్తవ్యాపార సంస్థలు ప్రయత్నిస్తున్నాయి. 'స్వేచ్ఛావ్యాపారం' పేరున పాకిస్తాన్ ఇరాక్ దేశాలలో అమెరికా పలుకుబడి పెరుగుతూంది.

మధ్య, దక్షిణ అమెరికాలలో తమకున్న అధికారాన్ని ఉపయోగించుకొని అమెరికన్ గుత్తవ్యాపారసంస్థలు ఆదేశాలలో చాలవాని ఆర్థికస్థితిని ఒకుగొమ్ముగా, అక్కడి ప్రజలకు చాల నష్టకరం అయ్యే విధంగా వక్రంచేస్తున్నాయి.

ఆదేశాలలో పారిశ్రామికాభివృద్ధిని అటంకపరుస్తున్నాయి. ఆర్థిక పరాధీనతా శృంఖలాలతో వానిని బంధిస్తున్నాయి.

తమ పెత్తనాన్ని పరిరక్షించుకోడానికీ, సడలిపోయిన పెద్దరికాన్ని గట్టిపరచుకోడానికీ వలసలుగల రాజ్యాలు వలస ప్రజల్ని ఆయుధబలంతో అణచివేయడానికి పూనుకొంటున్నారు. ఈ పద్ధతి కొత్తదీకాదు; చరిత్రలో ఎన్నడూ విజయంపొందనూ లేదు. బడుగు దేశాలకు 'సహాయం' పేరుతో కొత్తరకం వలసవిధానాన్ని నెలకొల్పడానిక్కూడా వారు ఉపక్రమించారు. ఈకొత్త పద్ధతిలో వారికి బోలెడన్నిలాభాలు వస్తాయి. ఉదాహరణకి అమెరికానే తీసుకొందాం. బడుగుదేశాలకు అమెరికా ఇచ్చే సహాయంలో హెచ్చుభాగం ఆయుధాలరూపంలో వుంటూంది. దీనివలన అమెరికను పరిశ్రమలకు ఆయుధాలకోసం ఆర్డర్లు దండిగా లభిస్తాయి. అమెరికన్ ప్రజలు చెల్లించిన పన్నుల ధనం కొన్నికోట్ల డాలర్లు ఆయుధ పరిశ్రమదారులకు చెల్లించి, ఆ ఆయుధాలను తీసుకొని బడుగుదేశాలకు పంపిస్తారు. ఈ విధంగా ఆయుధరూపంలో సహాయం తీసుకొన్న దేశాలు విధిగా పరాధీనతకు పాల్పడుతాయి. ఆ దేశాలు సైన్యాలను పెంచుకొంటాయి. వాని నిర్వహణకై పన్నులు పెంచుతారు. ఫలితంగా బడుగు దేశాలలో ప్రజల జీవనస్థాయి మరింత కుంగిపోతుంది.

బలోపేతస్థితి విధానాన్ని కొనసాగించడమే గుత్త వ్యాపారుల అభిలాష. ప్రచ్ఛన్నయుద్ధం అంతం అయితే వారికి లాభం వుండదు. ఎందుచేత ? యుద్ధోన్మాదాన్ని రెచ్చగొట్టడం సామ్రాజ్యవాద దురాక్రమణను సమర్థించుకోడానికే. ప్రజల్ని బెదరగొట్టడానికి, వారి మనస్సులను స్తంభింపచేసి పన్నుల నెక్కువచేసి, ఆ ధనంతో యుద్ధ సామగ్రులను కొని కోటీశ్వరుల బొక్కసాలు నింపినా సహించేటట్లు చేయడానికే యిది ఉద్దేశించబడింది. యుద్ధ పరిశ్రమను మంచి ఉచ్ఛస్థాయిలో నిలబెట్టి వుంచడానికీ, అమితమైన లాభాలు గడించడానికీ ఈ ప్రచ్ఛన్నయుద్ధవిధానం ఒక సాధనంగావుంది.

మామూలుగా బడుగు దేశాలకు ఇచ్చే 'సహాయం' కొన్ని ఖచ్చితమైన రాజకీయ షరతులమీద ఇస్తున్నారు.

సైనిక కూటాలలో చేరాలనో, సమిష్టిగా సైనిక సంధులు చేసుకోవాలనో, ప్రపంచాధిపత్యాన్ని సంపాదించేటందు కుద్దేశించబడిన అమెరికా విదేశాంగ విధానాన్ని సమర్థించాలనో షరతులు పెడుతున్నారు.

ఆగ్నేయాసియా, బాగ్దాద్ కూటాలు దురాక్రమణకోసం వుద్దేశించబడిన సైనిక, రాజకీయ కూటములుమాత్రమే కాదు. అవి బానిసలను చేసేటందుకు పనిముట్టు. బడుగుదేశాల్ని దోచుకోడాని కిదో కొత్తపద్ధతి. ఇదీ వలసదోపిడీవంటిదే. ఆగ్నేయాసియా కూటమి అనుసరించవలసిన విధానాన్ని నిర్ణయించేది పాకిస్తానూ కాదు. థాయిలాండూ కాదు. బాగ్దాదు కూటమి విధానాన్ని నిర్ణయించేది ఇరాకూ కాదు, ఇరానూ కాదు, టర్కీ కాదు. ఇది అందరికీ తెలిసినవిషయం.

ఈమాదిరి కూటాల్ని నిర్మించడమూ, కొన్ని దేశాలమీద మరికొన్ని దేశాల్ని రెచ్చగొట్టడమూ ఆర్థికంగా వెనకబడివున్న దేశాలను విభజించడానికి ఒక పనిముట్టు. చిరకాలమునుంచి వలసరాజ్యాధిపతులు అవలంబిస్తున్న విభజించి పాలించమనే సూత్రాన్ని కొనసాగించడాని కిదో సాధనం.

అరబ్బురాజ్యాల ఐక్యతను భగ్నపరిచేటందుకే బాగ్దాదుకూటమి నుపయోగించేటందుకు ప్రయత్నిస్తున్నారు. ఆగ్నేయాసియా కూటమి సాయంతో ఆగ్నేయాసియా దేశాలను విభజించడానికే వారు ప్రయత్నిస్తున్నారు.

ఈ కూటాలలో పాల్గొడానికి వ్యతిరేకంగా ప్రాచ్యదేశాలప్రజలుచేసే పోరాటం జాతీయ స్వాతంత్ర్యంకోసం చేసే పోరాటమే. తమ్ము వంచించి ప్రాంతీయ సైనిక కూటాలలో దూర్చడానికై పాశ్చాత్యదేశాలు పీడించి తొందర పెడుతుంటే, ఆగ్నేయాసియా మధ్యప్రాచ్యదేశాలు ఎన్నో వ్యతిరేకించాయి. ఇందులో అసహజమైనదేమీ లేదు.

బడుగుదేశాల ప్రజలను ఒకరిమీద ఒకర్ని రెచ్చగొట్టడానికీ, వారికీ, సోషలిస్టు శిబిరంలోని దేశాల ప్రజలకీ మధ్య పేచీలుపెట్టడానికి ఎన్నో ప్రయత్నాలు జరుగుతున్నా, వారిలో స్నేహమూ, సహకారమూ నిత్యం వృద్ధిపొందుతూంది.

29 ఆసియా, ఆఫ్రికా దేశాలు బాండుంగ్‌లో జరిపిన సభ చూస్తే, ప్రాచ్య దేశాల ప్రజలమధ్య ఏకీభావం ఏవిధంగా వృద్ధిపొందుతూందో కనబడుతూంది. ఆ సభలో చేసిన తీర్మానాలు ప్రాచ్యదేశాలలోని కోట్లాది ప్రజల అభిప్రాయాల్నే ప్రతిబింబిస్తున్నాయి.

స్వాతంత్ర్యం సంపాదించిన ప్రాచ్యదేశాల ప్రజలకీ, సోషలిస్టుదేశాల ప్రజలకీ మధ్య స్నేహ, సహకారాలు వృద్ధిపొందుతున్నాయి. బలపడుతున్నాయి. ఇండియా, బర్మాల ప్రతినిధులు సోవియట్ యూనియన్‌లో పర్యటించడం, సోవియట్ ప్రతినిధులు ఇండియా, బర్మా, ఆఫ్గనిస్తాన్‌లలో పర్యటించటమూ ఈ విషయాన్నే స్పష్టంచేస్తున్నాయి. ప్రపంచ శాంతి పరిరక్షణా, అన్నిరాజ్యాల స్వాతంత్ర్య పరిరక్షణా నేటి అతి ప్రధానమైన అంతర్జాతీయ సమస్య లయాయి. ప్రపంచంలోని గొప్పరాజ్యాలలో ఒకటయిన ఇండియా, సోవియటు యూనియనూ, బర్మా, ఆఫ్ఘనిస్తానులూ ఈ సమస్యమీద ఏకాభిప్రాయం కలిగివున్నట్లు ఈ పర్యటనలు ధృవపరుస్తున్నాయి.

సోవియట్ ప్రజాప్రతినిధుల కిచ్చిన అపూర్వ, మహత్తర స్వాగతం ప్రాచ్య దేశాల ప్రజానీకానికి సోవియట్ యూనియన్ యెడగల ప్రేమ విశ్వాసాల్ని ప్రకటిస్తూంది. ఈ విశ్వాసం ఎందుకో ఈజిప్ట్ 'అల్ అఖ్ బార్' ఇల్లా వ్రాస్తూంది:

"ప్రజల ఆత్మల్నీ, వారి హక్కుల్నీ, స్వాతంత్ర్యాన్నీ కొనెయ్యడానికి రష్యా ప్రయత్నించదు. వివిధ జాతుల ప్రజలకు రష్యా చేదోడు ఇచ్చింది. వారి భవిష్యత్తును వారినే నిర్ణయించుకోమంది. వారి హక్కుల్నీ, ఆశయాల్నీ తాను గుర్తిస్తూంది. సైనిక కూటాలకు కట్టుబడి వుండమని ఒత్తిడి చెయ్యదు"...వలస విధానానికి వ్యతిరేకంగా మనదేశం రాజీలేని పోరు సాగిస్తుండటాన్ని కోట్లాది ప్రజలు-స్త్రీ పురుషులు పెద్దగా అభినందిస్తున్నారు. అన్నిదేశాలూ సమానమనీ, అన్నీ స్నేహంగా వుండాలనీ చేప్తూన్న సోవియట్ విధానాన్ని అభినందిస్తున్నారు. శాంతికాముకమయిన విదేశాంగనీతిని అవిరామంగా అనుసరిస్తున్నందుకు అభినందిస్తున్నారు.

## 5. శాంతి సుస్థిర, అంతర్జాతీయ భద్రతలకొరకు సాగే పోరాటములో సోవియట్ యూనియన్

శాంతియుత విదేశాంగ విధానం అనే లెనిన్ సూత్రానికు కట్టుబడి వుంటూ సోవియట్ యూనియన్ అంతర్జాతీయ ఉద్రిక్తతను తగ్గించేందుకు, శాంతిని బలపరచడానికీ తీవ్రంగా కృషిచేసింది. పెద్ద పెద్ద విజయాలను సాధించింది. శాంతికోసం సోవియట్ యూనియన్ తీసుకొన్న చొరవ ఏ మార్గాలను వెంపొందిందో, వాటిలో ప్రధానమైన వాటిని జ్ఞప్తికి తెస్తాను.

మొదటిది: అగ్రరాజ్యాల మధ్య సంబంధాలలో అభివృద్ధి.

రెండవది : ప్రాచ్యభాగంలో యుద్ధాలకు కారణమైన స్థావరాలను తొలగించుట; యూరప్‌లోను, ఆసియాలోను యుద్ధానికి, తగాదాలకు కారణమైన కొత్త స్థావరాలు పెంపొందకుండా అరికట్టుట.

మూడవది : యూరప్‌లో ఉద్రిక్తతను తగ్గించడానికి, అనేక దేశాలతో మన సంబంధాలను సర్దుబాటు చేసుకోవడం, (సోదర యుగోస్లావియాతో సంబంధాలను తిరిగి మామూలుగా నెలకొల్పుకొనుట; ఆస్ట్రియాతో ప్రభుత్వ ఒడంబడిక చేసుకొనుట; సోవియట్, పశ్చిమ జర్మనీలమధ్య దౌత్యసంబంధాలను నెలకొల్పుకొనుట మొదలైనవి)

నాల్గవది : యూరప్‌లో సమిష్టి భద్రతా విధానాన్ని ఏర్పరచడం, నిరాయుధీకరణ, అణు ఆయుధాలను నిషేధించడం, జర్మనీ మొదలగు సమస్యలను పరిష్కరించడానికి కొత్తమార్గాలను అన్వేషించడం.

అయిదు : శాంతిని కాపాడాలని కోరే అన్నిదేశాలతోను సన్నిహిత సంబంధాలను పెంపొందించుకోడానికి నిశ్చిత చర్యలకు పూనుకొనడం.

ఆరు : అన్ని విధాలా అంతర్జాతీయ సంబంధాలను పెంపొందించుట. సోవియట్ రాజకీయవేత్తలు ఇతర దేశాల రాజకీయవేత్తలతో సంబంధాలు పెట్టుకొనడం. మన పార్టీ ప్రతినిధులు ఇతరదేశాల కార్మికపార్టీల ప్రతినిధులతో సంబంధాలు పెట్టుకొనడం. అలాగే ట్రేడ్‌యూనియన్లమధ్య సంబంధాలు పెట్టుకొనడం, పార్లమెంటరీ ప్రతినిధివర్గాల్ని, సాంఘిక ప్రతినిధివర్గాల్ని, తదితర ప్రతినిధివర్గాల్ని ఒక దేశంనుండి మరో దేశానికి పంపడం – వర్తక, ఆర్థికాది సంబంధాలను పెంపొందించడం – యాత్రీకుల సందర్శనలను ఎక్కువ చేయడం – విద్యార్థులను ఎక్కువగా మార్పిడిచేయడం మొదలైనవి.

సోవియట్ యూనియన్ శాంతి విషయంలో తీసుకొన్న చొరవ, అంతర్జాతీయ ఘటనలపై అద్భుతమైన పలుకుబడి కలిగిఉండటానికి ముఖ్యకారణాలలో ఒకటయింది.

శాంతి విషయంలో సోవియట్ తీసుకొన్న చొరవ జయప్రదంగావడానికి, శాంతి కాముకదేశాలన్నీ దానిని బలపరచడమూ, సమిష్టిగా కార్యాచరణకు పూనుకోవడమూకూడా తోడ్పడ్డాయి. ఈ విషయంలో మహాదేశమైన చైనా ప్రజా ప్రభుత్వం ప్రత్యేకంగా ప్రముఖపాత్ర వహించింది. కొరియా, ఇండో – చైనాలలో రక్తపాతాన్ని అంత మొదించడానికి చాలా కృషిచేసింది. ఆసియాలో సమిష్టి శాంతి ఒడంబడిక అనే ప్రసిద్ధ సూచనలను చేసింది. ఆసియాలోను, యావత్ప్రపంచంలోనూ శాంతి బలపడటానికి భారత మహాదేశ ప్రభుత్వంకూడా చాలా కృషిచేసింది. అంతర్జాతీయ సంబంధాలను సక్రమప్రాతిపదికపై నెలకొల్పడానికి సోవియట్ చేసే ప్రయత్నాలను సమస్త దేశాలలోని కోటానుకోట్ల సామాన్యప్రజలు గట్టిగా బలపరిచారు.

శాంతి కాముక ప్రభుత్వాల, ప్రజల ప్రయత్నాలు వృధాకాలేదు. యుద్ధానంతరం మొదటిసారిగా ఇప్పుడే అంతర్జాతీయ ఉద్రిక్త పరిస్థితిలో కొంత సడలింపు ప్రారంభమయింది. ఈ వాతావరణంలో నాల్గు అగ్రరాజ్య అధిపతుల సమావేశం

జెనీవాలో జరగడం సాధ్యమయినది. వివిధ దేశాలమధ్య సంప్రతింపుల పద్ధతి సరియైనదనీ, అందులో పటిష్ఠత వున్నదనీ జెనీవా సమావేశం రుజువుచేసింది. సహకరించుకొని ఒడంబడికకు వద్దామనే కోర్కె ఉభయపక్షాలలో వున్నట్టయితే, సంప్రతింపులద్వారా అత్యంత క్లిష్టమైన అంతర్జాతీయ సమస్యలనుకూడా పరిష్కరించుకో వచ్చుననే సోవియట్ అభిప్రాయం సరియైనదేనని ఈ సమావేశం ధృవపరిచింది.

జెనీవా సరళిని పూడ్చిపెట్టాలని కొందరిప్పుడు ప్రయత్నించుతున్నారు. సోవియట్ యూనియన్‌పై ఒత్తిడితెచ్చి, దానినుండి కొన్ని సౌకర్యాలను పొందాలనే ఆశను పాశ్చాత్య దేశాలలో కొన్ని వర్గాలవారింకా వదులుకోలేదని కొన్ని నిదర్శనలు కనపడుతున్నాయి. అలాంటి అంచనాలు అవాస్తవమైనవని ఎంత తొందరగా గ్రహించితే అంత మంచిది. అగ్రరాజ్యాలను సన్నిహితం చేయడానికి సోవియట్ యూనియన్ కృషిచేసింది. ఇక ఇప్పు డాపని చేయవలసింది అమెరికా, బ్రిటన్, ఫ్రాన్స్‌లు. అంతర్జాతీయ ఉద్రిక్తతను సడలించడానికి, శాంతిని బలపరచడానికి మరికొన్ని ప్రయత్నాలు సోవియట్ చేయదని దీని అర్థంకాదు. అనేక అంతర్జాతీయ సమస్యలపై అగ్రరాజ్యాలను సన్నిహిత పరచుటలో సోవియట్ ఎలా కృషిచేసిందో, అలాగే అన్నిదేశాల మధ్య, ముఖ్యంగా అగ్రరాజ్యాల మధ్య విశ్వాస సహకారాలను నెలకొల్పుటలో అది మరింత గట్టిగా కృషిచేస్తుంది. అగ్రరాజ్యాలు ఈ విషయంలో సమానంగా పాటుపడటం, పరస్పర సౌకర్యాలు కలుగజేసుకోవడం పూర్తిగా అవసరం. అంతర్జాతీయ సమస్యలను పరిష్కరించుకోడానికి సంప్రతింపుల పద్ధతి ఒక్కటే మార్గం కావాలి.

యూరప్‌లో సమిష్టి భద్రతను సాధించడం, ఆసియాలో సమిష్టి భద్రతను సాధించడం, నిరాయుధీకరణ - ఈ మూడూ ముఖ్య సమస్యలు. ఈ సమస్యల పరిష్కారం శాశ్వతమైన సుస్థిర శాంతికి పునాదులను వేయగలదు.

యూరప్‌లో సమిష్టి భద్రతా వ్యవస్థను నెలకొల్పడం చిన్నా, పెద్దా, యూరప్ దేశా లన్నింటి ముఖ్యప్రయోజనాలకు అనుగుణ్యంగా వుంటుంది. అదే సమయాన ప్రపంచ మంతటా శాంతికి పెట్టని కోటగా పనిచేస్తుంది. జర్మన్ సమస్యా పరిష్కారంకూడా అది సుసాధ్య మయేటట్లు చేస్తుంది. ఈ సమస్య విషయమై ప్రస్తుత పరిస్థితి ఆందోళన కల్గించే విధంగావుంది. జర్మనీ ఇంకా విభజితమైవుంది; పశ్చిమ జర్మనీ సాయుధీకరణ త్వరితం చేయబడుతూంది. జర్మన్ సైనిక తత్వాన్ని పునరుద్ధరించడంలో, పశ్చిమ రాజ్యాలు మూడూ తమ తమ స్వంత లాభాలను సాధించుకొనే ఉద్దేశ్యంతోనే చేస్తున్నారనేది రహస్యమేమీ కాదు. హ్రస్వ దృష్టితో కూడిన ఈ విధానంవల్ల లాభపడేది ఎవరు ? అందరికన్నా పశ్చిమ జర్మనీ సామ్రాజ్యవాద శక్తులే లాభపడతారు. నష్టపడేవారిలో అగ్రతాంబూలం ఫ్రాన్స్‌కు చెందుతుంది. ఈ విధానంవల్ల ఫ్రాన్స్ మూడోరకం రాజ్యస్థాయికి దిగజార్చబడుతుంది. వాషింగ్‌టన్ - బాన్ (అమెరికా - పశ్చిమజర్మనీ)ల కొత్త

కలయిక ఒకటి మరింత స్పష్టంగా తలయెత్తుతూంది; ఆ విధంగా యుద్ధ ప్రమాదాన్ని ఇనుమడింపజేస్తూంది.

జర్మన్ సమస్యను మరోవిధంగా పరిష్కరించడానికి, జర్మన్ ప్రజలతో సహా సమస్త ప్రజల శాంతి భద్రతల ప్రయోజనాల దృష్ట్యా పరిష్కరించడానికి, ప్రస్తుత పరిస్థితి నిజమైన అవకాశాలను కల్గించుతూంది. శాంతిని వాంఛించే సోవియట్ యూనియన్ బలం ఇదివర కెన్నడూ లేనంతగా పెంపొందింది. ఆగ్నేయ యూరప్ దేశాలు గతంలో జర్మనీకి ముడిపదార్థాలూ, మంది మార్బలాన్ని సప్లయి చేశాయి. కాని ఇపుడు అవి సోవియట్ యూనియన్‌తో కలసి జర్మన్ ప్రతీకార శక్తులవల్ల రాగల దురాక్రమణను అరికట్టగల బలమైన అడ్డుగోడగా వున్నాయి. గతంలో జర్మనీ మిత్రదేశమైన ఆస్ట్రియా, తాను తటస్థ విధానాన్ని అవలంబించు తున్నట్లు ప్రకటించింది. పశ్చిమ యూరప్‌లోని అన్ని దేశాలలోను శాంతికాముక శక్తులు పనిచేస్తున్నాయి. జర్మనీలోనే వివిధ శక్తుల కలయిక గతంకంటె భిన్నంగా వుంది.

యుద్ధాన్ని వ్యతిరేకించుతున్న జర్మన్ ప్రజాతంత్ర రిపబ్లిక్ (తూర్పుజర్మనీ) నేడు ఎంతగా బలపడివుందంటే జర్మనీ సమస్యను అది పాల్గొనకుండా పరిష్కరించడంగాని, లేక దానికి నష్టం కల్గేరీతిగా ఆ సమస్యలను పరిష్కరించడంగాని సాధ్యంకాని పని. మరో కొత్త యుద్ధ స్థావరంగా జర్మనీనిమార్చే ప్రయత్నాలను జర్మన్ ఫెడరల్ రిపబ్లిక్ (పశ్చిమజర్మనీ)లోని లక్షలాది కార్మికులు ఇతర దేశభక్తియుత శక్తులతో గలిసి నానాటికీ ఎదిరించుతూ వున్నారు.

యూరప్‌లో సమిష్టి భద్రతావ్యవస్థ, పారిస్ ఒడంబడికలను పరిత్యజించడం, రెండు జర్మన్ ప్రభుత్వాలమధ్య సహకార సామరస్యాలు - ఇదే జర్మన్ సమస్య పరిష్కారానికి సరియైన మార్గం. అసలు జర్మన్లు పాల్గొనకుండానే, వారి ప్రధాన ప్రయోజనాలకు హానికల్గించే విధంగా జర్మనీ సమస్యను పరిష్కరించాలని కొన్ని వర్గాలవారు ప్రయత్నించుతున్న విషయం రహస్యమేమీ కాదు. అలాంటి విధానం విధిగా విఫలమవుతుందనడంలో సందేహంలేదు. (హర్షధ్వానాలు)

ఆయుధధారణ పోటీని అంతంచేయడం, మానవజాతి అతి ముఖ్యకర్తవ్యాలలో ఒకటిగావుంది. అయితే ఇది చిక్కులతో గూడిన సమస్య. అయినప్పటికీ మరింతపట్టుదలతో, శక్తితో దాని పరిష్కారానికి ప్రయత్నించాలి.

నిరాయుధీకరణ సమస్యపై ఏర్పడిన ప్రతిష్టంభనను తొలగించడానికి సోవియట్ యూనియన్ ఏమీ ప్రయత్నం చేయలేదని ఎవరూ అనలేరు. 1955 మే 10 న సోవియట్ చేసిన సూచనలు, సోవియట్ సేనల తగ్గింపు, సోవియట్ అవలంబించిన ఇతర చర్యలు అందరికీ తెలిసినవే. పశ్చిమరాజ్యాలు విషయంలో అవి పైవిధంగా పనిచేశాయని చెప్పలేము. నిరాయుధీకరణను రెండు దశలలో చేయాలనీ, సైనిక దళాలకు గరిష్ఠపరిమితి నిర్ణయించాలనీ బ్రిటను, ఫ్రాన్స్, అమెరికాల సూచన

 

లను సోవియట్ అంగీకరించిన వెంటనే ఆ పశ్చిమరాజ్యాలు వెనక్కు తగ్గసాగాయి. పైగా సోవియట్ యూనియన్ చేసిన నిర్దిష్ట ప్రతిపాదనలను అంగీకరించటిరస్కరించ డమే గాక, తమ స్వంత సూచనలనే త్రోసిపుచ్చ సాగాయి.

అంతర్జాతీయ ఉద్రిక్తవాతావరణంలో నేడు కనబడుతున్న సడలింపును విచ్ఛిన్నంచేసి దాడిసాగించాలని ప్రయత్నించుతూ, ఆ "బలాధిక్యతగల స్థానాలు" కావాలని మొండిగా కోరేవారి ప్రభావంవల్లనే ఇది జరిగిందని సుస్పష్టమే. శాంతి కాముక దేశాలు సహజంగా ఈ పరిస్థితివల్ల తగు అభిప్రాయాన్ని ఏర్పరచుకొని తమ దేశాల భద్రతను మరింత గట్టిపరచుకోవలసియుంటుంది.

తమ బలాలను, సంపత్తినీ కూడగట్టుకోవలసిన పరిస్థితి ఏర్పడి మన దేశాలు వార్సా ఒడంబడికను చేసుకొన్నాయి. ఈ ఒడంబడిక యూరప్‌లో స్థిరత్వం కల్గించే ప్రముఖ అంశం. తమ దేశాలలోని ప్రజల శాంతియుత జీవితాన్ని కాపాడటానికి, యూరప్‌లో మరోయుద్ధం తలయెత్తకుండా నిరోధించడానికీ, తమ శక్తులనన్నిటినీ వినియోగించడానికి ఈ దేశాలు కృతనిశ్చయమై వున్నాయి.

నిరాయుధీకరణ విషయంలో ఈ ముఖ్య సమస్యను పరిష్కరించడానికి మనం అన్నివిధాలా ప్రయత్నించుతాం.

ఆయుధాలపోటీని అంతం చేయడానికీ, అణు - హైడ్రోజెన్ బాంబుల నిషేధించడానికీ మనం కృషి చేస్తూనేవుంటాం. నిరాయుధీకరణకు సంబంధించిన ముఖ్య విషయాలపైన ఒడంబడిక కుదిరేముందు, కొన్ని పాక్షిక చర్యలను తీసుకోడా నికి మనం సంసిద్ధంగా ఉన్నాం. ఉదాహరణకు, అణు - హైడ్రోజన్ బాంబుల పాటవ పరీక్షలను నిలిపివేయడానికి, జర్మనీలోని సేనలకు అణు ఆయుధాలు లేకుండా చేయడానికి, సైనిక బడ్జెటులను తగ్గించడానికి మనం సంసిద్ధంగా వున్నాం. అలాంటి చర్యలను అన్నిదేశాలు అమలు పరిచినట్లయితే, ఒకరి నొకరు అర్థంచేసుకోడానికి దారి తీస్తుంది. నిరాయుధీకరణ విషయంలో మరింత చిక్కుతో కూడిన సమస్యలను పరిష్క రించుకోడానికి మార్గాన్ని సుగమం చేస్తుంది.

అంతర్జాతీయ శాంతినీ, భద్రతనూ రక్షించడానికి అవసరమైన చర్యలన్నిటినీ తీసుకోడానికి సోవియట్ యూనియన్ దృఢ నిశ్చయురాలై వుంది.

ప్రపంచంలోని రెండు అత్యంత అగ్రరాజ్యాలయిన సోవియట్ యూనియన్, అమెరికాల మధ్య దృఢమైన స్నేహ సంబంధాలు ఏర్పడటం, ప్రపంచ శాంతిని బలపరచడంలో గొప్ప ప్రాముఖ్యత కల్గివుంటుంది. చిరపరచితమైన శాంతియుత సహజీవన సిద్ధాంతాలపైన సోవియట్, అమెరికా సంబంధాలు ఆధారపడినట్లయితే, అది నిజంగా మానవ జీవితాని కెంతో గొప్పప్రాముఖ్యమైన విషయమౌతుంది. సోవి యట్ ప్రజలకన్నా, ఇతరప్రజలందరికన్నా కూడా అమెరికాకు అది ఏమంత తక్కువ ఉపయోగకరమయినది కాబోదు. ఈ సూత్రాలను అనగా - ప్రాదేశిక భద్రత, సార్వభౌమాధికారాలపట్ల పరస్పర గౌరవం - నిరాక్రమణ, ఒకరి అంత

రంగిక వ్యవహారాలలో మరొకరు జోక్యం కల్గించుకోనకపోవడం - సమానత్వం - పరస్పరలాభం - శాంతియుత సహజీవనం - ఆర్థిక సహకారాలను అనేక దేశాలు అంగీకరించి బలపరచాయి.

సోవియట్ — అమెరికా సంబంధాలలో ప్రధానమయిన అభివృద్ధిని సాధించడానికి యిటీవల మనం కొత్తగా కొన్ని ముఖ్యచర్యలు తీసుకొన్నాం. అమెరికా అధ్యక్షుడు ఐసెన్‌హోవర్‌కు కామ్రేడ్ బుల్గానిన్ వ్రాసిన లేఖలో చెప్పినట్లుగా, సోవియట్, అమెరికాల మధ్య స్నేహ సహకారాల సంధి ఏర్పడాలనేది నా మనస్సులోవుంది.

అమెరికాతో మనం స్నేహంగా ఉండాలని కోరుతున్నాం. శాంతి అంతర్జాతీయ భద్రతలకోసం సహకరించాలని కోరుతున్నాం. ఆర్థిక, సాంస్కృతిక రంగాలలో కూడా సహకరించగోరుతున్నాం. ఇది మనం సదుద్దేశంతోనే సూచిస్తున్నాం. కాని కత్తి చాటుగాపట్టుకొని మాట్లాడటంలేదు. అమెరికాతో అలాంటి ఒడంబడిక చేసుకోకపోతే సోవియట్ దేశం బ్రతకజాలదని మనమీ సూచనలు చేయడంలేదు. అమెరికాతో సాధారణ దౌత్యసంబంధాలులేని రోజులలోకూడ సోవియట్ ప్రభుత్వం మనుతూనేవుంది; జయప్రదంగా అభివృద్ధిచెందుతూనేవుంది. శాంతియుతంగా, స్నేహంగా జీవించాలని ఉభయదేశాలు గాఢంగా వాంఛిస్తున్నారు. ఆ వాంఛను ఈ ఒడంబడిక తీర్చుతుంది కాబట్టే మనమీ సూచనను చేశాం (హర్షధ్వానాలు).

సోవియట్, అమెరికాలమధ్య సత్సంబంధాలు ఏర్పడక పోయినట్లయితే, ఇంకా పరస్పర అవిశ్వాసం అలాగే కొనసాగితే ఆయుధాల పోటీ మరింత పెద్ద యెత్తున జరగడానికి దారితీస్తుంది. మరింత ప్రమాదకరంగా ఉభయపక్షాలు బలాన్ని కూడ గట్టుకోడానికి దారితీస్తుంది. ఇదేనా సోవియట్ ప్రజలుగాని, అమెరికా ప్రజలుగాని కోరేది ? కానేకాదు.

మనం తీసుకొన్న ఈ చొరవను అమెరికా తగువిధంగా అర్థం చేసుకోనూ లేదు, బలపరచనూ లేదు. ప్రముఖమైన సమస్యలు యుద్ధం ద్వారానే తేల్చివేసుకోవాలనే పద్ధతిని సూచించేవారే నేడు అమెరికాలో బలమైనస్థానాల్లో వున్నారనీ, వారు అమెరికా అధ్యక్షునిమీదా, ప్రభుత్వంమీదా, గట్టి ఒత్తిడి తెస్తున్నారనీ ఇది స్పష్టం చేస్తూంది. మన శాంతియుత వాంఛను అమెరికాలో మరింత సరిగా అర్థం చేసుకొంటారనీ, పరిస్థితులు ముమ్ముందు బాగుపడతాయనీ మనం ఆశించుదాం.

మునుపటి లాగానే, బ్రిటన్, ఫ్రాన్సులతో మన సంబంధాలను ఇంకా అభివృద్ధిచేసుకోవాలని కోరుతున్నాం. యూరోపియన్ దేశాలుగా మనదేశాలకు సమిష్టి ఆశయాలు చాలా వున్నాయి. అన్నిటికన్న మరో యుద్ధాన్ని నిరోధించవలసిన ఉమ్మడి ప్రయోజనం ఒకటి వుంది. యూరప్‌లోనే రెండు ప్రపంచ యుద్ధాలు ప్రారంభమయ్యాయి. సైనిక జర్మనీ ఈ యుద్ధాలకు ఉత్పత్తిస్థానంగా వుంటూ వచ్చింది. సోవియట్ యూనియన్, ఫ్రాన్సు, బ్రిటన్ ప్రజలు

పోలెండ్, జకోస్లావేకియా, యుగోస్లావియా, బెల్జియం, అల్బేనియా, ఇతర యూరప్ దేశాల ప్రజలతో కలిసి తమ ఉమ్మడి శత్రువును ఓడించడంలో ఎంతో రక్తాన్ని ధారపోశారు. యూరప్‌లో అగ్రరాజ్యాలుగా సోవియట్, బ్రిటన్, ఫ్రాన్సులు శాంతివల్లకలిగే లాభాలను పవిత్రంగా ఎంచుతూ, మరో యుద్ధం రాకుండా తమ శక్తినంతా ధారపోయాలి. ఈనాడు ఈ విషయాన్ని ప్రత్యేకంగా యెందుకు గుర్తుకు తెచ్చుకోవాలంటే, యూరప్ ప్రజలందరి భద్రతకు ప్రత్యక్ష ప్రమాదాన్ని కల్గించే ప్రతీకార వాంఛాపర పశ్చిమజర్మన్ యుద్ధ యంత్రం వేగంగా అభివృద్ధి చేయబడుతూంది. యూరప్‌లో సుస్థిర శాంతి భద్రతలను కాపాడటానికి మనదేశం వ్యక్తపరచే అభిలాష తాత్కాలికమైనది కాదు. సోవియట్, బ్రిటన్, ఫ్రాన్స్‌లమధ్య వర్తకమూ అన్నివిధాల సంబంధాలు ఏర్పర్చుకోడానికీ, పరస్పరం అర్థం చేసుకోడానికీ, సహకరించుకోడానికీ ఇది నమ్మకమైన పునాదిని ఏర్పరచుతుంది.

తూర్పుదేశాలతో స్నేహసహకారాలను మరింత వృద్ధిచేసి బలపరచుకోవాలని సోవియట్ యూనియన్ నిర్విరామంగా కృషిచేస్తూనే వుంటుంది. మన దేశానికీ భారతదేశానికీమధ్య మంచి స్నేహసంబంధాలు ఏర్పడ్డాయన్న సంగతిని మనం సంతోషంతో గమనించవచ్చు. ఈ సంబంధాలకింకా మంచిభవిష్యత్తున్నదని మా విశ్వాసం. అరబ్బుదేశాల ప్రజలు తమ జాతీయ స్వాతంత్ర్యాన్ని నిలబెట్టుకోవాలని కోరుతున్నారు. మనం వారి కోర్కెను హర్షిస్తున్నాం.

ఇరాన్, టర్కీ, పాకిస్తాన్‌లు కూడా సోవియట్‌తో మామూలు సంబంధాలు పెట్టుకోడం వాటి ముఖ్యప్రయోజనాలకు అవసరమని గుర్తించుతాయని మా విశ్వాసం.

మనలాగే, శాంతిని కాపాడాలనికోరే దేశాలన్నిటితోనూ స్నేహ సంబంధాలను పెంపొందించి బలపరచాలనేది మన తిరుగులేని సూత్రం.

సైనిక కూటాలున్న నేటి పరిస్థితులలో కూడా, వివిధ దేశాలమధ్య, ముఖ్యంగా ఇరుగు పొరుగు దేశాలమధ్య సంబంధాలు అభివృద్ధి అయ్యేఅవకాశాలు పూర్తిగా అంతరించిపోలేదు. నిరాక్రమణ సంధులు, స్నేహసంధులు చేసుకోనడంవల్ల వివిధదేశాలమధ్య ప్రస్తుతమున్న అనుమానం, అపనమ్మకం తొలగిపోయి, అంతర్జాతీయ పరిస్థితి మామూలుస్థితికి వస్తుందన్న విషయాన్ని యీ సందర్భంలో నొక్కి చెప్పవలసియుంది. అలాంటి సంధులు చేసుకోడానికి సోవియట్ యూనియన్ మాత్రం సంసిద్ధంగా వుంది.

వివిధదేశాలమధ్య సంబంధాలు మరింత అభివృద్ధిచెందడానికి వర్తక, సాంస్కృతిక సంబంధాలు విస్తృతమవడం చాలాముఖ్యం. ఈ సంబంధాలను సర్వతోముఖంగా అభివృద్ధి చేయడానికి సోవియట్ ప్రభుత్వం తనవల్ల నయినదంతా చేస్తూంది. సోవియట్ యూనియన్‌కూ, అనేక దేశాలకూమధ్య వివిధ ప్రతినిధివర్గాల మార్పిడీ, వర్తక సంబంధాలూ యిటీవల చాలవరకు విస్తృత మయ్యాయి.

చిన్న తరహా పరిశ్రమలు, భవన నిర్మాణం, వ్యవసాయం మొదలగు వాటికిచెందిన సోవియట్ కార్మికుల ప్రతినిధులు బ్రిటన్‌ను సందర్శించారు. వీటికి సోవియట్ ప్రభుత్వ సభ్యులు నాయకత్వం వహించారు. ఇంతేగాక, కార్మికసంఘాల ప్రతినిధులు, శాస్త్ర, సంస్కృతీ శాఖలలో పనిచేసేవారు, వ్యాయామక్రీడలకు సంబంధించినవారుకూడా బ్రిటన్‌ను సందర్శించారు. ఈ సంబంధాలను విస్తృత పరచడానికి బ్రిటిష్ ప్రభుత్వం సహాయపడింది. సోవియట్ ప్రతినిధులను బ్రిటన్‌లో బాగా ఆదరించారు. ప్రతినిధివర్గాలలోగాని, వ్యక్తిగతంగాగాని సోవియట్‌కు వచ్చిన బ్రిటిష్ పౌరులనుకూడా మనం బాగానే ఆదరించాం- ఈ విషయంలో ఎట్టి ఫిర్యాదూ రాదని నా అభిప్రాయం.

సోవియట్‌కూ, ఫ్రాన్స్, స్వీడెన్, ఫిన్లాండ్, నార్వే మొదలగు దేశాలకు మధ్య సంబంధాలుకూడ ఇదే ధోరణిలో పెంపొందుతున్నాయి.

గత సంవత్సరం అమెరికాతో కూడ ప్రతినిధివర్గాల మార్పిడి జరిగింది. ముఖ్యంగా సోవియట్ వ్యవసాయ ప్రతినిధివర్గాన్ని అమెరికాలో బాగా ఆదరించారు. సోవియట్ పత్రికావిలేఖరులు, భవన నిర్మాణ కార్మికులు, వైద్యుల ప్రతినిధులు కూడా అమెరికాను సందర్శించారు. అయినప్పటికీ, అమెరికాతో సంబంధాల అభివృద్ధి ఇంకా చాలా అల్పంగానే వుంది. అనేకమంది అమెరికా రాజకీయవేత్తలు ప్రముఖులు, వ్యక్తులు ఈకాలంలో సోవియట్ యూనియన్‌ను సందర్శించడానికి వచ్చారు. సోవియట్‌ను సందర్శించడంలో అమెరికా పౌరులకు ప్రతి అవకాశమూ ఈయబడింది. వారిని ఇక్కడ బాగా ఆదరించారు. కాని సోవియట్ ఇంజనీర్లు, సైంటిస్టులు, రచయితలు, చిత్రకారులు, అమెరికా సంస్థలనుండి, కంపెనీలనుండివచ్చిన ఆహ్వానాలను దురదృష్టవశాత్తు ఉపయోగించుకోలేక పోయారు. అమెరికా అధికారులు వారికి అవసరమైన ప్రవేశపత్రా లివ్వలేదు. ఇందువల్ల ఈ దేశాలమధ్య సంబంధాలు పెంపొందలేదన్న విషయం స్పష్టమే. ఈ పరిస్థితి మారి బాగుపడుతుందని ఆశిద్దాం.

మన దేశాలమధ్య వ్యవహార సరళిలో సహకారంఅనే ప్రాతిపదికను విస్తృతం చేయడంలో వర్తకం పెద్ద పాత్ర వహించాలి. ఉత్తర అట్లాంటిక్ కూటమి యిచ్చే "సాయుధుల మవుదాం" అనే నినాదానికి బదులుగా మనమిచ్చే నినాదం: "మనం వర్తకం చేసుకొందాం" అని. ప్రజాతంత్ర ప్రజాస్వామిక దేశాలతోను, ఇతర దేశాలన్నిటితోనూ, వర్తకసంబంధాలు తగినంతగా పెంపొందిడానికి మన నూతన పంచవర్ష ప్రణాళికలో అవకాశం వుంది.

మన అందరి మహోన్నత సమిష్టి ఆశయమైన సోషలిజం కోసం, సోషలిస్టు శిబిరంలోని దేశాలమధ్య సోదర సంబంధాలను నిర్విరామంగా పెంపొందించి బలపరచడం మన సర్వోత్కృష్ట అంతర్జాతీయ విధియని భావిస్తున్నాం (దీర్ఘ హర్షధ్వానాలు).

# 6. నేటి అంతర్జాతీయ పరిణామానికి సంబంధించిన కొన్ని మౌలిక సమస్యలు

కామ్రేడ్స్,

ఈనాటి అంతర్జాతీయ పరిణామానికి సంబంధించిన కొన్ని మౌలికసమస్యలను గురించి ప్రస్తావించదలిచాను. నేడు జరుగుతున్న ఘటనలగతిని మాత్రమేకాక, భవిష్యదవకాశాలనుకూడా అవి నిర్ధరిస్తాయి.

రెండువ్యవస్థల శాంతియుత సహజీవనం, వర్తమానయుగంలో యుద్ధాల నివారణకుగల అవకాశం, వివిధదేశాలలో రూపొందే సామ్యవాద పరివర్తనా రూపాలు - యివే ఆ సమస్యలు.

స్థూలంగా ఆ సమస్యలను పరిశీలిద్దాం.

## రెండు వ్యవస్థల శాంతియుత సహజీవనం :

విభిన్న సామాజిక వ్యవస్థలు అమలునందుగల రాజ్యాలమధ్య శాంతియుత సహజీవనం అన్న లెనినిస్టు సూత్రమే మనదేశ వైదేశిక నీతికి సదా మూలకందంగా వుంటూ వస్తోంది.

కేవలం ఎత్తుగడల దృష్టితోను, సౌలభ్యదృష్టితో మాత్రమే సోవియట్ యూనియన్ శాంతియుత సహజీవన సూత్రాన్ని ముందుకు తెస్తున్నదని కొందరు ఆరోపిస్తున్నారు. అయితే సోవియట్ రాజ్యం అవతరించిన దాదిగా, నాటినుంచి నేటివరకు, మనం ఎప్పుడూకూడా శాంతియుత సహజీవనం కొరకే, తదేకపట్టుదలతో, నిలబడుతూ వచ్చామన్న సంగతి అందరికీ తెలిసినదే. అందువల్ల అదేదో ఎత్తుగడమాత్రం కాదు; సోవియట్ వైదేశిక నీతికి సంబంధించిన మూలసూత్రం అది.

కాబట్టి ఒకవేళ విభిన్న సామాజిక, రాజకీయ వ్యవస్థలు గల దేశాలమధ్య శాంతియుత సహజీవనానికి నిజంగా ప్రమాదమే కనుక ఏర్పడితే, సోవియట్ నుంచి గాని, లేక సామ్యవాద శిబిరంనుంచిగానీ ఆముప్పు ఏర్పడదని ఘంటాపథంగా చెప్పవచ్చు. ఏ సోషలిస్టు దేశమైనా దురాక్రమణ యుద్ధాన్ని వాంఛిటానికి అసలు ఎలాంటి హేతువైనా వున్నదా? యుద్ధాన్ని ఒకసాధనంగా వినియోగించుకొని కుబేరులు కావాలని కోరుకుంటున్న వర్గాలుగానీ, ముఠాలుగానీ మనదేశంలో వున్నాయా? అలాంటివేవీ లేవు. అలాంటివాటిని ఏనాడో మనం రద్దుపర్చాం. పోనీ తగినంత భూభాగం కాని, సహజసంపదకాని మనకు కరువైయ్యాయా? ముడిసరుకులుగాని మన సరకులకు మార్కెట్లుగాని తగినంత లేకుండా పోయాయా? అంటే అలాంటిదేమీలేదు. అవి మనకు కావలసినంతగా వున్నాయి. అయినప్పుడు యుద్ధాన్ని మనం ఎందుకు కోరుకుంటాం? మనం యుద్ధాన్ని వాంఛించం. వేళ్ళమీద లెక్కించదగిన కొద్దిమంది కోటీశ్వరుల స్వార్థప్రయోజనార్థం కోటానుకోట్ల జనానీకాన్ని యుద్ధాగ్ని గుండంలోకి పడద్రోసేందుకు దారితీసే కార్యవిధా

వాలను ఖండించటం మన పరమలక్ష్యంగా పెట్టుకొన్నాం. సోవియట్ యూనియన్ "దురాక్రమణోద్దేశాలను" గురించి గొంతుచించుకొనే వారికి ఇదంతా తెలియదా ? తెలుసు. అయితే వూహాకల్పితమైన "కమ్యూనిస్టు దురాక్రమణ" గురించిన పుక్కిటి పురాణాలను వారంతా ఎందుకు వల్లిస్తున్నట్టు ? పరిస్థితిని గందరగోళపర్చి, ప్రపంచాధిపత్యంకోసం తాము పన్నిన పన్నాగాలను, శాంతికీ, ప్రజాతంత్రానికీ, సామ్యవాదానికీ వ్యతిరేకంగా తాము సాగించే 'ధర్మసంగ్రామాన్ని' కప్పిపుచ్చుకొనేందుకే వారు ఆపని చేస్తున్నారు.

ఇతరదేశాలలోకి విప్లవాలను ఎగుమతి చేయటంద్వారా సోవియట్ యూనియన్ పెట్టుబడిదారీ విధానాన్ని కూలద్రోయ సంకల్పించిందంటూ శాంతికి శత్రువులైవారు నేటికీ ఆరోపిస్తున్నారు. కమ్యూనిస్టులమైన మనలో పెట్టుబడిదారీ విధానాన్ని సమర్థించేవారు లేరని వేరే చెప్పనక్కరలేదు. అంటే దానిఅర్థం పెట్టుబడిదారీ విధానం యింకా అమలునందుగల దేశాల ఆంతరంగిక వ్యవహారాలలో మనం జోక్యం కల్పించుకొన్నామనిగానీ, కల్పించుకొన తలపెట్టామనిగానీ కానేకాదు. రోమారోలా అన్నట్లు "స్వాతంత్ర్యం అన్నది బయటనుంచి రైలుబళ్ళలో తీసుకొచ్చే సరుకుకాదు." (నవ్వు) ఆజ్ఞలు జారీచేస్తే విప్లవాలు పుట్టుకొస్తాయని భావించటం నిజంగా వెర్రితనం. బూర్జువా దేశాల ప్రతినిధులు ఈ విధంగా వాదిస్తూండటం మనం తరచువింటుంటాము. "రెండు వ్యవస్థలమధ్య శాంతియుత సహజీవనంకొరకే తాము సుముఖులమని సోవియట్ నాయకులు వక్కాణిస్తారు. అదే సమయంలో కమ్యూనిజంకోసం తాము పోరాడుతున్నట్టూ, అన్ని దేశాలలోనుకమ్యూనిజమే నెగ్గితీరుతుందన్నట్టూవారు ఉద్ఘాటిస్తారు. కమ్యూనిజంకొరకు సోవియట్ యూనియన్ పోరాటం సాగిస్తోంటే ఇక శాంతియుత సహజీవనం అనేది ఎలాసాధ్యం ?" బూర్జువావర్గం సాగించిన ప్రచారాల ఫలితంగా ఇలాంటి అభిప్రాయాలు ఏర్పడ్డాయి. బూర్జువా సిద్ధాంతవేత్తలు యధార్థ విషయాలను తారుమారు చేస్తూ సోవియట్ యూనియన్ కమ్యూనిస్టులను దురాక్రమణపరులుగా చిత్రించేందుకు సైద్ధాంతిక పోరాటానికి సంబంధించిన సమస్యలను దేశాలమధ్య సంబంధాలకు చెందినసమస్యలతో కలగాపులగం చేస్తున్నారు.

రెండు వ్యవస్థలమధ్య - పెట్టుబడిదారీ, సోషలిస్టు వ్యవస్థలమధ్య - పోటీలో సోషలిస్టు వ్యవస్థే నెగ్గితీరుతుందని మనం చెప్పతున్నామంటే అర్థం పెట్టుబడిదారీ దేశాల ఆంతరంగిక వ్యవహారాలలో సోషలిస్టుదేశాలు సాయుధజోక్యం కల్గించుకోటం ద్వారా ఆ విజయం సాధించబడుతుందని కానేకాదు. పెట్టుబడిదారీ ఉత్పత్తి విధానంకన్నా సోషలిస్టు ఉత్పత్తి విధానం ఉత్తమ తరగతికి చెందిందన్న వాస్తవిక విషయమే కమ్యూనిజం విజయం పొందడం తథ్యమన్న నమ్మకకు మూలాధారం. తత్కారణంగానే మన దేశములోను, నూతన ప్రజాతంత్ర దేశాలలోను కోటానుకోట్ల ప్రజల హృదయాలను ఆకర్షించినట్టే, పెట్టుబడిదారీ దేశాలలోని అశేష శ్రామిక జనానీక హృదయాలను మార్క్సిజం - లెనినిజానికి చెందిన భావాలు అధికాధికంగా చూరగొంటున్నాయి. (దీర్ఘహర్షధ్వనులు). మన దేశంలో కమ్యూనిజాన్ని నిర్మించు

కొంటూన్న మనం యుద్ధాన్ని గట్టిపట్టుదలతో వ్యతిరేకిస్తున్నాం. ఏదేశంలోనైనా సరే నూతన సామాజిక వ్యవస్థ స్థాపనాసమస్య ఆ దేశానికి సంబంధించిన ప్రజల ఆంతరంగిక విషయంగా మనం సదా పరిగణిస్తూ వచ్చాం; ఇకముందుకూడా అలాగే పరిగణిస్తాం. మార్క్సిస్టు - లెనినిస్టు మహోపదేశంపైన ఆధారపడిన మన వైఖరి ఇదే.

శాంతియుత సహజీవన సూత్రానికి అంతర్జాతీయ పరిగణన నానాటా విస్తృత మవుతోంది. చైనా ప్రజారిపబ్లిక్, తదితర నూతన ప్రజాతంత్రదేశాల వైదేశికనీతి మూలస్థంభాలలో ఈ సూత్ర మొకటి. భారత రిపబ్లిక్, బర్మా, యింకా అనేక యితరదేశాలు ఆ సూత్రాన్ని క్రియాత్మకంగా అమలుజరుపుతున్నాయి. ఈనాటి పరిస్థితులలో అన్యథా శరణం నాస్తి కనుక ఇందుకు ఆశ్చర్యపడవలసిన పనిలేదు. నిజానికి ఈనాడు రెండేరెండు మార్గాలున్నాయి. శాంతియుత సహజీవనమో, లేదా చరిత్రలో అత్యంత వినాశకరమైన యుద్ధమో — ఈ రెండింటిలో ఏదో ఒకదానిని ఎంచుకోవాలి. మరొక మార్గం లేదు.

విభిన్న వ్యవస్థలుగల దేశాలు సహజీవనం నెరపుకోటంకన్నా యింకా ఎక్కువే చేయవచ్చునని మనం విశ్వసిస్తున్నాం. దానికన్న యింకొంతదూరం ముందుకుపోయి, సంబంధాలను బాగుపర్చుకొని, దేశాలమధ్య విశ్వాసాన్ని దృఢపర్చుకొంటూ సహకరించుకోటం అవసరం. చైనా ప్రజారిపబ్లిక్, భారత రిపబ్లిక్‌లు రెండూకలిసి రూపొందించినట్టిన్నీ బాండుంగ్ మహాసభ, జనరల్‌గా ప్రపంచప్రజల ఆమోదంబడసినట్టిన్నీ సుప్రసిద్ధ పంచశీలాలు ఈనాటి పరిస్థితులలో విభిన్న సామాజిక వ్యవస్థలుగల దేశాలమధ్య సంబంధాలకు ఉత్తమోత్తమరూపం కనుకనే, వాటికి చారిత్రిక ప్రాధాన్యం సమకూరుతోంది. ప్రపంచం నలుమూలలా గల దేశదేశాలమధ్య శాంతియుత సంబంధాలకు యీ సూత్రాలను ఎందుకు ప్రాతిపదికగా చేసుకోరాదు? ఆ విధంగాచేస్తే, సకల దేశాలుకనుక ఈపంచశీలాలను శిరసావహిస్తే, దేశదేశాల ప్రజలప్రయోజనాలు, వాంఛితాలన్నీ ఈడేరతాయి.

**ప్రస్తుత దశలో యుద్ధనివారణకు గల అవకాశం**: మరొకయుద్ధం నిజంగా అనివార్యమేనా? దారుణమూ, మారణమూ అయిన రెండు ప్రపంచ యుద్ధాల భీభత్సాలను అనుభవించిన మానవాళి తిరిగి మూడో దానిని కూడా అనుభవించక తప్పదా? అంటూ ప్రపంచంలోని కోటానుకోట్ల ప్రజలు ప్రశ్నిస్తున్నారు. గత దశబ్దాలలో సంభవించిన యుగాత్మకమైన మార్పులన్నింటినీ పరిగణనలోకి తీసుకొని, మా క్సిస్టులు ఈ ప్రశ్నకు సమాధానం చెప్పవలసివుంటుంది.

సామ్రాజ్యవాదం వున్నంతకాలమూ యుద్ధాలు అనివార్యం అన్న మార్క్సిస్టు సూత్రం వున్నమాట నిజమే. సామ్రాజ్యవాదం ప్రపంచ పరివ్యాప్త వ్యవస్థగా వున్న సమయంలోను, యుద్ధాన్ని వాంఛించ నటువంటి సామాజిక, రాజకీయ శక్తులు ఎంతో బలహీనంగావుండి నిర్మాణరీత్యా సుసంఘటితంగా లేనప్పుడు ఆ సూత్రం

రూపొందించబడింది. సామ్రాజ్యవాదులు యుద్ధానికి ఒడిగట్టకుండా నిరోధించేబలం ఆ నాడు ఆ శక్తులకు లేదు.

యుద్ధాలకుగల ఆర్థిక ప్రాతిపదికను మాత్రమే - సమస్యకు సంబంధించిన ఒక అంశాన్ని మాత్రమే - తీసుకొని కొందరు సర్వ సాధారణంగా పరిశీలన సాగిస్తున్నారు. ఆ పరిశీలన సరిపోదు. యుద్ధం అన్నది కేవలం ఆర్థిక సంబంధమైన దృగ్విషయం (ఫెనామినా) మాత్రమే కాదు. యుద్ధం ప్రారంభమయ్యేదీ లేనిదీ వర్గాల, రాజకీయశక్తుల బలాబలాలపైన, ప్రజల నిర్మాణస్థాయి, చైతన్యసంకల్పాలపైన చాలావరకు ఆధారపడివుంటుంది. కొన్ని కొన్ని సమయాలలో అభ్యుదయకరమైన సామాజిక, రాజకీయశక్తులు సాగించే పోరాటమే నిర్ణయాత్మక పాత్ర నిర్వహించవచ్చు.

యుద్ధాన్ని కోరనటువంటి, వ్యతిరేకించేటటువంటి శక్తులు నిర్మాణరీత్యా బల హీనంగా వుండటం, యుద్ధోన్మాదుల పన్నాగాలను అరికట్టే సాధనం ఆ శక్తుల చేతిలో లేకపోవటం అన్న స్థితి యిప్పటిదాకా వుంటూ వచ్చింది. ఆ విధంగా మొదటి ప్రపంచ యుద్ధానికి పూర్వం, యుద్ధాన్ని వ్యతిరేకించే ప్రధాన శక్తియైన ప్రపంచ కార్మికవర్గం రెండవ యింటర్నేషనల్ నాయకుల విద్రోహం పుణ్యమా అంటూ చెల్లా చెదురై వుంది. ఆ విధంగా రెండో ప్రపంచయుద్ధం ప్రారంభమయే సమయంలో సోవియట్ యూనియన్ ఒక్కటే క్రియాత్మక శాంతి విధానం అనుసరిస్తూండగా, మిగతా అగ్రరాజ్యాలన్నీ దురాక్రమణదారులను అన్ని విధాల ప్రోత్సహించి, ప్రోద్బల పరుస్తున్న సందర్భంలో మితవాద సోషల్ డెమొక్రాటిక్ నాయకులు పెట్టుబడిదారీ దేశాలలోని కార్మికోద్యమాన్ని చీల్చి పుణ్యం కట్టుకొన్నారు.

అలాంటి దశలో పైన పేర్కొన్న సూత్రం నూటికి నూరుపాళ్ళు సరియైనదే. అయితే ఈనాడు పరిస్థితులలో మౌలికంగా మార్పువచ్చింది. బలోపేతమైన శక్తిగా తయారైన సామ్యవాద ప్రపంచ శిబిరం ఈనాడున్నది. దురాక్రమణలను నిరోధించేందుకు నైతికమైన సాధనాలు మాత్రమేకాక, భౌతికమైన సాధనాలుకూడా శాంతి శక్తులకు ఆ శిబిరం చేకూర్చింది. అంతేకాక, కోటానుకోట్ల జనానీకం నివసించే దేశాలనేకం యుద్ధాన్ని నివారించేందుకు క్రియాత్మకంగా కృషిసాగిస్తున్నాయి. పెట్టుబడిదారీ దేశాలలోని కార్మికోద్యమం ఈనాడు బ్రహ్మాండమైన శక్తిగా రూపొందింది. శాంతిప్రియుల ఉద్యమం ఉవ్వెత్తునలేచి, బలీయమైన శక్తిగా అభివృద్ధి చెందింది.

సామ్రాజ్యవాదం వున్నంతకాలమూ, యుద్ధాలు తలెత్తటానికి ఆర్థిక ప్రాతిపదిక వుండనే వుంటుంది కనుక పైన పేర్కొన్న లెనినిస్టుసూత్రం ఈనాటి పరిస్థితులకు కూడ వర్తించుతుందనడం నిర్వివాదాంశం. అందుకే మనం కడు జాగరూకతతో మెలగవలసిన అవసరం ఎంతో వుంది. ప్రపంచంలో పెట్టుబడిదారీవిధానం వున్నంత కాలమూ, సైనికజూదాలు, దురాక్రమణలకొరకు పెట్టుబడిదారీ గుత్తాధిపతుల ప్రయోజనాలకు ప్రాతినిధ్యం వహించే అభివృద్ధినిరోధకశక్తులు తమ ప్రయత్నాలు

కొనసాగించకమానవు. ఆ శక్తులు యుద్ధాన్ని తెచ్చిపెట్టేందుకు ప్రయత్నించవచ్చు. యుద్ధం విధిగా అనివార్యమైనట్టిది మాత్రం కాదు. సామ్రాజ్యవాదులు యుద్ధం ప్రారంభించకుండా అరికట్టేందుకు, ఒకవేళ దానిని ప్రారంభించటానికి వారు ప్రయత్నిస్తే, దురాక్రమణదారులకు తగిన గుణపాఠాలు నేర్పి వారి దుందుడుకు పన్నాగాలను వమ్ముచేసేందుకు కావలసిన ప్రబలాయుధాలను కలిగిన బలీయమయిన, సామాజిక, రాజకీయశక్తులీనాడున్నాయి. యుద్ధం రాకుండా అరికట్టాలంటే, యుద్ధ ప్రతికూలశక్తులు కడు జాగరూకతతో మెలగుతూ సదా సర్వసన్నద్ధమైవుంటూ, శాంతిపోరాటంలో ఐక్యసంఘటనగా వ్యవహరిస్తూ, నిర్విరామకృషి కొనసాగించవలసి వుంటుంది. ప్రజలు ఎంత ఎక్కువ సమధికోత్సాహంతో శాంతిని పరిరక్షిస్తూంటారో మరొక యుద్ధం సంభవించకుండా నివారించటానికి అంత ఎక్కువ హామీవుంటుంది. (మిన్నుముట్టే దీర్ఘహర్షధ్వనులు).

**వివిధ దేశాలలో సామ్యవాద పరివర్తనా రూపాలు:** అంతర్జాతీయ రంగంలోని సమూలమైన మార్పులతోపాటే, వివిధదేశాలు, జాతులు సామ్యవాదానికి పరివర్తన చెందటంవిషయంలో నూతనావకాశాలుకూడా ఏర్పడుతున్నాయి. అక్టోబరు సోషలిస్టు మహావిప్లవం రానున్న సమయంలోనే లెనిన్ ఇలా వ్రాశారు: "అన్నిదేశాలూ సామ్యవాదానికి చేరుకోవడం అనివార్యం. అయితే అన్నిదేశాలూ ఖచ్చితమైన అచ్చుబోసిన ఒకేతీరులోమాత్రం ఆ లక్ష్యాన్ని చేరవు. సామాజికజీవితం లోని అనేకాంశాలను సోషలిస్టు పరివర్తనీకరించే విషయంలో ప్రతిదేశంకూడా ఏదోఒకరూపంలో తన సొంత ప్రజాస్వామికరూపాన్నో, ఏదోఒక రకమైన కార్మిక వర్గ నియంతృత్వరూపాన్నో, ఏదోఒక ఉధృతినో సమకూర్చుతుంది. "చారిత్రక భౌతికవాదం పేరుతో" భవిష్యత్తుకు సంబంధించిన ఈ అంశాన్ని అచ్చుపోసిన ఒకేమచ్చుగా చిత్రించటంకన్నా సిద్ధాంతదృష్ట్యా మూఢత్వమైనది మరొకటి లేదు; ఆచరణరీత్యా అంతకన్నా అపహాస్యమైనది యింకొకటిలేదు. అలాచేయటం మసి పూసి మారేడుకాయ చేయటంవినా మరొకట కాదు" (వర్క్సు, 23వ సంపుటి: 58వ పేజీ).

అద్భుతమైన ఈ లెనిన్ ప్రవచనం అక్షరాల సత్యమని చారిత్రకానుభవం నిరూపించింది. సోషలిస్టు పద్ధతులలో సమాజాన్ని పునర్నిర్మించే సోవియట్ రూపంతోపాటు యిప్పుడు నూతన ప్రజాతంత్ర రూపం అమలులోకి వచ్చింది.

పోలెండు, బల్గేరియా, చెకోస్లావాకియా, ఆల్బేనియా, తదితర నూతన ప్రజాతంత్ర దేశాలలో ఈ నూతన రూపం తలెత్తింది. ఆ దేశాలలోని ప్రతి దేశంయొక్క నిర్దిష్టమైన చారిత్రక, సామాజిక, ఆర్థిక పరిస్థితులబట్టి, వాటికుండే విశిష్ట లక్షణాలకు అనుగుణ్యంగాను ఆ రూపం అమలులోకి వచ్చింది. పదేళ్ళకాలంలో అది అగ్ని పరీక్షకు తట్టుకొని రాటుతేలింది; తన విశిష్టతను నిరూపించుకొంది.

సోషలిస్టు నిర్మాణంలో అపూర్వ అనుభవాన్ని చైనా ప్రజారిపబ్లిక్ సమకూర్చుతోంది. ఆదేశంలో విప్లవం విజయమందటానికి పూర్వం ఎంతో వెనకబడిన అర్థభూస్వామిక, అర్థవలస స్వభావంగలిగిన ఆర్థికవ్యవస్థవుంది. నూతన ప్రజాతంత్రరాజ్యం నిర్ణయాత్మకమైన, ముఖ్యఅధికారస్థానాలను హస్తగతంచేసుకొన్న పిమ్మట, ఆ దేశంలోని నూతన ప్రజాతంత్రప్రభుత్వం ప్రైవేటురంగంలోని పరిశ్రమలను, వాణిజ్యాన్ని శాంతియుతపద్ధతులలో పునర్నిర్మించి క్రమేణా సోషలిస్టు ఆర్థిక విధానంలోకి వాటిని పరివర్తనీకరించే కార్యవిధానాన్ని అమలు జరుపుతోంది.

సోషలిస్టు పునర్నిర్మాణ మహాలక్ష్యసాధనలో చైనాకమ్యూనిస్టుపార్టీ, ఇతర నూతన ప్రజాతంత్ర దేశాల కార్మిక, కర్షక పార్టీలు తమ తమ దేశాలకు చెందిన ప్రత్యేకతలను, విశిష్ట లక్షణాలను దృష్టిలో వుంచుకొని ప్రదర్శించిన నేతృత్వం కార్యాచరణలోని సృజనాత్మక మార్క్సిజం తప్ప మరొకటికాదు.

యుగోస్లావియాలో రాజ్యాంగాధికారం శ్రామికజనానికి చెందివున్నది; ఆ ప్రజారిపబ్లిక్‌లో, ఉత్పత్తిసాధనాలపై ప్రజాయాజమాన్యం ఏర్పడి ఆ ప్రాతిపదికపై సమాజం రూపొందించబడింది; ఆ దేశ సోషలిస్టు నిర్మాణక్రమంలో విశిష్టమూ, నిర్దిష్టమూ అయిన ఆర్థికనిర్వహణారూపాలూ, రాజ్యాంగయంత్ర నిర్మాణరూపమూ తలెత్తుతున్నాయి.

ఇకముందు యింకాఎక్కువ సామ్యవాద పరివర్తనా రూపాలు రూపొందటానికి అవకాశంవుంది. అంతేకాక, అన్ని సమయాలలోను ఈ రూపాలను అంతర్యుద్ధం ద్వారా మాత్రమే అమలు జరుపవలసి వుంటుందని ఎక్కడా రాసిపెట్టలేదు. లెనినిస్టులమైన మనం సదా, సర్వేసర్వత్రా హింసను ప్రోత్సహించుతామన్నట్టు మన శత్రువులు చిత్రిస్తారు. పెట్టుబడిదారీ సమాజాన్ని సోషలిస్టు సమాజంగా మార్చేందుకు విప్లవకర పరివర్తనీకరణ అవసరమని మనం గుర్తిస్తాం. సంస్కరణవాదులు, అవకాశవాదులకు, విప్లవకర మార్క్సిస్టులకుమధ్య తేడాఅదే. అనేక పెట్టుబడిదారీ దేశాలలో బూర్జువావర్గ నియంతృత్వాన్ని బలవంతాన కూలద్రోయటం (వైలెంటు ఓవర్‌త్రో) దానితో ముడివడివున్న వర్గపోరాటం అత్యంత తీవ్రతరం కావటం అనివార్యమనటంలో సందేహానికిట్టి తావులేదు. అయితే సామాజిక విప్లవ రూపాలు వివిధంగా వుంటాయి. సమాజాన్ని పునర్నిర్మించేందుకు హింస, అంతర్యుద్ధాలు మాత్రమే శరణ్యంగా మనం పరిగణిస్తామనటం నిజంకాదు.

ఈ సందర్భంలో ఒక విషయం ప్రస్తావించటం అవసరమనుకొంటాను. 1917 ఏప్రిల్‌లో ఏర్పడిన పరిస్థితులను దృష్టిలో వుంచుకొని, రష్యన్ విప్లవం శాంతియుతంగా అభివృద్ధి చెందినా చెందవచ్చునని లెనిన్ అన్నారు; అలాగే అక్టోబరు విప్లవానంతరం, 1918 వసంతకాలంలో శాంతియుత సోషలిస్టు నిర్మాణానికి సుప్రసిద్ధమైన పథకాన్ని ఆయన రూపొందించారుకూడా. రష్యన్ బూర్జువావర్గం, అంతర్జా

తీయ బూర్జువావర్గం కలిసి శైశవావస్థలో వున్న సోషలిస్టు రాజ్యానికి వ్యతిరేకంగా ప్రతీఘాతుక చర్యలకు ఒడిగట్టి, జోక్యం కల్పించుకొని, అంతర్యుద్ధం తెచ్చిపెట్టితే అది మన తప్పు కాదుగదా; అప్పుడు కార్మిక, కర్షకులు విధిలేక ఆయుధాలు చేపట్ట వలసి వచ్చింది. ఇందుకు భిన్నమైన చారిత్రక పరిస్థితులుగల యూరపియన్ నూతన ప్రజాతంత్ర దేశాల విషయం వచ్చేసరికి అంతర్యుద్ధం అవసరం లేకపోయింది.

పాలకవర్గాలు తమ చేతులలోని అధికారాన్ని బుద్ధిపూర్వకంగా విడిచిపెట్ట బోవని లెనినిజం మనకు బోధిస్తోంది: సామ్యవాదానికి పరివర్తన చెందేటప్పుడు పోరాటం తీవ్రత ఏ స్థాయిలో వుంటుంది అన్న విషయం, హింస ప్రయోగించ బడుతుందా, ప్రయోగించబడదా అన్న విషయం కార్మికవర్గంపైగాక, దోపిడీదారుల ప్రతిఘటనపైనా, దోపిడీవర్గం తనంతటతానుగా హింసకు ఒడిగట్టటంపైనా ఆధార పడివుంటుంది.

పార్లమెంటరీ పద్ధతులను ఉపయోగించటంద్వారా సామ్యవాదాన్ని స్థాపించ టం సాధ్యం అవునాకాదా అన్న ప్రశ్న ఈసందర్భంలో ఉత్పన్నమవుతుంది. సామ్య వాద పరివర్తనను మొట్టమొదటగా తీసుకొచ్చిన రష్యన్ బోల్షివిక్‌లకు అలాంటి అవకాశం లేకుండా పోయింది. అందుకనే లెనిన్ మరొకమార్గం - సోషలిస్టు రిపబ్లిక్‌ల స్థాపన - చూపించారు; ఆనాటిచారిత్రక పరిస్థితులలో అదొక్కటే సరియైన మార్గం. ఆ మార్గాన్ని అనుసరించి, ప్రపంచ పరివ్యాప్త చారిత్రక ప్రాధాన్యంగల విజయం మనం సాధించాం.

అయితే ఆ తరువాత చారిత్రక పరిస్థితి సమూలమైన మార్పులకు లోనైంది. అందువల్ల పై సమస్యను నూతన పద్ధతిలో ఆలోచించేందుకు అవకాశ మేర్పడింది. సామ్యవాద, ప్రజాతంత్రశక్తులు ప్రపంచమంతటా అపారంగా వృద్ధి చెందాయి; పెట్టుబడిదారీ విధానం చాలా బలహీనపడింది. 90 కోట్లకుపైగా జనాభా గలిగిన బలోపేత సామ్యవాద శిబిరం వృద్ధిచెందుతూ, నానాటి బలవత్తర మవుతోంది. ఆ శిబిరంలోని బ్రహ్మాండమైన అంతర్గతశక్తులు, పెట్టుబడిదారీ విధానాన్ని తలదన్నే సదవకాశాలు దానికిగల వన్న విషయం ఆ రోజు కారోజు అధికాధికంగా బహిర్గత మవుతున్నాయి. అన్ని దేశాలలోని కార్మిక, కర్షక, మేధావులను సోషలిజం బలీయ మైన శక్తితో ఆకర్షిస్తోంది. సామ్యవాదానికి చెందిన భావాలు నిజానికి శ్రామిక జనావళి హృదయాలను ఆకట్టేస్తున్నాయి.

అదే సమయంలో అనేక పెట్టుబడిదారీ దేశాలలోని కార్మికవర్గం తన నాయ కత్వంక్రింద అత్యధిక ప్రజాసామాన్యాన్ని సమైక్యపచ్చి, మూల ఉత్పత్తి స్థానాలను ప్రజలపరం చేసేందుకు వాస్తవావకాశాలను ప్రస్తుత పరిస్థితి కలుగజేస్తోంది. మితవాద బూర్జువా పార్టీల, వాటి ప్రభుత్వాల దివాళాకోరుతనం త్వరత్వరగా బయట పడిపోతోంది. ఇలాంటి పరిస్థితులలో కార్మికవర్గం తన చుట్టూ రైతాంగాన్నీ, మేధావి వర్గాన్నీ, దేశభక్తి శక్తులన్నింటినీ సమీకరించుకొనగలస్థితిలో వుంది.; పెట్టు

బడిదారులతోను, భూస్వాములతోను రాజీపడే విధానానికి అంటిపెట్టుకొని వుండే అవకాశవాద శక్తులను గట్టిగా వ్యతిరేకించగలిగిన స్థితిలో కార్మికవర్గవుంది. సామాన్య ప్రజల ప్రయోజనాలను వ్యతిరేకించే అభివృద్ధినిరోధకులపై దెబ్బతీయగలిగిన స్తోమతను అది కలిగియుంది; పార్లమెంట్లలో స్థిరమైన మెజారిటీని సంపాదించగలిగిన స్థితిలోవుంది. తద్వారా బూర్జువా ప్రజాతంత్రానికి సాధనంగావున్న పార్లమెంటును ప్రజా వాంఛకు వాస్తవమైన సాధనంగా పరివర్తనీ కరించగలిగినస్థితిలో కార్మికవర్గం ఈనాడు ఉన్నది. (హర్షధ్వనులు). అలాంటప్పుడు ఈ సంస్థ, బాగా అభివృద్ధి చెందిన పెట్టుబడిదారీ దేశాలలో సంప్రదాయసిద్ధంగా మారిన ఈసంస్థ, వాస్తవ ప్రజాస్వామ్యానికి, శ్రామిక జనప్రజాతంత్రానికీ ఒకసాధనం కావచ్చు.

కార్మిక వర్గ విప్లవోద్యమం అండదండలతో సాధించబడే సుస్థిరమైన పార్లమెంటరీ మెజారిటీవల్ల అనేక పెట్టుబడిదారీదేశాలలోను, పూర్వపు వలసదేశాల లోను సమూల సామాజిక మార్పులు తీసుకొచ్చేందుకు అనువైన పరిస్థితులను సృష్టించవచ్చు.

ఏదేశాలలో అయితే పెట్టుబడిదారీవిధానం యింకా బలంగా వుంటుందో ఎక్కడైతే అంతూపంతూలేని సైనిక పోలీసుబలగం పెట్టుబడిదారుల చేతుల్లో వుంటుందో అలాంటి దేశాలలో అభివృద్ధి నిరోధకశక్తులు తప్పనిసరిగా తీవ్రమైన ప్రతిఘటనను ప్రదర్శించి తీరుతాయి. అలాంటిచోట్ల తీవ్రమైన వర్గ, విప్లవకర పోరాటంద్వారా సామ్యవాద మాత్రమే పరివర్తన సంభవిస్తుంది.

సామ్యవాద పరివర్తన రూపం ఎలాగైనా వుండవచ్చు; అయితే తన అగ్రగామి దళ సారథ్యంలో కార్మికవర్గం రాజకీయ నాయకత్వం సంపాదించుకోటమన్న విషయం మాత్రం నిర్ణయాత్మకమైనది; తప్పనిసరి నైనది. అది లేనినాడు సామ్యవాద పరివర్తన అన్నది అసలు సాధ్యం కానేకాదు.

సోవియట్ యూనియన్‌లో సామ్యవాదం జయప్రదమైంది కనుక, నూతన ప్రజాతంత్ర దేశాలలో విజయవంత మవుతున్నది కనుక ఇతర దేశాలలో సామ్యవాదం జయప్రదం కావటానికి ఇతోధికమైన అనుకూల పరిస్థితులు ఏర్పడ్డాయన్న విషయం గట్టిగా వక్కాణించక తప్పదు. లెనిన్, బోల్షివిక్ పార్టీ కనుక విప్లవకర మార్క్సిజానికి గట్టిగా కట్టుబడివుంటూ మార్క్సిజానికి, కమ్యూనిజానికి తిలోదకాలిచ్చి, అవకాశవాద పంథాను చేపట్టిన మితవాదులకు వ్యతిరేకంగా పోరాడి వుండకపోయిన పక్షంలో మన దేశంలో సామ్యవాదం విజయమందటం సాధ్యపడేది కాదు.

ఈనాటి పరిస్థితులలో సామ్యవాద పరివర్తన రూపాలకు సంబంధించిన ఈ అభిప్రాయాలను వ్యక్తం చేయటం అవసరమని పార్టీ కేంద్రకమిటీ భావిస్తోంది.

వైదేశిక నీతి విషయంలో పార్టీని ఎదుర్కొంటున్న కర్తవ్యాలేమిటి? అవి:

1. విభిన్న వ్యవస్థలుగల రాజ్యాలు తమ తమ సామాజిక వ్యవస్థలతో నిమిత్తం లేకుండా శాంతియుత సహజీవనం నెరపుకోవాలన్న లెనినిస్టు కార్యవిధానాన్ని

తు. చ. తప్పకుండా అనుసరిస్తూండటం. నేటివరకు సాధించిన అంతర్జాతీయ ఉద్రిక్తతా సడలింపును సుస్థిరశాంతిగా పరివర్తనీకరించాలన్న దృష్టితో, శాంతిరక్షణకు, దేశాల భద్రతకు గట్టిగా కృషిచేయటం.

2. సోషలిస్టుదేశాలమధ్య ఐక్యత, వాటి శక్తిస్తోమతలు ఎంతగా పటిష్ఠతరం అవుతాయో శాంతి సుస్థిరతకు అంత ఎక్కువ భద్రత చేకూరుతుందన్న విషయాన్ని దృష్టిలో వుంచుకొని, చైనా ప్రజారిపబ్లిక్, పోలెండు, జెకోస్లావాకియా, బల్గేరియా, హంగేరీ, రుమేనియా, ఆల్బేనియా, జర్మన్ ప్రజాతంత్ర రిపబ్లిక్, కొరియన్ ప్రజాతంత్రరిపబ్లిక్, వియత్నామ్ ప్రజాతంత్రరిపబ్లిక్, మంగోలియాప్రజాతంత్రరిపబ్లిక్‌లతో మన సౌహార్దసంబంధాలను అన్నివిధాలా పటిష్ఠతరంచేసుకోవాలి. (దీర్ఘహర్షధ్వనులు)

సోదర యుగోస్లావియా ప్రజాతంత్ర రిపబ్లిక్ ప్రజలతో అన్ని విధాలస్నేహ సహకారాలను పటిష్ఠతరం చేసుకోవాలి. (హర్షధ్వనులు)

3. శాంతికోసం గట్టిగా నిలబడిన భారత రిపబ్లిక్, బర్మా, ఇండోనేషియా, ఆఫ్ఘనిస్థాన్, ఈజిప్ట్, సిరియా తదితర దేశాలతో స్నేహ, సహకార సంబంధాలను శతవిధాల పటిష్ఠతరం చేసుకోవాలి. సైనిక కూటాలలో చేర నిరాకరిస్తున్న దేశాలను బలపర్చాలి; శాంతిని రక్షించటానికి పూనుకొనే శక్తులన్నింటిలోను సహకరించాలి. (దీర్ఘ హర్షధ్వనులు).

ఫిన్లండ్, ఆస్ట్రియా, తదితర తటస్థదేశాలతో స్నేహసంబంధాలను వృద్ధి పొందించుకొని, పటిష్ఠతర మొనర్చుకోవాలి.

4. పరస్పర విశ్వాసాన్ని పెంపొందించాలన్న దృష్టితోను, వాణిజ్యాన్ని విస్తరింపచేయాలన్న లక్ష్యంతోను, సాంస్కృతిక, శాస్త్రీయ రంగాలలో సంబంధ సహకారాలను విస్తరింపచేయాలన్న దృష్టితోను అమెరికా, బ్రిటను, ఫ్రాన్సు, పశ్చిమ జర్మనీ, జపాన్, ఇటలీ, టర్కీ, ఇరాన్, పాకిస్తాన్, యిత్యాది దేశాలతో ఇంకా సంబంధాలను పెంపొందించుకొనేందుకు తీవ్ర కార్యవిధానాన్ని అనుసరించాలి. (దీర్ఘ హర్షధ్వనులు)

5. అంతర్జాతీయ ఉద్రిక్తతా సడలింపు అంటే గిట్టనటువంటివర్గాలు సాగించే కుట్రలను సదా ఒకకంటకనిపెట్టివుండాలి; ప్రపంచశాంతికీ, దేశాలభద్రతకు శత్రువులైన వారు సాగించే విద్రోహచర్యలను ఎప్పటికప్పుడు బయటపెట్టుతుండాలి; మన సోషలిస్టురాజ్యంయొక్క రక్షణస్తోమతను యింకా పటిష్టతరం చేసేందుకు కావలసిన చర్య లన్నింటినీ తీసుకోవాలి; ఈనాటి ఆయుధాలకు, విజ్ఞానశాస్త్రానికి తగిన స్థాయిలో మనరక్షణలను సమకూర్చుకోవాలి; మన సోషలిస్టుదేశరక్షణకు భద్రత చేకూర్చాలి. (మిన్నుముట్టే హర్షధ్వానాలు).

# II

# సోవియట్ యూనియన్ అంతరంగిక పరిస్థితి

మనం సమీక్ష చేసుకుంటున్న దశలో సోవియట్ యూనియన్ అంతరంగిక పరిస్థితిలోని ప్రధానాంశాలను ఈ క్రిందివిధంగా పేర్కొనవచ్చు. సామాజికోత్పత్తి శాఖలన్నీ క్రమానుగతాభివృద్ధిపొందాయి; సోవియట్ సామాజిక, రాజ్యాంగ వ్యవస్థ మరింత పటిష్ఠతరమైంది; ప్రజల జీవన సౌభాగ్యానందాలు యితోధికమైయ్యాయి; సోవియట్ సంస్కృతి సర్వతోముఖాభివృద్ధి చెందింది.

## ప రి శ్ర మ లు: ర వా ణా

లెనిన్ మహనీయుని ఉపదేశాలను శిరసా వహించుతున్న సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీ ఓం ప్రథమంగా భారీ పరిశ్రమల అభివృద్ధిని సాధించేందుకే సదా గట్టిగా పాటుబడుతూ వచ్చింది; ఎందుకంటే, సోషలిస్టు ఆర్థికవిధానంలోని శాఖలన్నింటి అభివృద్ధికీ, దేశరక్షణ స్తోమత యితోధికమవటానికీ, ప్రజల జీవన స్థితిగతులు బాగుపర్చేందుకూ భారీ పరిశ్రమల అభివృద్ధి మూలకందం అవుతుంది.

సోవియట్ రాజ్యం అవతరించినప్పటినుంచీ యిప్పటివరకూ అగ్నిపరీక్షకులోనై నిగ్గుతేలిన ఈ కార్యవిధానాన్ని పార్టీ తన జనరల్ కార్యవిధానంగా స్వీకరించింది; మన ప్రజల ప్రయోజనాల సిద్ధికి అది అనుగుణంగా వుంది. భవిష్యత్తులో కూడా మన పార్టీ ఈ జనరల్ కార్యవిధానాన్నే గట్టిగాను, పట్టుదలతోను అమలు జరుపుతూ వుంటుంది.

## 1. పారిశ్రామిక రంగంలో

## 5వ పంచవర్ష ప్రణాళిక సాధించిన మౌలిక ఫలితాలు

అయిదవ పంచవర్ష ప్రణాళికాకాలంలో పరిశ్రమలకు చెందిన శాఖలన్నింటిలోను పార్టీ మరింత సత్వర పురోభివృద్ధిని సాధించగల్గింది. పరిశ్రమల విషయంలో అయిదవ పంచవర్ష ప్రణాళికా లక్ష్యాలను అనుకొన్నదానికన్నా ముందుగానే, నాలుగు సంవత్సరాల నాలుగు మాసాలలోనే సాధించగలిగామన్న సంగతి మన కందరకూ తెలిసిందే.

1951–'55 మధ్యకాలంలో సాధించబడిన యితోధిక పారిశ్రామికోత్పత్తిని గురించి తెలుసుకొనేందుకు ఈ క్రింది సంఖ్యా వివరాలు సహాయపడుతాయి.

| | 1955 లో పారిశ్రామికోత్పత్తి;1950 (శాతాలలో) | | 1951-55 మధ్యకాలంలో సాంవత్సరిక సగటు పెరుగుదల రేటు (శాతాలలో) | |
|---|---|---|---|---|
| | పంచవర్ష ప్రణాళిక లక్ష్యం | జరిగిన ఉత్పత్తి | పంచవర్ష ప్రణాళిక లక్ష్యం | పెరుగుదల |
| పరిశ్రమలు మొత్తంగా | 170 | 185 | 12 | 13.1 |
| ఉత్పత్తి సాధనాల ఉత్పత్తి (గ్రూపు ఎ) | 180 | 191 | 13 | 13.8 |
| వాడకంవస్తువుల ఉత్పత్తి (గ్రూపు బి) | 165 | 176 | 11 | 11.9 |

లోహాలు, ఇంధనాలు, విద్యుచ్ఛక్తి, భారీ పరిశ్రమలకు చెందిన తదితర కీలకశాఖలలోని ఉత్పత్తి గణనీయంగా పెరిగింది. ఈ క్రింది అంకెలు చూడండి.

| | | 1950 లో ఉత్పత్తి | 1955 లో ఉత్పత్తి | 1950 తో పోల్చుకుంటే 1955 లో పెరుగుదల (శాతంలో) |
|---|---|---|---|---|
| ముడి ఇనుము (లక్షల టన్నులలో) | | 190 | 330 | 174 |
| ఉక్కు | ,, | 270 | 450 | 166 |
| రోల్డ్ మెటల్ | ,, | 210 | 350 | 169 |
| బొగ్గు | ,, | 2610 | 3910 | 150 |
| ఆయిల్ | ,, | 380 | 710 | 187 |
| విద్యుచ్ఛక్తి (లక్షల కిలోవాట్లు) | | 9,10,000 | 17,00,000 | 187 |
| సిమెంటు (లక్షల టన్నులలో) | | 100 | 220 | 221 |
| ట్రాక్టర్లు (వేల సంఖ్యలో) | | 109 | 163 | 150 |
| ఖనిజ ఎరువులు (లక్షల టన్నులలో) | | 55 | 96 | 175 |

అయిదవ పంచవర్ష ప్రణాళికా కాలంలో ఇంజనీరింగ్ పరిశ్రమ అత్యంత త్వరితగతిని అభివృద్ధి చెందింది. 1955 లో లోహ కర్మాగార పరిశ్రమల ఉత్పత్తి పరిమాణం 1950 ఉత్పత్తితో పోల్చుకుంటే 2.2 రెట్లు, 1940 ఉత్పత్తితో పోల్చుకుంటే 4.7 రెట్లు పెరిగింది.

ఉత్పత్తి సాధనాల ఉత్పత్తి పెరగడంతోపాటే, వాడకం వస్తువుల ఉత్పత్తి కూడా ఆ ఏటికాయేడు పెరిగిపోతోంది. దీనిని సోదాహరణంగా వివరించేందుకు కొన్ని అంకెలను ఇక్కడ ఉదహరిస్తాను.

| | 1950 లో ఉత్పత్తి | 1955 లో ఉత్పత్తి | 1950 తో పోల్చి చూస్తే 1955 లో ఉత్పత్తి పెరుగుదల (శాతం) |
|---|---|---|---|
| నూలువస్త్రాలు (లక్షలమీటర్లలో) | 38,990 | 59,040 | 151 |
| ఉన్నివస్త్రాలు(లక్షలమీటర్లలో) | 1550 | 2510 | 162 |
| పాదరక్షలు (లక్షల జతలలో) | 2260 | 2990 | 132 |
| పంచదార (లక్షల టన్నులు) | 25 | 34 | 136 |
| మాంసం, పాడి పరిశ్రమ సరుకులు (లక్షల టన్నులు) | 13 | 22 | 168 |
| పాలతో పోల్చిచూస్తే వెన్న, తదితర పాడిపరిశ్రమ సరుకులు (లII టన్నులు) | 85 | 135 | 159 |
| వనస్పతి నూనెలు (లక్షల టన్నులు) | 8 | 11 | 143 |
| చేపలు (లక్షల టన్నులు) | 17 | 27 | 156 |
| సైకిళ్లు (లక్షలలో) | 6 | 29 | 444 |
| గడియారాలు (లక్షలలో) | 76 | 197 | 260 |
| రేడియో, టెలివిజన్ సెట్లు (లక్షలలో) | 11 | 40 | 372 |

సోషలిస్టు ఆర్థికవ్యవస్థయొక్క సౌలభ్యాలవల్ల మనదేశం పెట్టుబడిదారి విధానంతో సాగించే ఆర్థికపోటీలో పైచేయి సంపాదించగలుగుతున్నది; ఉత్పత్తి పెరుగుదల విషయంలో అత్యంతాభివృద్ధికాంచిన పెట్టుబడిదారీ దేశాలను తల దన్నుతూ, మనదేశం అపారమైన అభివృద్ధిని సాధించుతోంది. ఉదాహారణకు గత అయిదు సంవత్సరాలలో మనదేశ పారిశ్రామికోత్పత్తి సాంవత్సరిక సగటు పెరుగుదల అమెరికా పారిశ్రామికోత్పత్తి పెరుగుదలకంటే మూడురెట్లకన్నా హెచ్చు. అలాగే బ్రిటను పారిశ్రామికోత్పత్తి పెరుగుదలకన్నా 3.8 రెట్లు ఎక్కువ.

సోవియట్ యూనియన్‌లో తల ఒక్కింటికి ఉత్పత్తి క్రమంగా పెరుగుతోంది. అయిదవ పంచవర్ష ప్రణాళికాకాలంలో తల 1 కి ముడి యినుము ఉత్పత్తి నూటికి 60 వంతులు, ఉక్కు ఉత్పత్తి నూటికి 52 వంతులు, బొగ్గు ఉత్పత్తి నూటికి 37 వంతులు, ఆయిల్ ఉత్పత్తి నూటికి 72 వంతులు, విద్యుచ్ఛక్తి ఉత్పత్తి 77 వంతులు, నూలు వస్త్రాల ఉత్పత్తి నూటికి 40 వంతులు, ఉన్ని వస్త్రాల ఉత్పత్తి నూటికి 48 వంతులు, పంచదార ఉత్పత్తి నూటికి 24 వంతులు పెరిగాయి. అయినప్పటికీ తల ఒక్కింటికి ఉత్పత్తి విషయంలో పెట్టుబడిదారీ నాయక దేశాలకన్నా మనం యింకా వెనకబడేవున్నాం. ఈ విషయంలో అత్యంతాభివృద్ధిచెందిన పెట్టుబడిదారీ దేశాలను అందుకొని, వాటిని అధిగమించటం అన్నదే మనం ఈనాడు ఆర్థికరంగంలో నిర్వహించవలసిన ప్రధాన కర్తవ్యం. దానిని నిర్వహించేందుకు ఎంతో కృషి అవసరం.

నాల్గవ పంచవర్ష ప్రణాళికతో పోల్చుకుంటే, అయిదో పంచవర్ష ప్రణాళికా కాలంలో పారిశ్రామిక పెట్టుబడి నూటికి 94 వంతులు పెరిగింది; విద్యుచ్ఛక్తి కేంద్రాల నిర్మాణంలో అది 3.4 రెట్లు ఎక్కువైంది: ఆయిల్ పరిశ్రమలో 2.3 రెట్లు, ఇనుము, ఉక్కు, నాన్ ఫెర్రస్ లోహాల పరిశ్రమల్లో 1.8 రెట్లు, ఇంజనీరింగ్ పరిశ్రమలో 1.7 రెట్లు, గృహనిర్మాణ వస్తువులు, కలప, కాగితం పరిశ్రమలో 2.2 రెట్లు, తేలిక ఆహారపదార్థాల పరిశ్రమలో 1.5 రెట్లు పెరిగింది.

1955 లో పరిశ్రమలోని పారిశ్రామికోత్పాదకశక్తి (అనగా, సాంకేతికాభివృద్ధిద్వారా కార్మికుల ఉత్పాదకశక్తిని పెంచడం-అను.) యుద్ధాత్పూర్వపు స్థాయి కన్నా దాదాపు రెట్టింపు అయింది. నిజానికి అయిదో పంచవర్ష ప్రణాళికా కాలంలో సాధించబడిన మొత్తం పారిశ్రామికోత్పత్తి పెరుగుదలలో మూడింట రెండు వంతులు అధికోత్పాదకశక్తి కారణంగానే సాధ్యపడింది. ఉత్పత్తి సరుకుల నాణ్యం హెచ్చింది. తయారైన సరుకుల అందచందాలు రకాలు ఎక్కువయ్యాయి.

కామ్రేడ్స్, పైన పేర్కొన్న సంఖ్యా వివరాలనుబట్టి తేలుతున్నదేమిటి ? మనం సమీక్ష చేసుకొంటున్న దశలో మనపార్టీ, సోవియట్ ప్రజలు జాతీయార్థిక విధానంలో ఒక నూతన వెల్లువ తీసుకొచ్చారు; భారీ పరిశ్రమలను యింకా పెంపొందించారు. దానిని ప్రాతిపదికగా చేసుకొని వ్యవసాయక రంగంలోను, తేలిక పరిశ్రమలలోను, ఆహార పదార్థాల పరిశ్రమలలోను అభివృద్ధిని సాధించారు. సోషలిజంనుంచి కమ్యూనిజానికి పరివర్తన చెందటంలో సోవియట్ యూనియన్ మరొక పెద్ద ముందంజం వేసింది. (దీర్ఘ హర్షధ్వానాలు).

ఉత్పత్తిని పెంపొందించి, మెరుగుపర్చేందుకు యింతకు ముందుకన్న గణనీయమైన అధికతర శక్తిస్తోమతలతో సోవియట్ పరిశ్రమలు ఆరో పంచవర్ష ప్రణాళికను ప్రారంభిస్తున్నాయి. గురుతరమైన, గుణాత్మకమైన నూతన కర్తవ్యాలను ఇక మన పరిశ్రమలకు పురమాయించవచ్చు; ఆ కర్తవ్యాలను నిర్వహించటంవల్ల దేశ ఆర్థిక స్తోమతను యింకా పెంపొందించటానికీ, మన ప్రజల జీవనస్థితిగతులు యింకా బాగుపర్చటానికీ అవకాశ మేర్పడుతుంది.

మనం సమీక్షచేసుకుంటూన్న దశలో పరిశ్రమల నిర్వహణను యింకా మెరుగుపర్చాలన్న దృష్టితో కేంద్రకమిటీ ముఖ్యమైన చర్యలను చేకొన్నది. అన్నిటికంటే ముఖ్యంగా ఉత్పత్తిలో నూతన విజ్ఞానశాస్త్ర, సాంకేతిక విజయాలను ప్రవేశపెట్టాలన్న లక్ష్యంతో కేంద్రకమిటీ ప్రధానమైన చర్యలు తీసుకొన్నది. ముఖ్యంగా ఈసమస్యలపైనే పార్టీయొక్క, ప్రజలయొక్క దృష్టి లగ్నమయ్యేటట్లు కేంద్రకమిటీ ఎందుకు కృషిచేయవలసివచ్చింది ?

పారిశ్రామికరంగంలో మనం సాధించినవిజయాలతో మన ఫ్యాక్టరీ నిర్వాహకుల, పార్టీ కార్యకర్తల తలలుతిరిగిపోయాయి. వారిలో అహంభావం అలసత్వం పెచ్చరిల్లాయి; స్వదేశీ, విదేశీ విజ్ఞానశాస్త్రం సాంకేతిక పరిజ్ఞానం

సాధించిన విజయాలను ఉత్పత్తి క్రమంలో ప్రవేశపెట్టుతూ దానిని ఆధునికం చేయాల్సిన అవసరాన్ని అనేక సందర్భాలలో తక్కువ అంచనా వేయటానికి అది దారితీసింది. నిలబడి నీళ్లు తాగటమే శ్రేయస్కరమనుకొంటూ, నూతనమూ, అభ్యుదయకరమూ అయిన ప్రతిదానికీ దూరంగా వుండటమే మంచిదనుకొనే బాపతు ఫ్యాక్టరీ నిర్వాహకులు యింకా అనేకమంది మనలో వున్నారు. ఉన్నతాసనాలలో పరివేష్టితులైన ఇలాంటి ప్రబుద్ధులు అంటారు గదా; "దానితో తలలు పాడుచేసుకోటం ఎందుకంట? నీకు తెలుసు; దానిలో ఎన్నో సాధక బాధకాలు వున్నాయి; వట్టి తలనొప్పి వ్యవహారమనుకోండి. ఉత్పత్తిని ఆధునికం చేయడంగురించి వారు వాగుతుంటారు. దానినిగురించి నేను తల పగలకొట్టుకోవడం శుద్ధదండగ కాదా? పెద్దలున్నారు చూశారు వారే దానిని గురించి కిందామీదా పడతారు. పైనుంచి తాఖీదువస్తే అప్పుడు చూసుకోవచ్చులే" కొంతమంది ఆదేశం వచ్చిన తర్వాతకూడా, దానిని ప్రక్కనపెట్టి, చిత్తాలు తిరగవేస్తూ వుంటారు.

అలాంటి బాపతునే మయకోవస్కీ నిశితంగా హేళనచేశాడు.

"గొప్ప గొప్ప పదవులకు
గబగబా ప్రాకె నతడు
కళ్ళుండీ కానలేడు
కుర్చీనుంచి లేవబోడు
పార్టీ పరీక్షలెన్నో నెగ్గినా
వాదాలెన్నో వల్లించినా
అసలైన సామ్యవాద మతనిలో
పిసరైనా వుంటే వట్టుసుమా
ఆలోచన మనకెందుకు
ఆచరణ మనకెందుకు
పెద్దలుండిరిగదా
ఆదేశాలంపేందుకు
ఆజ్ఞలకోస మెదురుచూస్తే
చాలంటాడా ఘనుడు

దురదృష్టవశాత్తు "వాదాలను" కేవలం కంఠస్థంచేస్తూ, కళ్ళెదుటున్నదానిని కానలేని వ్యక్తులు అనేకమంది యింకా మనలో వున్నారు. నిరంకుశ వైఖరిని వారు అవలంబిస్తూ, ఎనలేని హానిని తెచ్చిపెట్టుతున్నారు.

మన పరిశ్రమల నిర్వహణలోగల లోపాలను అధిగమించేందుకూ, మనలో అణగిమణిగివున్న అపారమైన శక్తి సామర్థ్యాలను మరింత చక్కగా వినియోగించు

కొనేందుకూ, సాంకేతికాభ్యున్నతికై కృషిచేసేందుకూ పార్టీని సమీకరించవలసిన అవసరమేర్పడింది. దీనిని దృష్టిలో వుంచుకొనే పరిశ్రమల్లో పనిచేస్తున్న ముఖ్యమైన కార్యకర్తల సమావేశాలను ఏర్పాటుచేశాం. గత సంవత్సరం జూలైలో జరిగిన సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ విస్తృత సమావేశంలో ఈ సమస్యను కూలంకషంగా చర్చించాం. ఆ విస్తృత సమావేశం జరిగిన తర్వాత ఎంతో కృషి సాగించాం; అయితే ఉత్తరోత్తరా జరగబోతున్న పెద్ద ముఖ్యమైన విషయాలకు యింతకు పూర్వం జరిగిన కృషి కేవలం నాంది వాచకం వంటిది మాత్రమేనని గుర్తించాలి.

జాతీయార్థిక వ్యవస్థలోని సకలశాఖల అభివృద్ధికి ఆరవ పంచవర్ష ప్రణాళిక ముసాయిదాలో ఒక బ్రహ్మాండమైన కార్యక్రమం సూచించబడింది. పరిశ్రమలకు సంబంధించినంతవరకు ఆరో పంచవర్ష ప్రణాళిక సూచిస్తున్న ప్రప్రథమ కర్తవ్యాలు ఇవి : ఇనుము, ఉక్కు, నాన్ ఫెర్రస్‌లోహాల పరిశ్రమలనూ, ఇంధనం, రసాయనిక పరిశ్రమలనూ యింకా విస్తరింపచేయటం; విద్యుచ్ఛక్తి కేంద్రాల నిర్మాణాన్ని క్రమానుగతంగా ఇతోధికం చేయటం; ఇంజనీరింగ్ పరిశ్రమను సత్వరంగా అభివృద్ధి చేయటం.

1955 నాటికన్నా 1960 నాటికి మొత్తం పారిశ్రామికోత్పత్తి స్థాయిని నూటికి యించుమించు 65 వంతులు పెంచాలన్న దృష్టితోను, ఉత్పత్తి సాధనాల ఉత్పత్తిని నూటికి 70 వంతులు, వాడకం వస్తువుల ఉత్పత్తిని నూటికి 60 వంతులు పెంచాలన్న తలంపుతోను ముసాయిదా ఆదేశాలు చేయారు చేయబడ్డాయి. ఆరో పంచవర్ష ప్రణాళికా కాలం పూర్తయే సమయానికి సోవియట్ యూనియన్ పారిశ్రామికోత్పత్తి స్థాయి యుద్ధా పూర్వపు 1940 నాటి స్థాయికన్నా అయిదు రెట్లకు పైగా పెరుగుతుంది.

ఆరో పంచవర్ష ప్రణాళికను మనం జయప్రదంగా అమలు జరపాలంటే పరిశ్రమలకు సంబంధించిన అనేక కీలక సమస్యలకు పరిష్కారమార్గాలు కనుగొనవలసి వుంటుంది. ఆ సమస్యలపైననే పార్టీ తన దృష్టినీ, కృషినీ యికముందు లగ్నంచేయవలసి వుంటుంది.

## 2. పరిశ్రమలలో సాంకేతికాభివృద్ధిని త్వరితంగా సాధించవలసిన ఆవశ్యకత

మన పరిశ్రమలకు గల భౌతిక పునాది మూలంగానూ, మన విజ్ఞాన శాస్త్రం సాధించిన విజయాలవల్లనూ, మన కార్మికవర్గం అత్యున్నత సాంస్కృతిక సాంకేతిక స్థాయిని కలిగియున్నందువల్లనూ సాంకేతికాభివృద్ధిని త్వరితగతిని సాధించేందుకు విస్తారంగా అవకాశాలు ఏర్పడుతున్నాయి. ఉత్పత్తి సంవిధానాన్ని అవిచ్ఛిన్నంగా అభివృద్ధి చేస్తూండటం అత్యంత ప్రధాన కర్తవ్యం.

మన ఉత్పత్తి పరికరాలను మెరుగుపర్చుకొనేందుకు నిరంతరం కృషిసాగిస్తూండటం అవసరం; అత్యంతాధిక ఉత్పాదక స్తోమతను కలిగియుండే, తక్కువ ఖర్చుతో తయారయ్యే మంచిమంచి యంత్రాలను మనం సృష్టించాలి. విద్యుదీకరణను, సర్వతోముఖ యాంత్రీకరణను ఉత్పత్తి క్రమాలలో స్వయంచలనీకరణను పెద్ద ఎత్తున నెలకొల్పాలి; శాంతియుత ప్రయోజనాల కొరకు అణుశక్తిని వినియోగించే నిమిత్తం శాస్త్రవిజయాలను పూర్తిగా ఉపయోగించుకోవాలి.

సాంకేతిక అభివృద్ధిని త్వరితంగా సాధించటంలో ఇంజనీరింగ్ పరిశ్రమ నిర్ణయాత్మకపాత్రను నిర్వర్తిస్తుంది. అందుచేత ఈ కీలకపరిశ్రమకు చెందిన సాంకేతిక పరికరాలను, ముఖ్యంగా యంత్రపరికరాలు, కట్టింగ్ టూల్ కర్మాగారాలను గణనీయంగా అభివృద్ధిపర్చవలసివుంటుంది. బలీయములైన అచ్చులను (ప్రెస్సెస్) యితోధికంగా ఉత్పత్తిచేయుటంపై ప్రత్యేకశ్రద్ధ చూపవలసివుంటుంది.

వివిధరకాలైన వస్తువులను ఉత్పత్తిచేసేందుకు వీలుగా సమగ్రఉత్పత్తి క్రమంతోకూడిన భారీకర్మాగారాలను అనేకవాటిని గతసంవత్సరాలలో మనం నిర్మించాం. నైపుణ్యాన్ని ఇతోధికం చేయటంద్వారాను, సహకారంద్వారాను ఇక మనం ఉత్పత్తిని గణనీయంగా పెంచవచ్చు; ఉత్పత్తి వ్యయాన్ని తగ్గించవచ్చు; శ్రామికోత్పాదక శక్తిని పెంపొందించవచ్చు.

విద్యుదీకరణనుగురించి లెనిన్ యిచ్చిన ఆదేశాన్ని మనపార్టీ తు. చ. తప్పకుండా అమలుజరుపుతోంది. మొదటి పంచవర్ష ప్రణాళిక ప్రారంభమైనదాదిగా సోవియట్ యూనియన్‌లో విద్యుత్పత్తి 34 రెట్లు పెరిగింది. అయినప్పటికీ విద్యుచ్ఛక్తి స్తోమతలో పెరుగుదల మొత్తం జాతీయార్థిక వ్యవస్థ సాధించిన అభివృద్ధికి అనుగుణ్యంగా లేదు. మనం సాధించిన పారిశ్రామికోత్పత్తి స్థాయివల్ల విద్యుచ్ఛక్తి స్తోమత సాంవత్సరిక పెరుగుదలను త్వరితగతిని సాధించే కర్తవ్యాన్ని నిర్వహించగలిగిన స్థితిలో మనం ఉన్నాం; మొత్తం జాతీయార్థికావసరాలకు, ప్రజావసరాలకు తగినంతగా విద్యుచ్ఛక్తిని ఉత్పత్తి చేయగలిగిన స్థితిలో ఉన్నాం.

ఇనుము, ఉక్కు పరిశ్రమలు త్వరితగతిని పురోగమిస్తున్నప్పటికీ మనకింకా లోహపుకొరత ఉండనేఉంది. ఆ కొరతకు రెండు కారణాలున్నాయి :

మొత్తం జాతీయార్థిక వ్యవస్థలో లోహాల అవసరం అనుదినం త్వరితంగా పెరుగుతూండటం మొదటికారణం; ఇనుము, ఉక్కు పరిశ్రమలలో పనిచేసే మనవారు అత్యంత తక్కువ వ్యయంతో ఉత్పత్తిని సాగించటంలో నైతేనేమి అవసరమైన భాగాలను, కొత్తరకం లోహాన్ని తయారించటంలోనైతేనేమి నెమ్మదిగా మాత్రమే అభివృద్ధి చెందుతూండటం రెండవకారణం.

మన ఇనుము, ఉక్కు కర్మాగారాలకు ముడిసరుకును యితోధికంగా సరఫరా చేయటానికి శాయశక్తులా కృషి సాగించాలి; లోహపరిశ్రమల నిర్మాణాన్ని త్వరితం

చేయాలి; ప్రస్తుతమున్న ఉత్పత్తి స్తోమతులను మరింత సమర్థవంతగా వినియోగించుకోవాలి; వైవిధ్యాన్ని విస్తరింపచేయాలి; లోహపు నాణ్యాన్ని మెరుగుపర్చాలి.

లోహాన్ని దుబారాగా వాడటం తరచు జరుగుతోందని చెప్పక తప్పదు. తప్పనిసరిగా అవసరమైనవాటికి మాత్రమేకాక, ఇతరములైన పదార్థాలు ఉపయోగించటానికి వీలున్న చోట్లకూడా దానిని వాడుతున్నారు. యంత్ర నిర్మాతలు తాము నిర్మించే యంత్రాల పరిమాణాన్ని బరువును తగ్గించడంద్వారా ఎంతో లోహాన్ని ఆదా చేయవచ్చు; అందుకు వారు యంత్రాలు, తదితర పరికరాలు ఎక్కువ మన్నికకు, యితోధిక ఉత్పాదక శక్తికి దోహదకరమైన 'లోఅల్లాయ్' ఉక్కును, తదితర నూతన పదార్థాలను ఉపయోగించవచ్చు. గృహనిర్మాణంలో లోహానికి బదులు కాంక్రీట్‌ను రియిన్‌ఫోర్స్‌డ్ కాంక్రీట్‌ను ఉపయోగించటానికి మనం దృఢ సంకల్పంతోను, లాభ దృష్టితోను ప్రవర్తించాలి.

నాన్ ఫెర్రస్ లోహాలు, అరుదైన లోహాలు, అలాగే స్టెయిన్‌లెస్ స్టీల్, ఉష్ణ నిరోధక ఉక్కు అల్లాయ్స్ మున్నగువాటి ఉత్పత్తిని యితోధికం చేసేందుకు గట్టిపట్టుదలతో కృషిచేయుటం అత్యంత ప్రధానమైన కర్తవ్యంగా భావించాలి.

పాతవాటిని ఆధునికం చేసినంత మాత్రాన సాంకేతికాభివృద్ధిని సాధించినట్లు కాజాలదు; పరిశ్రమలలో కొత్త కొత్త శాఖలను నెలకొల్పటం, కొత్త కొత్త పద్ధతులలో ఉత్పత్తిని సాగించటం చేస్తేనే తప్ప సాంకేతికాభివృద్ధి సమగ్రం కాబోదు.

పరిశ్రమల ఉపయోగార్థం ఉద్దేశించబడిన సరుకుల తయారీకోసం ఈనాటికీ ఆహారపదార్థాలు పెద్దయెత్తున వ్యయమవుతున్నాయి. ఉదాహరణకు 1955 వ సంవత్సరంలో సారాను ఉత్పత్తిచేసేనిమిత్తం 20 లక్షల టన్నుల ధాన్యాన్నీ, 7 లక్షల టన్నుల బెల్లపురసాన్ని ఉపయోగించారు. సబ్బులు, క్షాళనాలు, వార్నిషులు, లూబ్రికెంట్స్ తదితర సాంకేతికావసరాలకు సుమారు 4 లక్షల టన్నుల క్రొవ్వుపదార్థాలను వాడారు. అయితే పైన పేర్కొన్న వాటన్నిటికీ ఆయిల్, బొగ్గు, నాచురల్ గ్యాస్ ఉపజనితాలు చక్కగా ఉపయోగపడగలవు. ఆరో పంచవర్ష ప్రణాళికాకాలం ముగిసేటప్పటికి పైన పేర్కొన్న వాటిస్థానే సింథటిక్ (కృతక) ముడిసరుకులను ఉపయోగించటంలో మనం కృతకృత్యులం కావాలి. అంటే 1961 సంవత్సరం ప్రారంభంనుంచి ఇక ఆహారపదార్థాలను ఆ విధంగా ఉపయోగించటం విరమించగలగాలి. కృతకమైన నార ఉత్పత్తిని అభివృద్ధి చేసేందుకు శక్తి వంచన లేకుండా కృషిచేయాలి: గత కొలది సంవత్సరాలలోను కృతకమైన నార ఉత్పత్తి పెరిగినమాట నిజమే అయినా, మన అవసరాలు తీరాలంటే ఆ ఉత్పత్తి యింకా ఎంతో పెరగవలసి వుంటుంది.

భవిష్యత్తులో భారీ పరిశ్రమలను ఎక్కువ వేగంగా అభివృద్ధి చేసేందుకు కృషి సాగిస్తూనే, మరొకప్రక్క వాడకం వస్తువుల వుత్పత్తినికూడా విస్తరింపచేయవలసి వుంటుంది.

పెట్టుబడిదారీ వుత్పత్తి లక్ష్యం విపరీతమైన లాభాలను ఆర్జించటమేనన్న విషయం మనకు తెలుసు. పెట్టుబడిదారులు కార్మికులను నిరంతరం తీవ్రతరంగా దోపిడిచేయటం ద్వారాను, వుత్పత్తిని విస్తరింపచేయుటం ద్వారాను, ఆ లాభాలు ఆర్జించుతున్నారు. అయితే వుత్పత్తి విస్తరణ ధోరణికీ, కార్మికుల కొనుగోలుశక్తి పడిపోతున్నందువల్ల - పెట్టుబడిదారీ విధానంలో ఇది అనివార్యం - ప్రజా వినిమయం సంకుచిత పరిమితులకు లోను కావటానికీమధ్య ఘర్షణ తలెత్తుతుంది. వుత్పత్తి, వినిమయాలకు మధ్యవుండే వైరుధ్యం పెట్టుబడిదారీ సమాజపు విశిష్ట లక్షణం.

పెట్టుబడిదారీ ఉత్పత్తిలో వున్న ఈ వైరుద్యాన్ని సామ్యవాదం నిర్మూలించింది. అనుదినం వృద్ధిచెందుతున్న శ్రామికప్రజలయొక్క, మొత్తం సమాజం యొక్క జీవన, సాంస్కృతికావసరాలను క్రమానుగతంగా సాధ్యమైనంత హెచ్చుగా తీర్చటమే సామ్యవాద ఉత్పత్తి లక్ష్యం. భారీ పరిశ్రమలు విస్తరించే కొద్దీ, వృద్ధి చెందుతున్న ప్రజావసరాలను ప్రత్యక్షంగా తీర్చే పరిశ్రమలను అభివృద్ధిచేయాల్సిన ఆవశ్యకత క్రమంగా యితోధికమవుతూ వుంటుంది. అన్ని విధాల అభివృద్ధిచెందిన భారీ పరిశ్రమలు మనకిప్పుడున్నాయి; కనుక ఇటు ఉత్పత్తిసాధనాలు, అటువాడకం వస్తువుల ఉత్పత్తిని త్వరితగతిని పెంపొందించగల్గిన స్థితిలో మనమిప్పుడున్నాం. 1960 నాటికి వాడకం వస్తువుల ఉత్పత్తి 1950 నాటి ఉత్పత్తికన్నా మూడురెట్లు హెచ్చుగా వుంటుందని చెప్పితే సరిపోతుంది. సోవియట్ ప్రజల అవసరాలను యింకా ఎక్కువగా తీర్చేందుకు పార్టీ శాయశక్తులా పాటుపడుతోంది; ఇకముందు కూడా పాటుపడుతుంది. ప్రజల పట్ల తాను నిర్వర్తించవలసిన విధ్యుక్తధర్మం ఇదేనని పార్టీ పరిగణిస్తోంది.

## 3. రవాణా, టెలి కమ్యూనికేషన్ పరికరాలను మెరుగు పర్చడం

రవాణా, టెలి కమ్యూనికేషన్ శాఖలను అభివృద్ధి పర్చటం అన్న విషయానికి జాతీయార్థిక వ్యవస్థాభివృద్ధి దృష్ట్యా అత్యంత ప్రాధాన్యంఉంది. అయిదో పంచవర్ష ప్రణాళికా కాలంలో రవాణా శాఖకు చెందిన సాంకేతిక పరికరాలను ఇతోధికంగా బాగు పర్చటం జరిగింది శ్రామిక సమీకరణా, రవాణా సౌకర్యాల నిర్వహణా వృద్ధి చెందాయి. 19వ పార్టీ మహాసభ ఆదేశించిన ప్రకారం, రైలు, సముద్ర, రోడ్డు రవాణాల ద్వారా జరిగవలసిన సరుకుల చేరవేతను జయప్రదంగా పూర్తి చేశాం.

ఈ విజయాలను గుర్తిస్తూనే, అదే సమయంలో రైల్వే రవాణా సాంకేతికంగా వెనకబడి వున్నదన్న విషయం అంగీకరించి తీరాలి. ఆవిరితో నడిచే రైలు ఇంజన్లనే మనం ప్రధానంగా ఉపయోగిస్తున్నాం. ఇంజన్లను ఆవిరిచేత నడిపిస్తే వాటికి లాగేశక్తి చాలా తక్కువగా ఉంటుందన్న సంగతి జగద్విదితం. విద్యుచ్ఛక్తియొక్క లాగేశక్తి నూటికి 16 నుంచి 18 వంతులుకాగా, ఆవిరియొక్క లాగేశక్తి నూటికి 4 నుంచి 5 వంతుల వరకు మాత్రమే ఉంది.

విద్యుచ్ఛక్తిద్వారా రైలు బళ్ళను నడిపితే రవాణా స్తోమతను యితోధికం చేయగలం. అదేవిధంగా రవాణా నిర్వహణను బాగుపర్చగలం. ఆవిరితో పోల్చి చూంటే విద్యుచ్ఛక్తితో రైళ్ళను నడిపినందువల్ల ఇంధన వ్యయములో మూడోవంతు లేక నాలుగోవంతు తగ్గించడానికి వీలవుతుంది. ప్రభుత్వ ప్రణాళికాసంఘం, సోవియట్ యూనియన్ రైల్వేమంత్రిత్వశాఖ అంచనాలప్రకారం మాస్కో - వ్లాడివాస్టక్ రైలు మార్గంలో ఆవిరిచేత రైలు బళ్ళను నడిపించటానికి మారు విద్యుచ్ఛక్తితో వాటిని నడిపిస్తే ఏటా 18 లక్షల టన్నుల బొగ్గు 270 కోట్ల రూబుళ్ళు ఆదా చేయవచ్చు. ఈ రైలుమార్గాన్ని విద్యుదీకరించేందుకు అవసరమైన పెట్టుబడి వ్యయాన్ని నాలుగు సంవత్సరాలలో పూడ్చుకోవచ్చునని అంచనా వేయబడింది.

ఈ విషయం ఎంతో ప్రధానమైనదీ, తక్షణావసరమైనదీ అయినప్పటికీ, రైల్వే రవాణాశాఖలో పనిచేస్తున్నవారు విద్యుదీకరణను అమలుజరిపేందుకు ఉత్సాహంతో పనిచేయలేదు. అంతేకాక, విద్యుదీకరణకై కేటాయించిన మొత్తాలను పూర్తిగా వుపయోగించవన్నా వుపయోగించలేదు. 2267 కిలోమీటర్ల రైల్వేమార్గాన్ని మాత్రమే పంచవర్ష ప్రణాళికాలక్ష్యంలో - ఇది నూటికి 58 వంతులు మాత్రమే - గత అయిదు సంవత్సరాలలోను విద్యుదీకరించారు. ఈదశ పొడుగునా రైల్వే మంత్రిత్వశాఖ తన కర్తవ్యాన్ని నిర్వర్తించటంలో విఫలమవుతూ వచ్చింది. సాంవత్సరిక ప్రణాళికల క్రింద భారీనిర్మాణానికై కేటాయించిన మొత్తాలను ప్రతి సంవత్సరం కూడా పూర్తిగా వినియోగించకుండా మిగుల్చువతూవచ్చింది. ఈ మంత్రిత్వశాఖలో పని చేస్తున్నవారు రవాణాశాఖను సాంకేతికంగా పునర్నిర్మించే విషయం వచ్చేసరికి కరడు గట్టిన పాతభావాలను ప్రదర్శించుతున్నారని తేలుతోంది.

రైల్వే రవాణాను సాంకేతికంగా పునర్నిర్మించే విషయంలోను, దానిని వృద్ధి చెందుతున్న సాంకేతిక శాస్త్రానికి అనుగుణంగా అభివృద్ధి చేయడంలోను రైల్వేలను విద్యుదీకరించటం అత్యంత ప్రధానాంశం. జాతీయార్థిక వ్యవస్థను సంబంధించినంత వరకు ఈ అంశానికిగల అధికతర ప్రాధాన్యాన్ని దృష్టిలో వుంచుకొనే కేంద్ర కమిటీ ఇటీవలనే ఒక నిర్ణయం చేసింది. పదిహేను సంవత్సరాల కాలంలో రైల్వే లను విద్యుదీకరించే నిమిత్తం ఒక ప్లానును రూపొందించింది. మొత్తం 40వేల కిలో మీటర్ల రైల్వేమార్గాన్ని విద్యుదీకరించాలని ఆ ప్లాను నిర్దేశిస్తోంది. (హర్షధ్వానాలు)

రైల్వే సాంకేతికపరికరాలను బాగుపర్చటానికి తీసుకోవలసిన మరొక ముఖ్య చర్యకూడా ఉంది. విద్యుదీకరణతోపాటు, ఆవిరితో నడిచే రైలుఇంజన్లను తొలగించి, వాటిస్థానే డీజల్ రైలుఇంజన్లను సత్వరంగా ప్రవేశపెట్టాలి. ప్రస్తుతం జరుగుతున్న డీజల్ రైలుఇంజన్ల ఉత్పత్తిగానీ, వాటి రవాణాస్తోమతగానీ ఏమాత్రం తగినంతగా లేదనే చెప్పాలి అందుచేత అనేక రవాణా యంత్రకర్మాగారాలను, డీజల్ రైలుఇంజన్ల ఉత్పత్తి కర్మాగారాలుగా మార్చాలని సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీ కేంద్ర కమిటీ, సోవియట్ యూనియన్ మంత్రిమండలి 1955 సెప్టెంబరులో నిర్ణయించాయి.

విద్యుత్, డీజల్ రైలు ఇంజన్లను అధికంగా ఉపయోగించటం శాశ్వత రైలు మార్గాన్ని మెరుగుపర్చటం, రవాణా కంట్రోల్‌ను స్వయంచలితం, కేంద్రీకృతం కావించటం, తదితర చర్యలు తీసుకోవటంద్వారా రవాణా స్తోమతను యితోధిక చేయ వీలవుతుంది.

వాణిజ్య ఓడలు, దేశాంతర నీటిరవాణాలద్వారా కార్గోషిఫ్‌మెంటులను పెంపొందించేందుకు శాయశక్తులా కృషి చేయాలి. ప్రస్తుతం దేశంలో జరుగుతున్న మొత్తం రవాణాలో ఓడలద్వారా జరిగే రవాణా నూటికి 12 వంతులు మాత్రమే వున్నది. ఇది ఏమాత్రం సరిపోదు.

విమానం, పైప్‌లైన్ రవాణాను యింకా త్వరితంగా అభివృద్ధిచేయాలి.

అయిదో పంచవర్ష ప్రణాళికా కాలంలో రోడ్డురవాణా మొత్తం రెండింతలకు పెరిగింది. అయినప్పటికీ ఆ పెరుగుదల సరిపోదు. మన రోడ్డురవాణాను వృద్ధి చెందింపచేయటానికి యిప్పటికీ అపారమైన అవకాశాలు వున్నాయి. రోడ్డురవాణాకు సంబంధించినంతవరకు కేంద్రీకరణ అన్నది లేకపోవటం దానికిచెందిన పెద్ద లోపాలలో ఒకటి. పుట్టగొడుగులవంటి సంస్థలు ఎన్నో తలెత్తాయి; అనేక కర్మాగారాల, సంస్థల నిర్వాహకులు వాటిని పట్టుకొని మొండిగా ప్రాకులాడుతున్నారు. ఈసంస్థలలో నూటికి 85 వంతులకు పైగా పదిబళ్ళో లేక అంతకన్నా తక్కువో గల సంస్థలు మాత్రమేనని చెప్పితే సరిపోతూంది. వుదాహరణకు గత సంవత్సరం మన మోటారు లారీలలో సుమారు సగం పనిపాటలు లేక మూలపడటానికీ, నడుస్తున్నవి కూడా సగంకాలం ఖాళీగా ప్రయాణంచేయటానికీ ఇదే ప్రధానకారణం. ఈ రకమైన దళితస్థితికి మనం స్వస్తిచెప్పితీరాలి. మోటారు రవాణాను పెద్దపెద్ద సంస్థలపరం చేసితీరాలి. అలా చేస్తే ఆర్థికంగా ఎంతో వుపయోగకరంగా వుండగలదు. రోడ్ల నిర్మాణాన్ని సాధ్యమైనంత ఎక్కువగా విస్తరింపచేయాలి.

మన కారులను దుబారాగా వాడటం జరుగుతున్నదన్న విషయంకూడా చెప్పక తప్పదు. కొంతమంది వ్యక్తులకు కారులను ప్రత్యేకించటం ఒక అలవాటుగా పరిణమించింది. కారు ప్రత్యేకించబడిన వ్యక్తి ఎక్కడకు వెళ్ళవలసిన అవసరం లేనప్పుడు ఆ కారు పనిపాటలులేకుండా మూలపడి వుంటుంది. అయినప్పటికీ ఒకరిద్దరు డ్రైవర్లు, మరికొందరు సర్వీస్ పర్సనల్ జీతాలు పుచ్చుకుంటూనే వుంటారు. ఈ విషయాన్ని సోషలిస్టు ప్రాతిపదికమీద వుంచేందుకు మనం సంకల్పంతో పనిచేయాలి. వ్యక్తులకు మోటారుకార్లను కేటాయించే పద్ధతికి స్వస్తిచెప్పాలి. ఇందుకు బహు కొద్ది వ్యక్తులను మినహాయిస్తేచాలు. కార్యనిర్వాహకుల ఉపయోగార్థం సర్వీస్ టాక్సీలను వుంచాలి. మన కారుల వుత్పత్తి నిరంతరం పెంపొందుతూ వుంటుంది కనుక ఈ పని చేయటం మరీ అవసరం. ఎందుచేతనంటే పాతపద్ధతులలోనే కనుక మనం వ్యవహారం నడిపితే, యిప్పటికే చాలా ఎక్కువగావున్న సర్వీస్ పర్సనల్‌సంఖ్య యింకా పెరిగిపోతుంది. దీనిని కొనసాగించేందుకు ఏమాత్రం వీలు లేదు. అవసరమొచ్చినప్పుడు వ్యక్తులకు కారులను కేటాయించవలసిందే; అయితే ఆ వ్యక్తులు స్వయంగా కార్లను

నడపటం నేర్చుకోనేట్లు చూడాలి. మన మోటారు రవాణా నిర్వాహణలోని పరిస్థితినిఅసలు ఏనాడో చక్క దిద్దవలసింది; నిరంతరత్వానికి అలవాటుపడిన వుద్యోగులు ప్రతిఘటించినప్పటికీ లెక్క చేయకుండా ఆ పరిస్థితిని చక్కదిద్దాలి. మన సోషలిస్టు రాజ్యంయొక్క ప్రయోజనాలకు అదెంతో అవసరం. (హర్షధ్వానాలు)

టెలికమ్యూనికేషన్ శాఖలలోని పరిస్థితి ఇటీవల సంవత్సరాలలో కొంతవరకు బాగుపడింది. అయినప్పటికీ, టెలికమ్యూనికేషన్ వసతులు, ముఖ్యంగా రేడియో రిలేమార్గాలు, ఫొటోటెలిగ్రాఫ్ టెలివిజన్ ప్రసారాలు ప్రజావసరాలను జాతీయ ఆర్థికావసరాలను యింకా తీర్చలేకపోతున్నాయి. అధునాతనమైన శాస్త్రీయ, ఇంజనీరింగ్ విజయాలతో సరితూగగలిగిన పద్ధతిలో కమ్యూనికేషన్ సాధనాలను అభివృద్ధిచేసి, బాగుపర్చేందుకు యిప్పటికన్నా మరింత పట్టుదలతో కృషిసాగించటం అవసరం.

## 4. ఉత్పత్తి శక్తుల సక్రమ పంపిణీ

మన పారిశ్రామికోత్పత్తిని యింకా పెంచాలంటే, ముడిసరుకులు, ఇంధనం, విద్యుచ్ఛక్తి లభించే కొత్త కొత్త వనరులకోసం వెతకవలసి వుంటుంది. అన్నిటికంటే ముఖ్యంగా మన దేశంలో తూర్పు ప్రాంతానవున్న అపారమైన సహజసంపదను వినియోగించుకొనితీరాలి.

సోవియట్ యూనియన్‌లోగల బొగ్గు నిల్వలలో నూటికి 75 వంతులు, జల విద్యుచ్ఛక్తిలో నూటికి 80 వంతులు, కలపలో నూటికి 80 వంతులు తూర్పు ప్రాంతంలో దొరుకుతాయి. నాన్‌ఫెర్రస్ లోహాలలోను, అరుదుగా దొరికే లోహాలలోను హెచ్చుభాగం యిక్కడే లభిస్తుంది. అపారమైన రసాయనిక ముడి పదార్థాలు, ముడి యినుము, గృహ నిర్మాణ సమస్యలుకూడ తూర్పు ప్రాంతంలోనే గలవన్న సంగతి మనం గుర్తుంచుకోవాలి.

సోవియట్ యూనియన్‌లోని యూరపియన్ ప్రాంతంలోకన్నా తూర్పు ప్రాంతంలో బొగ్గును త్రవ్వటం, విద్యుచ్ఛక్తిని ఉత్పత్తిచేయటం తక్కువ ఖర్చుతో సాధ్యమని అనుభవం చాటిచెబుతోంది. డాన్‌బాస్ బొగ్గుతో పోల్చుకుంటే అయిదవ పంచవర్ష ప్రణాళికాకాలంలో తూర్పు సైబీరియాలో ఉత్పత్తిఅయిన ప్రతి ఒక టన్ను బొగ్గుకు పెట్టుబడివ్యయం నూటికి 40 వంతులుకాగా, క్యూబాస్‌లో ప్రతి టన్నుకు పెట్టుబడివ్యయం సుమారు నూటికి 67 వంతులుఅయిందన్న సంగతి చెప్పితే సరిపోతుంది. గత సంవత్సరం డాన్‌బాస్ బొగ్గు ఉత్పత్తికన్నా క్యూబాస్ బొగ్గు ఉత్పత్తి వ్యయం టన్ను 1 కి నూటికి 33 వంతులు తక్కువగావుంది. 1960 లో క్యూబాస్‌లో 8 కోట్ల టన్నుల బొగ్గును ఉత్పత్తిచేయాలని ప్లాన్ వేయబడింది. ఈ 8 కోట్ల టన్నుల బొగ్గును డాన్‌బాస్‌లో వుత్పత్తిచేస్తే అయ్యేఖర్చుకన్నా, క్యూబాస్‌లో వుత్పత్తి చేసినందువల్ల ప్రభుత్వానికి 240 కోట్ల రూబుళ్లు మిగులుతాయి.

మరొక ఉదాహరణ చూడండి. అంగారా నదిపైన బ్రాట్స్క్ జల విద్యుచ్ఛక్తి కేంద్రాన్ని మన మిప్పుడు నిర్మిస్తున్నాం. దాని శక్తి 32 లక్షల కిలోవాట్లు. ఏటేటా 2200 కోట్ల కిలోవాట్ గంటల విద్యుచ్ఛక్తిని అది ఉత్పత్తి చేస్తుంది. ఇంకోవిధంగాచెప్పాలంటే సోవియట్ యూనియన్‌లోని యూరపియన్ ప్రాంతంలో గల రెండు పెద్ద జలవిద్యుత్ కేంద్రాలు—కుయిబిషేవ్, స్టాలిన్‌గ్రాడ్ జల విద్యుత్ కేంద్రాలు - కలిసి ఎంత విద్యుచ్ఛక్తిని ఉత్పత్తి చేస్తాయో అంత విద్యుచ్ఛక్తిని అదొక్కటే ఉత్పత్తి చేస్తుంది. పోతే, కుయిబిషేవ్, స్టాలిన్‌గ్రాడ్ జల విద్యుత్ కేంద్రాలు రెండింటిని నిర్మించటానికి ఎంత మొత్తం ఖర్చు అయిందో, అందులో సగంమాత్రమే ఈ జల విద్యుత్ కేంద్ర నిర్మాణానికి ఖర్చు అవుతుంది. పైగా కుయిబిషేవ్, స్టాలిన్‌గ్రాడ్ జల విద్యుత్ కేంద్రాలలో తయారయ్యే విద్యుచ్ఛక్తి వుత్పత్తి వ్యయంకన్నా అంగారా నదిపై నిర్మించబడుతున్న విద్యుత్ కేంద్రంలో తయారయ్యే విద్యుచ్ఛక్తి వుత్పత్తి వ్యయం ఏటా 20 కోట్ల రూబుళ్ళు తక్కువ.

కామ్రేడ్స్, తూర్పు ప్రాంతంలోని విద్యుచ్ఛక్తి వనరులను పెద్దఎత్తున ఉపయోగించుకోన్నందువల్ల మనకు ఎంత గిట్టుబాటుగా వుంటుందో పై దానినిబట్టి గ్రహించవచ్చు. వచ్చే పది సంవత్సరాలలో సైబీరియాను సోవియట్ యూనియన్‌లోని ప్రముఖమైన బొగ్గు, విద్యుదుత్పాదక కేంద్రంగా మార్చివేయాలి; ఇంధనాన్ని విద్యుచ్ఛక్తిని పెద్దఎత్తున వాడుతూ ఆ ప్రాంతాన్ని ప్రధాన పారిశ్రామిక కేంద్రంగా తయారు చేయాలి; ముఖ్యంగా అల్యూమినియమ్, మెగ్నీషియమ్, టిటానియమ్, అలాగే ఎలెక్ట్రో - మెటలర్జికల్, కోక్ బై ప్రోడక్ట్సు ఎలెక్ట్రో - కెమికల్ మున్నగు పరిశ్రమలను అక్కడ నెలకొల్పాలి. (హర్షధ్వానాలు)

అత్యంత ప్రధానమైన ఈ జాతీయ కర్తవ్యాన్ని జయప్రదంగా నిర్వహించే నిమిత్తం తూర్పు ప్రాంతంలో ఇనుము, ఉక్కు పరిశ్రమను పెంపొందించేందుకు శాయశక్తులా కృషిచేయాలి. 1955 లో యూరల్స్‌లోను, పశ్చిమ సైబీరియాలోను 1 కోటి 40 లక్షల టన్నులు ముడి ఇనుము ఉత్పత్తి అయింది; అంటే బ్రిటనులో వుత్పత్తి అయిన మొత్తం ముడి యినుముకన్నా ఇది ఎక్కువన్నమాట. అయినప్పటికీ ఏటా సోవియట్ యూనియన్‌లోని యూరపియన్ ప్రాంత నుంచి తూర్పు ప్రాంతానికి లక్షలాది టన్నుల నాన్‌ఫెర్రస్ లోహాలను పంపక తప్పటంలేదు. అందుచేత సైబీరియాలోను, కజఖ్‌స్తాన్‌లోను, దూరప్రాచ్యంలోను ఇనుము, ఉక్కు పరిశ్రమలను త్వరితంగా అభివృద్ధి చేసేందుకు దృఢ నిశ్చయంతో చర్యలు గైకొనాలి.

ఇక, వచ్చే రెండు లేక మూడు పంచవర్ష ప్రణాళికల కాలంలోను సైబీరియాను దేశంలోని మహత్తరమైన మూడవ లోహ పారిశ్రామిక కేంద్రంగా మార్చటమే మన కర్తవ్యం; అక్కడ ఏటా 150 నుంచి 200 లక్షల టన్నుల ముడియినుమును మనం వుత్పత్తిచేయాలి. సైబీరియా ప్రాంతంలో ఎక్కడెక్కడ ఇనుము, ఉక్కు, కర్మాగారాలను నెలకొల్పాలో, వాటిని ఎలా అభివృద్ధిచేయాలో వివరించే ఒక జనరల్

ప్లానును తయారుచేయటం అవసరం. అలాగే, ఈ ప్రాంతంలో భూగర్భ పరిశోధనలను, శాస్త్రీయ తదితరమైన పరిశోధనలను పెద్దఎత్తున సాగించవలసి వుంటుంది.

తూర్పుప్రాంతాలలో ఇంజనీరింగ్ పరిశ్రమలు కూడా తగినంతగా పెంపొందలేదు. వచ్చే పదిసంవత్సరాలలోను ఆ ప్రాంతాలలో కొత్తగా పెద్దపెద్ద ఇంజనీరింగ్ కేంద్రాలను నెలకొల్పి, అన్నిరకాల యంత్రాలను, యంత్రసాధనాలను, పరికరాలను తయారు చేయవలసి వుంటుంది.

తూర్పుప్రాంతాలలో లభ్యమయ్యే ఈ అపారమైన సహజ సంపదను, పారిశ్రామిక వనరులను మరింత శక్తివంతంగా మనం మచ్చికచేసుకోవాలి: మనదేశ ఉత్పత్తి శక్తులను యింకా పెంపొందించుకొనేందుకు వీలుగా వాటిని మరింత చక్కగా వినియోగించుకోవాలి.

దేశాన్ని ఆర్థిక మండలాలుగా విభజించి, వాటి ప్రకారం పరిశ్రమలను సర్వసమన్వితమైన పద్ధతిలో పంపిణీచేసినందువల్ల మనకెంతో ఉసులుబాటు లభిస్తుంది; ఈ విషయంపై మనం దృష్టిని లగ్నంచేయాలి. మనది చాలా పెద్దదేశం కాబట్టి ఆ యా ఆర్థిక జిల్లాల అవసరాలను దృష్టిలో వుంచుకొని మరీ పరిశ్రమలను కనుక మనం అభివృద్ధి చేయకపోయిన పక్షంలో, అనేకచిక్కులను చేజేతులా తెచ్చిపెట్టుకున్న వాళ్ళమవుతాం; ఒక ప్రాంతంనుంచి మరొక ప్రాంతానికి వస్తువులను తరలించటానికి అనవసరంగా ఎంతో డబ్బు తగలేయవలసివస్తుంది. సర్వతోముఖమైన జాతీయార్థికాభివృద్ధికి ఎన్నో చిక్కులు ఏర్పడతాయి.

## 5. శ్రామిక ఉత్పాదకశక్తి; పారిశ్రామికోత్పత్తి వ్యయం; మూలపరిశ్రమల నిర్మాణం

శ్రామిక ఉత్పాదకశక్తే కడకు నూతన సామాజికవ్యవస్థ విజయానికి అత్యంత ముఖ్యాంశంగా వుండగలదని లెనిన్ చేసిన ఉద్ఘాటన జగద్విదితం. ఆయన ఆదేశాన్ని శిరసావహిస్తున్న మనపార్టీ సాంకేతికాభివృద్ధి ప్రాతిపదికపై శ్రామిక ఉత్పాదకశక్తిని క్రమంగా పెంపొందించేందుకు కృషిచేసిం ; ఇకముందుకూడా చేస్తుంది.

శ్రామిక ఉత్పాదకశక్తి వృద్ధిచెందటానికి అత్యంతముఖ్యమైన షరతుగా ఈ క్రిందిదానిని లెనిన్ పేర్కొన్నారు. "శ్రామికజనానీకంలో విద్యుక్తధర్మ చింతననూ, నైపుణ్యాన్నీ, సామర్థ్యాన్ని శ్రమశీలాన్ని పెంపొందించాలి; పనిపాటల నిర్వహణకు చక్కని నిర్మాణం రూపొందించాలి" తమ జీవనసౌఖ్యానందాలకు ప్రాతిపదిక అత్యధిక శ్రామికోత్పాదనే అన్నవిషయం సోవియట్ ప్రజలకు తెలుసు. అందుచేత పారిశ్రామిక రంగంలో వుత్పత్తి, శ్రమలకు సంబంధించిన నిర్మాణాన్ని మెరుగుపర్చేందుకు మనం అహర్నిశలు కృషిచేస్తూండాలి. ఆవిధంగా సాధనసంపత్తి, పనికాలం వృధాకాకుండా చూడాలి.

పారిశ్రామిక సంస్థల నిర్వహణలో ఆర్థికాంశంపట్ల పార్టీ, ఆర్థిక సంస్థలు అత్యంత శ్రద్ధను చూపాలి. ప్రతి కర్మాగారం సక్రమంగా పని చేసేటట్లు చూసేందుకూ, వుత్పత్తి వ్యయం తగ్గించేందుకూ నిరంతరం కృషిచేస్తుండాలి; పొదుపరితనం తు చ. తప్పకుండా పాటించాలి. ఖర్చుపెట్టిన మొత్తమంతా ఖాతాపుస్తకాలలోకి విధిగా ఎక్కేటట్లు చూడాలి.

కామ్రేడ్స్, పరిశ్రమలు యితోధికంగా వృద్ధిచెందాలన్నా, మొత్తం జాతీయార్థిక వ్యవస్థ అభివృద్ధి పొందాలన్నా, మూలపరిశ్రమల నిర్మాణం అత్యంత ప్రాధాన్యం వహిస్తుంది. ఇక మన దేశంలో మూలపరిశ్రమల నిర్మాణానికి 20,000 కోట్ల రూబుల్ల పెట్టుబడి వ్యయం అవుతు టుంది. కనక మూలపరిశ్రమల నిర్మాణం విషయంలో మనం ఇంకా ఎక్కువ శ్రద్ధ ప్రదర్శించి, దానిని గట్టి పారిశ్రామిక ప్రాతిపదికపై నుంచాలి.

పార్టీ కేంద్రకమిటీ, సోవియట్ మంత్రిమండలీ ఆ మధ్య గృహనిర్మాణ పరిశ్రమను అభివృద్ధిచేసి, ఆధునిక మొనర్చేవిషయమై అనేక ప్రధానమైన నిర్ణయాలు చేశాయి. మూలపరిశ్రమల నిర్మాణానికి కేటాయించిన నిధులను అత్యంత సమర్థవంతంగా వినియోగించటం, నిర్మాణానికి సంబంధించిన నిర్వహణను సాంకేతిక స్థాయికి పెంపొందించటం, నిధులను వెదజల్లే పద్ధతికి వ్యతిరేకంగా గట్టిపోరాటం సాగించటం, నిర్మాణాన్ని అత్యంత త్వరితంగా పూర్తిచేయటం, వ్యయాన్ని తగ్గించటం - ఇవే మనం నిర్వహించవలసిన కర్తవ్యాలు. నిర్మాణాన్ని పారిశ్రామికవంత మొనర్చటం ద్వారానే మనమీ కర్తవ్యాలను నిర్వహించగలం. ఫ్యాక్టరీలలో తయారయ్యే స్ట్రక్చరల్ ఫెర్రో, కాంక్రీట్ను, కాంక్రీట్ సెక్షన్లను, యూనిట్లను పెద్ద ఎత్తున ఉపయోగించటం ద్వారానే ఆ విధులను మనం నిర్వర్తించగలం.

మనదేశంలో మూలపరిశ్రమల నిర్మాణస్థాయి క్రమానుగతంగా వృద్ధిచెందు తోంది. పరిశ్రమలలోని స్థిరపెట్టుబడి త్వరితంగా పెరుగుతోంది. నిర్మాణ పద్ధతులను బాగుపర్చటంతోపాటే, ప్రస్తుతమున్నవాటి స్తోమతను పరిపూర్ణంగా వినియోగించు కోవలసి వుంటుందన్న విషయం ఎప్పుడూ మర్చిపోరాదు. అనేక పారిశ్రామికసంస్థలు అదనంగా పెద్ద ఎత్తున పెట్టుబడినుంచి వ్యయం చేయనవసరం లేకుండానే తమతమ వుత్పత్తులను యితోధికం చేయగలవనీ, కొన్నికొన్ని తమ వుత్పత్తులను రెండింటిలో మూడంతలు చేయగలవనీ మనం అనుభవంలో తెలుసుకొన్నాం. మనం చేయవలసిందల్లా కర్మాగారాన్ని ఆధునిక మొనర్చటం, వుత్పత్తి, శ్రమనిర్వహణలను మెరుగుపర్చటం, నేర్పరులైన కార్మికుల అనుభవాన్ని బాగా వుపయోగించుకోవటం. కొత్త కొత్త విషయాలను కనుగొనే వారి సృజనాత్మక చొరవకు అవకాశం కల్పించటం, తక్కువ అంగబలంతో ఎక్కువపనిని నిర్వహించే పద్ధతులను కనిపెట్టేవారికి అవకాశం కల్పించటం సక్రమంగా నిర్వహించటమే.

మహత్తరమైన మన కార్మికవర్గానికి చెందిన లక్షలాది స్త్రీ పురుషులు, మన ఇంజనీర్లు, సాంకేతిక నిపుణులు, నోవరిస్టు ఉత్పత్తి విధానంలో అంతర్లీనంగావున్న అపారమైన శక్తిస్తోమతలను త్రవ్వి వెలుగులోకి తెచ్చేందుకు సమధికోత్సాహంతో

పాటుపడుతున్నారు. అందుకు సోషలిస్టు పోటీ ఒక చక్కని తార్కాణం. ఈ పోటీ వుద్యమాన్ని మనం మరింతగా విస్తృతపర్చాలి; అయితే అది ఆందోళనోద్యమమాత్రమే కాదన్న విషయం గుర్తుంచుకోవాలి; కోటానుకోట్ల ప్రజల పవిత్రాశయంగా దానిని మనం పరిగణించాలి; సోషలిస్టు వుత్పత్తి విధానాన్ని అభివృద్ధిపర్చి, మెరుగులు దిద్దే బలీయమైన శక్తిగా దానిని మనం గుర్తించాలి. మన శ్రామిక జనానీకం, మన ఇంజనీర్లు, సాంకేతిక నిపుణులు తమ సృజనాత్మక శ్రమశక్తితో ఆరవ పంచవర్ష ప్రణాళికను జయప్రదంగా పూర్తిచేయగలరన్న విశ్వాసం మనకు వుంది. (దీర్ఘహర్షధ్వానాలు)

## వ్యవసాయం

కామ్రేడ్స్, బలోపేతమైన పరిశ్రమలతోపాటే మనదేశంలో వ్యవసాయాన్నికూడా సర్వతోముఖంగా అభివృద్ధిచేసుకోవాలి. మన ప్రజల అవసరాలను, దేశావసరాలను పూర్తిగా తీర్చగలిగిన విధంగా ఆహారపదార్థాల వుత్పత్తినీ, ముడిసరుకుల వుత్పత్తినీ పెంపొందించాలి.

సోషలిస్టు ఆర్థికవ్యవస్థ అభివృద్ధి, శ్రామికోత్పాదకశక్తి పెరుగుదలా, ఇటీవల సంవత్సరాలలో వస్తువుల ధరల తగ్గుదలా - వీటన్నిటివల్లా ఫ్యాక్టరీ, ఆఫీసు, తదితర కార్మికుల వాస్తవవేతనాలు (సొమ్ము రూపంలో లభించే వేతనాలకు వస్తువులెన్ని లభిస్తాయో వాటి ప్రమాణం - అను.) గణనీయంగా పెంపొందాయి; సమిష్టి వ్యవసాయదారుల ఆదాయాలు పెరిగాయి. దానిమూలాన ప్రజల కొనుగోలుశక్తి యితోధికమైంది.

ఈ పరిస్థితుల మూలంగా వ్యవసాయసరుకుల వుత్పత్తిని త్వరితంగా పెంపొందించటం అన్న తక్షణ జాతీయ కర్తవ్యమొకటి పార్టీని ఎదుర్కొంటున్నది. వ్యవసాయ రంగానికి సంబంధించిన వ్యవహారాలలోగల కొన్ని ప్రమాదకరమైన లోపాలను, పొరపాట్లను పార్టీ కేంద్రకమిటీ విస్తృత సమావేశం బయటపెట్టింది. ఆహారధాన్యాల వుత్పత్తిని విస్తరింపచేసేందుకు, పశుగణాభివృద్ధికీ విపులమైన కార్యక్రమాన్ని రూపొందించింది.

కార్మికవర్గం, మొత్తం ప్రజానీకం యిస్తున్న క్రియాత్మక సహకారంతో మన పార్టీ వ్యవసాయాన్ని అభివృద్ధి చేసేందుకు పెద్దయెత్తున చర్యలు గైకొన్నది. 1954-55 సంవత్సరాలలోనే వ్యవసాయానికై ఖర్చుచేసిన మొత్తం పెట్టుబడి వ్యయం 3,440కోట్ల రూబుళ్ళు; అంటే నాలుగో పంచవర్ష ప్రణాళిక కాలమంతటిలోనూ వ్యవసాయానికై వెచ్చించిన మొత్తం పెట్టుబడి వ్యయంతో పోల్చుకుంటే యిది నూటికి 38 వంతులు హెచ్చు. గత రెండు సంవత్సరాలలో 4,04,000 ట్రాక్టర్లను (15 హార్స్‌పవర్ యూనిట్లలో లెక్కించితే), 2,28,000 లారీలను, 83,000 కంబైన్ హార్వెస్టర్లను, అసంఖ్యాకమైన యితర యంత్రాలను సమిష్టి వ్యవసాయ క్షేత్రాలకు, మెషీన్ ట్రాక్టర్ కేంద్రాలకు సరఫరా చేశాం.

సమిష్టి వ్యవసాయ క్షేత్రాలు, సమిష్టి వ్యవసాయదారులు సామాజిక యాజమాన్యంలోగల తమ సంస్థలను అభివృద్ధి చేసేందుకూ, మార్కెట్టుకు ఎక్కువ సరుకును సరఫరా చేసేందుకూ వీలుగా భౌతిక ప్రోత్సాహాన్ని వారికి కలుగజేసే నిమిత్తం ఆహారధాన్యాలు, పాలు, వెన్న, మాంసాదులు, బంగాళాదుంపలు, తదితర కూరగాయలు, ఫ్లాక్స్, గోగునార మున్నగువాటి ధరలను గణనీయంగా పెంచి, వాటిని ఖరీదుచేశాం. మనం తీసుకొన్న ఈ చర్యలవల్ల మార్కెట్లకు విడుదలచేసిన సరుకుల పరిమాణం పెరగడంవల్ల 1954, 1955 సంవత్సరాలలో సమిష్టి వ్యవసాయ క్షేత్రాలకు 2000 కోట్ల రూబుళ్ళ అదనపు ఆదాయం చేకూరింది.

మెషీన్, ట్రాక్టర్ కేంద్రాలలో రెగ్యులర్‌గా పనిచేసే నిర్వాహకులను నియమించాం; వాటిని ఆదర్శప్రాయమైన సోషలిస్టు సంస్థలుగా రూపొందించడంలో ఆ చర్య ఎంతో ప్రధానమైనది. అనేక వేలమంది ఇంజనీర్లు, సాంకేతిక నిపుణులు, పార్టీ బాధ్యులు, ప్రభుత్వోద్యోగులు మెషీన్, ట్రాక్టర్ కేంద్రాలలోను, సమిష్టి, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలలోను పనిచేసే నిమిత్తం పట్టణాలనుంచి, పారిశ్రామిక కేంద్రాలనుంచి పల్లెప్రాంతాలకు వెళ్లారు. 1,20,000 మందికి పైగా వ్యవసాయ నిపుణులను సమిష్టి వ్యవసాయ క్షేత్రాలకు పంపించాం. పట్టణాలనుంచి పల్లెప్రాంతాలకు పంపించబడిన కమ్యూనిస్టులలో 20,000 మందికి పైగా సమిష్టి వ్యవసాయ క్షేత్రాల అధ్యక్షులుగా సిఫారసు చేయబడ్డారు. పార్టీ కేంద్రకమిటీ, ప్రభుత్వమూ వ్యవసాయరంగంలో కొత్త ప్రణాళికా పద్ధతిని ప్రవేశపెట్టాయి; దానివల్ల సమిష్టి వ్యవసాయదారుల చొరవకు ఎక్కువ అవకాశ మేర్పడుతోంది. ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాల కృషిని బాగుపర్చేందుకూ, వున్న ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలను పటిష్టతరం చేసేందుకూ, కొత్తవాటిని నెలకొల్పేందుకూ చర్యలు గైకొన్నాం.

వ్యవసాయాన్ని మరింతగా అభివృద్ధిచేసేందుకు పార్టీ రూపొందించిన కార్యక్రమాన్ని జయప్రదంగా అమలుజరిపినందువల్ల ఆహారధాన్యాలు, వాణిజ్య పంటల వుత్పత్తి పెద్దఎత్తున పెంచేందుకు వీలుచిక్కింది. ఈ క్రింది పట్టికను పరికిస్తే ఆ విషయం సుబోధకమవుతుంది.

## సోవియట్ యూనియన్‌లో ఆహారధాన్యాల, వాణిజ్యపంటల మొత్తం ఉత్పత్తి

(1950 = 100)

| | 1950 | 1951 | 1952 | 1953 | 1954 | 1955 |
|---|---|---|---|---|---|---|
| ఆహార ధాన్యాలు | 100 | 97 | 113 | 101 | 105 | 129 |
| సూర్యకాంత పువ్వువిత్తులు | 100 | 97 | 123 | 146 | 103 | 207 |
| షుగర్ బీట్ | 100 | 114 | 107 | 111 | 95 | 147 |
| ముడిపత్తి | 100 | 105 | 106 | 108 | 118 | 109 |
| లాంగ్ స్టేపిల్ ఫ్లాక్స్ ఫైబర్ | 100 | 76 | 81 | 64 | 85 | 149 |

అయిదో పంచవర్ష ప్రణాళికా కాలంలోని మొదటి మూడు, నాలుగు సంవత్సరాలలో ఆహార ధాన్యాల, వాణిజ్య పంటల ఉత్పత్తి ఎంతమాత్రం పెరగలేదన్న విషయమూ, 1955 లో తీసుకున్న అనేక చర్యలవల్ల మొత్తం పంటల ఉత్పత్తి గణనీయంగా పెరిగిందన్న సంగతీ గుర్తుంచుకోవాలి. 1954 తో పోల్చుకుంటే, గత సంవత్సరంలో ఆహారధాన్యాల ఉత్పత్తి నూటికి 22 వంతులు, సూర్యకాంతపు పువ్వు విత్తనాలు ఉత్పత్తి నూటికి 95 వంతులు, షుగర్ బీట్ (ఇదొకదుంప; దీనినుంచి పంచదార తయారుచేస్తారు - అను) ఉత్పత్తి నూటికి 54 వంతులు, ఫ్లాక్స్ ఫైబర్ ఉత్పత్తి నూటికి 74 వంతులు పెరిగాయి. పత్తి పైరుకు ఆదిలోనే మంచుపవనాలు తగిలినందువల్ల పత్తి పంటలో పెరుగుదలలేకుండా పోయింది. బంగాళాదుంప పరిస్థితి అనేక జిల్లాలలో, ముఖ్యంగా రేగడికాని ప్రాంతాలలో, చాలాఅధ్వాన్నంగావుంది.

## 1. ఆహారధాన్యాల సాగు వ్యవసాయానికంతటికీ మూలం

కామ్రేడ్స్, ఆహారధాన్యాల సాగు బాగాఅభివృద్ధిచెందనిదే పశుగణాన్ని వృద్ధిచేయటంకానీ, వాణిజ్యపంటల వుత్పత్తిని పెంచటంకానీ సాధ్యంకాదని పార్టీ అనేకసార్లు స్పష్టంచేసింది. అయినప్పటికీ, అత్యంతముఖ్యమైన ఈ విషయంలో సోవియట్ వ్యవసాయ మంత్రిత్వశాఖ, ప్రభుత్వవ్యవసాయక్షేత్రాల మంత్రిత్వశాఖ, ప్రణాళికాశాఖ తప్పుడుమార్గంలో పయనిస్తున్నాయని చెప్పకతప్పదు. ఆ యా పంటలకోసం కేటాయించినప్రాంతాలు ఆహారధాన్యాల పెంపుదల అవసరాలకు ఏమాత్రం తగినట్టుగాలేవు. అనేకజిల్లాలలో ఆహారధాన్యాలు పండించే భూవిస్తీర్ణాన్ని తగ్గించారు. 'త్రావోపాలి' పంటలమార్పిడివిధానాన్ని ప్రవేశపెట్టటంలో కొన్ని పొరపాట్లు జరిగాయి. 'త్రావోపాలి' సాగులో యంత్రశక్తిని వుపయోగించారు. గడ్డి అంత బాగా పెరగని ప్రాంతాలలో లక్షలాది ఎకరాలలో గడ్డిపైరు వేసారు.

దీని ఫలితంగా, ఆహారధాన్యాల అవసరాలు విప్లవానికి పూర్వంకన్నా ఎంతగానో పెరిగినప్పటికీ, ఆహార ధాన్యాల భూవిస్తీర్ణం 1913 లో ఎంత వుందో, 1953 లో కూడా అంతే వుంది.

1955 జనవరిలో జరిగిన సోవియట్ కమ్యూనిస్టుపార్టీ కేంద్ర కమిటీ విస్తృత సమావేశం మన దేశానికి వ్యవసాయసరుకుల అవసరాలేమిటో సమగ్రంగా పరిశీలించింది; ఆ పరిశీలనను ఆధారంచేసుకొని అతి స్వల్పకాలంలోనే ఆహారధాన్యాల వుత్పత్తిని బాగాపెంచాలనీ; పాలు, వెన్న, ఉన్ని వగైరా సరుకుల వుత్పత్తిని దాదాపు రెట్టింపుచేయాలన్న కర్తవ్యాన్ని ప్రజలముందుంచాం.

పార్టీ నిర్ణయంప్రకారం కజఖ్‌స్తాన్, సైబీరియా తదితర ప్రాంతాలలోగల బీళ్ళను, బంజరుభూములను అభివృద్ధిచేయటానికి కృషి ప్రారంభమైంది; నిరంతర వ్యవసాయాభివృద్ధి దృష్ట్యా ఈ కృషికి అత్యంతప్రాధాన్యం వుంది. 1956 లో

2 కోట్ల 80 లక్షలనుండి 3 కోట్ల హెక్టార్లదాకా అదనపుభూమిని సాగులోకి తీసుకురావాలని సోవియట్ కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ నిర్ణయించింది. ఈ సమస్యా పరిష్కారం మనదేశానికి అత్యంత చారిత్రక ప్రాధాన్యంగల విషయం. బీళ్ళు దున్నటంవల్ల మనదేశానికి సమకూరే సత్ఫలితాలేమిటి? భూములను కొత్తగా సాగులోకి తీసుకొచ్చిన ఫలితంగా ఏటా సగటున 200 కోట్ల పూడ్ల ఆహార ధాన్యాలు అదనంగా లభించగలవని అంచనాలు తెల్పుతున్నాయి. బీళ్ళు దున్నినందువల్ల గోధుమలు చాలా హెచ్చుగా అమ్మకానికి మిగులుతాయి కనుక, ఇక ప్రభుత్వం ఆత్మవిశ్వాసంతో యూక్రేన్, ఉత్తర కాకసస్ ప్రాంతాలలో మొక్కజొన్న పైరును పెద్దయెత్తున పెంచవీలవుతుంది; ఆవిధంగా ఈ ప్రాంతాలలో మాంసం, పాలు వుత్పత్తిని విస్తారంగా పెంచ సాధ్యపడుతుంది. అలాగే వాణిజ్య పంటల వుత్పత్తిని పెంచటానికి వీలు చిక్కుతుంది.

బీళ్ళనుదున్ని, సాగుచేసి అభివృద్ధిచేసే నిమిత్తం ఆ ప్రాంతాలకు బహు స్వల్పకాలంలోనే 2 లక్షల ట్రాక్టర్లను (15 హార్స్‌పవర్ మాటల్లో చెప్పితే), వేలాది తదితర యంత్రాలను, పరికరాలను పంపించాం.

బీళ్ళనుదున్ని సాగుచేసేందుకు పార్టీ తీసుకొన్న చర్యలను యావన్మంది సోవియట్ ప్రజలు హృదయపూర్వకంగా ఆమోదించి బలపర్చారు. సోవియట్ కమ్యూనిస్టు పార్టీ కేంద్రకమిటీ పిలుపు నందుకొని 3 లక్షల 50 వేలమంది సోవియట్ దేశభక్తులు బీళ్లను, బంజర్లను దున్ని సాగులోకి తెచ్చేందుకు ఆ ప్రాంతాలకు తరలి వెళ్లారు. కమ్యూనిజం నిర్మాతల పేరుప్రతిష్ఠలు నిలబెట్టేటట్టుగా వారు కష్టించి పని చేశారు (దీర్ఘ హర్షధ్వానాలు).

పార్టీపిలుపు నందుకొని,కొత్త భూములను సాగులోకి తెచ్చేందుకు కృషిచేస్తున్న యువతీ యువకులకు, యువక కమ్యూనిస్టుసమితి సభ్యులకు, వ్యవసాయ శాస్త్రజ్ఞులకు, ఇంజనీర్లకు, సాంకేతిక నిపుణులకు, దేశభక్తులందరికీ సోవియట్ కమ్యూనిస్టుపార్టీ 20 వ మహాసభతరఫున హృదయపూర్వక అభివందనాలు తెలియజేస్తున్నాను. ఎన్ని కష్టాలొచ్చినా లెక్కచేయక, కష్టించి పనిచేయటంద్వారా వారు మొత్తం సోవియట్ ప్రజల ప్రేమానురాగాలను పొందగలిగారు. (మిన్నుముట్టే దీర్ఘ హర్షధ్వానాలు).

మామూలు పద్ధతులలో, కొత్త ప్రాంతాలలో కుటుంబాలకు క్రమంగా పునరావాసం కల్పించటంద్వారా బీళ్ళనుదున్ని సాగులోకి తీసుకువచ్చేందుకు మనంపూనుకొన్నట్టయితే అపారమైన అంగబలం, ధనబలం అవసరమయ్యేవి; అది ఎంతో కాలం తీసుకొనేదికూడా. అవిధంగా అయితే 3 కోట్ల హెక్టార్లభూమిని రెండేళ్ళలోనే మనం కొత్తగా సాగుచేయగలిగి వుండేవాళ్లంకాదు.

కొత్త పంచవర్ష ప్రణాళికా కాలంలో పార్టీ అలాంటి విజ్ఞప్తులను యువతీ యువకులకు ఒకటికి రెండుసార్లు చేయవలసి రావచ్చు. క్రొత్త ప్రాంతాలను మనం నిరంతరం అభివృద్ధి చేస్తూంటాం; అణుశక్తి, థర్మల్, జలవిద్యుచ్ఛక్తి కేంద్రాలను

అయిదో పంచవర్ష ప్రణాళికా కాలంలోని మొదటి మూడు, నాలుగు సంవత్సరాలలో ఆహార ధాన్యాల, వాణిజ్య పంటల ఉత్పత్తి ఎంతమాత్రం పెరగలేదన్న విషయమూ, 1955 లో తీసుకున్న అనేక చర్యలవల్ల మొత్తం పంటల ఉత్పత్తి గణనీయంగా పెరిగిందన్న సంగతీ గుర్తుంచుకోవాలి. 1954 తో పోల్చుకుంటే, గత సంవత్సరంలో ఆహారధాన్యాల ఉత్పత్తి నూటికి 22 వంతులు, సూర్యకాంతపు పువ్వు విత్తనాలు ఉత్పత్తి నూటికి 95 వంతులు, షుగర్‌బీట్ (ఇదొకదుంప; దీనినుంచి పంచదార తయారుచేస్తారు - అను) ఉత్పత్తి నూటికి 54 వంతులు, ఫ్లాక్స్ ఫైబర్ ఉత్పత్తి నూటికి 74 వంతులు పెరిగాయి. పత్తి వైరసు ఆదిలోనే మంచుపవనాలు తగిలినందువల్ల పత్తి పంటలో పెరుగుదలలేకుండా పోయింది. బంగాళాదుంప పరిస్థితి అనేక జిల్లాలలో, ముఖ్యంగా రేగడికాని ప్రాంతాలలో, చాలాఅధ్వాన్నంగావుంది.

## 1. ఆహారధాన్యాల సాగు వ్యవసాయానికంతటికీ మూలం

కామ్రేడ్స్, ఆహారధాన్యాల సాగు బాగాఅభివృద్ధి చెందనిదే పశుగణాన్ని వృద్ధిచేయటంకానీ, వాణిజ్యపంటల వుత్పత్తిని పెంచటంకానీ సాధ్యంకాదని పార్టీ అనేకసార్లు స్పష్టంచేసింది. అయినప్పటికీ, అత్యంతముఖ్యమైన ఈ విషయంలో సోవియట్ వ్యవసాయ మంత్రిత్వశాఖ, ప్రభుత్వవ్యవసాయక్షేత్రాల మంత్రిత్వశాఖ, ప్రణాళికాశాఖ తప్పుడుమార్గంలో పయనిస్తున్నాయని చెప్పకతప్పదు. ఆ యా పంటలకోసం కేటాయించినప్రాంతాలు ఆహారధాన్యాల పెంపుదల అవసరాలకు ఏమాత్రం తగినట్టుగాలేవు. అనేకజిల్లాలలో ఆహారధాన్యాలు పండించే భూవిస్తీర్ణాన్ని తగ్గించారు. 'త్రావోపొలి' పంటలమార్పిడివిధానాన్ని ప్రవేశపెట్టటంలో కొన్ని పొరపాట్లు జరిగాయి. 'త్రావోపొలి' సాగులో యంత్రశక్తిని వుపయోగించారు. గడ్డి అంత బాగా పెరగని ప్రాంతాలలో లక్షలాది ఎకరాలలో గడ్డిపైరు వేసారు.

దీని ఫలితంగా, ఆహారధాన్యాల అవసరాలు విప్లవానికి పూర్వంకన్నా ఎంతగానో పెరిగినప్పటికీ, ఆహార ధాన్యాల భూవిస్తీర్ణం 1913 లో ఎంత వుందో, 1953 లో కూడా అంతే వుంది.

1955 జనవరిలో జరిగిన సోవియట్ కమ్యూనిస్టుపార్టీ కేంద్ర కమిటీ విస్తృత సమావేశం మన దేశానికి వ్యవసాయసరుకుల అవసరాలేమిటో సమగ్రంగా పరిశీలించింది; ఆ పరిశీలనను ఆధారంచేసుకొని అతి స్వల్పకాలంలోనే ఆహారధాన్యాల వుత్పత్తిని బాగాపెంచాలనీ; పాలు, వెన్న, ఉన్ని వగైరా సరుకుల వుత్పత్తిని దాదాపు రెట్టింపుచేయాలన్న కర్తవ్యాన్ని ప్రజలముందుంచాం.

పార్టీ నిర్ణయంప్రకారం కజఖ్‌స్తాన్, సైబీరియా తదితర ప్రాంతాలలోగల బీళ్ళను, బంజరుభూములను అభివృద్ధిచేయటానికి కృషి ప్రారంభమైంది; నిరంతర వ్యవసాయాభివృద్ధి దృష్ట్యా ఈ కృషికి అత్యంతప్రాధాన్యం వుంది. 1956 లో

2 కోట్ల 80 లక్షలనుండి 3 కోట్ల హెక్టార్లదాకా అదనపుభూమిని సాగులోకి తీసుకురావాలని సోవియట్ కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ నిర్ణయించింది. ఈ సమస్యా పరిష్కారం మనదేశానికి అత్యంత చారిత్రక ప్రాధాన్యంగల విషయం. బీళ్ళు దున్నటంవల్ల మనదేశానికి సమకూరే సత్ఫలితాలేమిటి? భూములను కొత్తగా సాగులోకి తీసుకొచ్చిన ఫలితంగా ఏటా సగటున 200 కోట్ల పూడ్ల ఆహార ధాన్యాలు అదనంగా లభించగలవని అంచనాలు తెల్పుతున్నాయి. బీళ్ళు దున్ని నందువల్ల గోధుమలు చాలా హెచ్చుగా అమ్మకానికి మిగులుతాయి కనుక, ఇక ప్రభుత్వం ఆత్మవిశ్వాసంతో యూక్రేన్, ఉత్తర కాకసస్ ప్రాంతాలలో మొక్కజొన్న పైరును పెద్దయెత్తున పెంచవీలవుతుంది; ఆవిధంగా ఈ ప్రాంతాలలో మాంసం, పాలు వుత్పత్తిని విస్తారంగా పెంచ సాధ్యపడుతుంది. అలాగే వాణిజ్య పంటల వుత్పత్తిని పెంచటానికి వీలు చిక్కుతుంది.

బీళ్ళనుదున్ని, సాగుచేసి అభివృద్ధిచేసే నిమిత్తం ఆ ప్రాంతాలకు బహు స్వల్పకాలంలోనే 2 లక్షల ట్రాక్టర్లను (15 హార్స్‌పవర్ మాటల్లో చెప్పితే), వేలాది తదితర యంత్రాలను, పరికరాలను పంపించాం.

బీళ్ళనుదున్ని సాగుచేసేందుకు పార్టీ తీసుకొన్న చర్యలను యావన్మంది సోవియట్ ప్రజలు హృదయపూర్వకంగా ఆమోదించి బలపర్చారు. సోవియట్ కమ్యూనిస్టు పార్టీ కేంద్రకమిటీ పిలుపు నందుకొని 3 లక్షల 50 వేలమంది సోవియట్ దేశ భక్తులు బీళ్లను, బంజర్లను దున్ని సాగులోకి తెచ్చేందుకు ఆ ప్రాంతాలకు తరలి వెళ్లారు. కమ్యూనిజం నిర్మాతల పేరుప్రతిష్ఠలు నిలబెట్టేటట్టుగా వారు కష్టించి పని చేశారు (దీర్ఘ హర్షధ్వానాలు).

పార్టీపిలుపు నందుకొని,కొత్త భూములను సాగులోకి తెచ్చేందుకు కృషిచేస్తున్న యువతీ యువకులకు, యువక కమ్యూనిస్టుసమితి సభ్యులకు, వ్యవసాయ శాస్త్రజ్ఞులకు, ఇంజనీర్లకు, సాంకేతిక నిపుణులకు, దేశభక్తులందరికీ సోవియట్ కమ్యూనిస్టుపార్టీ 20 వ మహాసభతరఫున హృదయపూర్వక అభివందనాలు తెలియజేస్తున్నాను. ఎన్ని కష్టాలొచ్చినా లెక్కచేయక, కష్టించి పనిచేయటంద్వారా వారు మొత్తం సోవియట్ ప్రజల ప్రేమానురాగాలను పొందగలిగారు. (మిన్నుముట్టే దీర్ఘ హర్షధ్వానాలు).

మామూలు పద్ధతులలో, కొత్త ప్రాంతాలలో కుటుంబాలకు క్రమంగా పునరావాసం కల్పించటంద్వారా బీళ్ళనుదున్ని సాగులోకి తీసుకువచ్చేందుకు మనంపూనుకొన్నట్టయితే అపారమైన అంగబలం, ధనబలం అవసరమయ్యేవి; అది ఎంతోకాలం తీసుకొనేదికూడా. అవిధంగా అయితే 3 కోట్ల హెక్టార్లభూమిని రెండేళ్ళలోనే మనం కొత్తగా సాగుచేయగలిగి వుండేవాళ్లంకాదు.

కొత్త పంచవర్ష ప్రణాళికా కాలంలో పార్టీ అలాంటి విజ్ఞప్తులను యువతీ యువకులకు ఒకటికి రెండుసార్లు చేయవలసి రావచ్చు. క్రొత్త ప్రాంతాలను మనం నిరంతరం అభివృద్ధి చేస్తూంటాం; అణుశక్తి, థర్మల్, జల విద్యుచ్ఛక్తి కేంద్రాలను

కొత్తగా నిర్మిస్తూంటాం; కొత్తకొత్త కర్మాగారాలను, రైల్వేలను నెలకొల్పుతూంటాం. పార్టీ యిచ్చే పిలుపులను మహోదాత్తులైన మనయువతీ యువకులు సమధికోత్సాహంతో ఇకముందుకూడా అందుకొంటారన్న విశ్వాసం పార్టీకి వున్నది. కమ్యూనిస్టు సమాజ నిర్మాణానికై సాగిస్తున్న అత్యద్భుత నిర్మాణ పథకాల నిర్వహణకు తాము శ్రమించి పనిచేసినందువల్ల, వర్తమాన తరానికి మాత్రమే కాక, భావి తరాలవారికికూడా ఎంతో మేలు సమకూరుతుందన్న సంగతి మన యువతీ యువకులకు పూర్తిగా తెలుసు (దీర్ఘ హర్షధ్వానాలు).

సమిష్టి వ్యవసాయదారులు, మెషీన్, ట్రాక్టర్ కేంద్రాలలో పనిచేస్తున్న కార్యకర్తలు నిస్వార్థంగా శ్రమించినందువల్లా, కార్మికవర్గం యిచ్చిన క్రియాత్మక సహకారంవల్లా బీళ్ళను దున్ని, సాగులోకి తెచ్చే కార్యక్రమాన్ని జయప్రదంగా పూర్తిచేయగలిగామని మనం సగర్వంగా చెప్పుకోవచ్చు. 1954, 1955 సంవత్సరాలలో 3 కోట్ల హెక్టార్లబీళ్ళు, బంజరు భూములను సాగులోకి తెచ్చాం; దేశం మొత్తం మీద చూస్తే, 3 కోట్ల 30 లక్షల హెక్టార్లభూమిని కొత్తగా సాగులోకి తీసుకొచ్చాం. పార్టీకీ, మొత్తం సోవియట్ ప్రజలకూ ఇదొక ఘనవిజయం (మిన్నుముట్టే దీర్ఘ హర్ష ధ్వానాలు).

బీళ్ళనుదున్ని సాగులోకి తెచ్చినందువల్ల ఆహారధాన్యాలు పండించే భూవిస్తీర్ణాన్ని గణనీయంగా విస్తరింపచేయడం సాధ్యపడింది. 1950 లో ఆహార ధాన్యాల భూవిస్తీర్ణం 10 కోట్ల 29 లక్షల హెక్టార్లుకాగా, 1955 లో అది 12 కోట్ల 64 లక్షల హెక్టార్లకు పెరిగింది. అంటే 2 కోట్ల 40 లక్షల హెక్టార్లు ఎక్కువన్నమాట.

వర్షాభావం దాపురించే ప్రాంతాలలోని బీళ్ళను సాగులోకి తెచ్చి, అభివృద్ధి చేయటానికి మనం పూనుకోటం సరియైన పనేనా అని కొంతమంది కామ్రేడ్స్ ప్రశ్నించవచ్చు. కజఖ్‌స్తాన్, సైబీరియా, యూరల్స్ ప్రాంతాలలో అప్పుడప్పుడు వర్షాభావం దాపురిస్తున్నా, అక్కడ ఆహారధాన్యాలు పండించటం లాభదాయకమనీ, ఆర్థికదృష్ట్యా సమర్థనీయమనీ మనకు అందుబాటులో వున్న సంఖ్యావివరాలను పరిశీలిస్తే తేలుతోంది. ఒకవేళ అయిదుసంవత్సరాలలో రెండేళ్లు మంచిపంటలు పండి, ఒక సంవత్సరం ఒకమోస్తరుపంటపండి, మిగతా రెండుసంవత్సరాలు పంటలు చెడిపోయినప్పటికీ, ఆ ప్రాంతాలలో ఆహారధాన్యాలను వేయటం మనకు లాభకరంగానే వుంటుంది. ఎందుకంటే ఆ ప్రాంతాలలోవున్న పరిస్థితులలో ఆహార ధాన్యాల పంటలు పండించటానికి పెట్టవలసిన పెట్టుబడి స్వల్పంగా మాత్రమే వుంటుంది. అందువల్ల ఆ ప్రాంతాలను సాగుచేయటం లాభదాయకం; తక్కువ ఖర్చుతో పంటలను పండించవచ్చు.

బీడుభూములను సాగులోకితెచ్చి, అభివృద్ధిచేయటానికై మనం సాగించిన కృషి ఫలితాలను పరిశీలించినట్టయితే, కొత్తభూములను సాగులోకి తేవాలని పార్టీ

చేసిన నిర్ణయం సరియైనదేనని నిర్ధారణగా తేలిపోతుంది. ఈ కార్యవిధానాన్ని అనుసరించినందువల్ల స్వల్పకాలంలోనే, చాలా తక్కువ సాధన సంపత్తిని వెచ్చించి ఆహార ధాన్యాల వుత్పత్తిని గణనీయంగా యితోధికం చేయటం సాధ్యపడుతుంది.

ఇకముందు బీడుభూములను సాగులోకితెచ్చి, అభివృద్ధిచేసే విషయంలో సాగుకు లాయకైన మంచిభూములు విస్తారంగాగల క్రాస్నోయార్స్క్, ఇరుకుట్స్క్ ఖాబరోవ్స్క్, ప్రిమోర్స్ మున్నగు ప్రాంతాలపట్ల ప్రత్యేకమైన శ్రద్ధ చూపవలసి వుంటుంది. అలాచేస్తే దూరప్రాచ్య ప్రాంతాలకు అవసరమైన వ్యావసాయిక సరుకులను స్థానికంగానే పండించి సరఫరా చేయడం, పశుగణాన్ని అభివృద్ధిచేయడం వీలవుతుంది.

ఆహారధాన్యాల వుత్పత్తిని పెంపొందించేందుకు ఆహారపైరులు వేయటంలో కొన్ని మార్పులు తీసుకురావాలి; గోధుమ, తదితర కాయధాన్యాలు పండించే భూవిస్తీర్ణాన్ని పెంచటంతోపాటు, మొక్కజొన్నపైరువేసే ప్రాంతాన్నికూడా విస్తరింపచేయాలి. పశుగణం పెంచడానికి ఏటా 400 కోట్ల పూడ్ల దానా ధాన్యాలు అవసరమని అంచనాలవల్ల తేలులోంది. మొక్కజొన్న పంటను గణనీయంగా పెంచనిదే అలాంటి ధాన్యాలను అంత పెద్దఎత్తున సంపాదించటం సాధ్యంకాదు. అందువల్ల మొక్కజొన్న పంటను బాగా విస్తరింప చేయాలని కేంద్ర కమిటీ నిర్ణయించింది. 1955 లో 1 కోటి 80 లక్షల ఎకరాలలో మొక్కజొన్న వేయబడింది. అంటే 1954 లోకన్నా 1955 లో 1 కోటి 36 లక్షల హెక్టార్లలో అదనంగా మొక్కజొన్న వేయబడిందన్నమాట.

మొక్కజొన్న పండించే భూవిస్తీర్ణాన్ని పెంచటంవల్ల, పశుగణాభివృద్ధికి చొప్ప, పశుగ్రాసం ఎక్కువగా లభ్యమైంది. 1955 లో అంతకుపూర్వపు సంవత్సరంకన్నా అదనంగా 1 కోటి 70 లక్షల టన్నుల చొప్ప, 60 లక్షల టన్నుల మొక్కజొన్న బొండులను సమిష్టి వ్యవసాయక్షేత్రాలు తయారు చేయగలిగాయి.

దీని ఫలితంగా మొత్తం పాల వుత్పత్తి పెరిగింది. సోవియట్ కేంద్ర గణాంక శాస్త్రసంస్థవారి అంకెలప్రకారం గత సంవత్సరం ఆఖరు నాలుగు మాసాలలోను (1955 అక్టోబరు 1 నుంచి 1956 ఫిబ్రవరి 1 వరకు) మొత్తం సోవియట్ యూనియన్ అంతటా సమిష్టి వ్యవసాయ క్షేత్రాలలో పాల వుత్పత్తి 1954-55 సంవత్సరపు అదేదశతో పోల్చుకుంటే నూటికి 65 వంతులు పెరిగింది; యూక్రేనియన్ సోవియట్‌లో నూటికి నూరువంతులు, రష్యన్ సోషలిస్టు ఫెడరేటివ్ సోవియట్ రిపబ్లిక్‌లో నూటికి 53 వంతులు పెరిగింది. కాగా, రష్యన్ ఫెడరేషన్, యూక్రేన్, కజఖ్‌స్తాన్, ఉజ్బెక్, అజరబైజాన్, తజిక్, టర్క్‌మన్, మోల్డేవియన్ మున్నగు రిపబ్లిక్‌లలో పాల వుత్పత్తి రెండింతలు, మూడింతలు; కొన్నిచోట్ల అంతకన్నా ఎక్కువగానూ పెరిగింది. సోవియట్ పాలనలో ఏనాడూ కూడా పాల వుత్పత్తి యింత పెద్దయెత్తున పెరిగిన ఉదంతం లేదని చెప్పవచ్చు.

ఈ విషయంలో మొక్కజొన్న పైరు, కొత్తప్లానింగ్ పద్ధతి, సమిష్టివ్యవసాయ పనులకు కల్పించబడిన భౌతికప్రోత్సాహం మంచిఫలితా లిచ్చాయని నిస్సందేహంగా చెప్పవచ్చు.

అయితే, మొక్కజొన్నపైరు అంతబాగా పండని జిల్లాలుకూడా అనేకం లేకపోలేదు. ఆయా జిల్లాల నాయకులు మొక్కజొన్న విషయంలో చూపిన నిర్లక్ష్యమే అందుకు ఏకైక కారణమని చెప్పవలసి వుంటుంది. బైలోరస్యా, లాట్వియా, లిథువేనియా, ఎస్తోనియాలోని అనేక జిల్లాలలోను, కొస్త్రోమా, యారోస్లావ్క్, తులా, తదితరప్రాంతాలలోను పైన పేర్కొన్నవిధంగా జరిగింది. దక్షిణాదిన పండించే ఈ పంటను సోవియట్ యూనియన్ అంతటా పండించాలని సోవియట్ కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ సిఫారసు చేయటం బహుశా పొరపాటే నేమోనన్న ప్రశ్న ఉత్పన్నం కావచ్చు.

కామ్రేడ్స్, అదెంతమాత్రం పొరపాటుకాదు. ఏయే రిపబ్లిక్‌లలో, ప్రాంతాలలో, ప్రదేశాలలో, జిల్లాలలో, సమిష్టి వ్యవసాయ క్షేత్రాలలో ప్రభుత్వ క్షేత్రాలలో నాయకులు మొక్కజొన్న విషయంలో ప్రత్యేక శ్రద్ధ తీసుకున్నారో దాని విశిష్ట లక్షణాలను పరిశీలించి అందుకు తగినట్టుగా సమిష్టి, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలలో పనిచేసే కార్యకర్తలకు శిక్షణ గరిపారో, అక్కడల్లా సత్ఫలితాలు సమకూరాయి. అలాకాక, గాలిలో దీపం పెట్టి అంతా దేవుడిదయ అనుకుంటూ ఎక్కడెక్కడైతే కాలక్షేపం చేశారో, ఆయా సమిష్టి, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలలో తక్కువపంట పండింది.

మొక్కజొన్నను బాగా పండించిన సమిష్టి వ్యవసాయ క్షేత్రాలు ప్రతి ప్రాంతంలోనూ వున్నాయి. మొక్కజొన్న పైరును కొత్తగా, పెద్ద ఎత్తున వేసిన జిల్లాలకు సంబంధించిన ఉదాహరణలు కొన్నింటిని ఇక్కడ ప్రస్తావిస్తాను.

చువాగ్ స్వయంపాలిత రిపబ్లిక్‌లోని స్టాలిన్ సమిష్టి వ్యవసాయ క్షేత్రంలో గత సంవత్సరం 240 హెక్టార్లలో మొక్కజొన్నపైరు వేశారు. ఆ 240 హెక్టార్లలోను 70 హెక్టార్లను జాడుకోసం ప్రత్యేకించారు. మిగతా 170 హెక్టార్లలోను మొక్కజొన్న పండించారు; 8 వేల టన్నుల చొప్పను ఆ సమిష్టి వ్యవసాయ క్షేత్రం తయారుచేసింది.

మాస్కో ప్రాంతంలోగల పెట్రోస్కోయే ప్రభుత్వ వ్యవసాయక్షేత్రంలో సగటున హెక్టారుకు 29.5 టన్నుల మొక్కజొన్న కర్రను, కండెలను పండించారు. 15.5 హెక్టార్లలో సగటున హెక్టారు 1కి 40.2 టన్నులను, 5½ హెక్టార్లలో హెక్టారు 1కి 75 టన్నుల పంటను పండించారు.

బైలోరష్యన్ రిపబ్లిక్‌లోని రస్యవెత్ సమిష్టి వ్యవసాయక్షేత్రంలో 500 హెక్టార్లలో హెక్టార్ 1 కి సగటున 35 టన్నుల మొక్కజొన్న పండించారు.

మన దేశంలోని ప్రాంతా లన్నిటిలో మొక్కజొన్న బాగా పండుతుందని అనుభవం చాటిచెబుతోంది. పంట కావటంవిషయంలో నైతేనేమి, పుష్టినిచ్చే గుణంలో నైతేనేమి, దానిని పండించేందుకు వెచ్చించే శ్రమకు ప్రతిఫలం ముట్టటంలో నైతేనేమి దానికి సాటిరాగలది మరొకటిలేదు. అందువల్ల కొన్ని జిల్లాలలోను, సమిష్టి వ్యవసాయ క్షేత్రాలలోను మొక్కజొన్నను పండించటంలో చేసిన పొరపాట్లను కూలంకషంగా పరిశోధించటం అవసరం; కొన్ని సమిష్టి వ్యవసాయ క్షేత్రాలలోను, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలలోను ఎందువల్ల అవి బాగా పండలేవో కారణాలు కనుగొనవలసి వుంటుంది; వైరువిత్తనం వేసేందుకు ఇక అత్యంత ఉత్సాహంతో సంసిద్ధం కావాలి; ప్రతి సమిష్టి వ్యవసాయ క్షేత్రంలోను, ప్రతి ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రంలోను ఈ సంవత్సరం మొక్కజొన్నపంటను బాగా పండించాలన్న దృష్టితో కార్యకర్తలకు శిక్షణ గరపాలి.

ఆరో పంచవర్ష ప్రణాళిక పూర్తయ్యేసరికి మొత్తం ఆహారధాన్యాల వుత్పత్తి ఏటా 1100 కోట్ల పూడ్‌లకు పెంచడమే వ్యవసాయ రంగంలోని మన ప్రధాన కర్తవ్యం; ఫలసాయం పెంచటంద్వారాను, కొత్త కొత్త భూములను సాగులోకితెచ్చి, అభివృద్ధిచేయటంద్వారాను ఆ కర్తవ్యాన్ని సాధించాలి; వాణిజ్య పంటలు పండించే భూవిస్తీర్ణాన్ని పెంచి, ప్రత్తి, షుగర్‌బీట్, గోగునార, సూర్యకాంతపు పువ్వువిత్తనం మున్నగువాటి వుత్పత్తిని పెంచాలి. వచ్చే రెండు సంవత్సరాలలో బంగాళాదుంపలను, తదితరమైన మంచిరకపు కూరగాయలను దేశావసరాలు పరిపూర్ణంగా తీరేటట్లు మనం వుత్పత్తి చేయగలగాలి.

తోటలు, ద్రాక్ష, చెర్రీస్‌తోటల విస్తీర్ణాన్ని పెంచాలి. రక్షక వలయ వృక్షాలను ఎక్కువగా నాటాలి; ఈ కృషిలో మన యువకులు క్రియాత్మక పాత్ర తీసుకొనేటట్లు ప్రోత్సహించాలి. నీటి పారుదల వసతులను పెద్ద ఎత్తున పెంపొందించటంతోపాటు, నీరు పారించేభూములలో ఎక్కువ ఫలసాయం తీసేందుకు కృషి చేయాలి.

ఖనిజ ఎరువుల వుత్పత్తిని, కలుపు మొక్కలను, తెగుళ్ళను నిర్మూలించే రసాయనిక పదార్థాల వుత్పత్తిని యితోధికం చేయాల్సిన అవసరముందని పార్టీ కేంద్ర కమిటీ అభిప్రాయపడుతోంది. వ్యవసాయపద్ధతులను నిరంతరం మెరుగుపర్చేందుకు మనం పాటుబడాలి; వ్యవసాయక సాంకేతిక పద్ధతులను ఎప్పటికప్పుడు ఆధునికం చేస్తూ వుండాలి; సరియైన పంటమార్పిడి పద్ధతులను అమలుజరపాలి; వ్యవసాయ పనుల కాలాన్ని తగ్గించాలి. ఆవిధంగా అన్నిప్రాంతాలలోను ఆహారధాన్యాల, వాణిజ్యపంటల ఫలసాయాన్ని యితోధికం చేయాలి.

## 2. ఇతోధిక పశుగణాభివృద్ధికి నిర్వహించవలసిన కర్తవ్యాలు

కామ్రేడ్స్, పశుగణాన్ని ఇతోధికంగా వృద్ధిచేయడం, పశుగణానికి సంబంధించిన వస్తువుల ఉత్పత్తిని, సేకరణను ఎక్కువ చేయటం అన్నది ఈ మధ్యకాలంలో

పార్టీని ఎదుర్కొన్న క్లిష్టమైన తక్షణ కర్తవ్యమైంది. పశుగణాన్ని అభివృద్ధి చేసేందుకూ, పశుగణ ఉత్పాదక శక్తిని యితోధికం చేసేందుకు నిర్దేశించబడిన ఆర్థిక, నిర్మాణ సంబంధమైన అనేక పెద్ద చర్యలనూ సోవియట్ కమ్యూనిస్టుపార్టీ కేంద్ర కమిటీ, ప్రభుత్వమూ రూపొందించి, అమలు జరుపుతున్నాయి.

పశుగణాభివృద్ధిని సాధించేందుకై సమిష్టి వ్యవసాయదారులకు అధికతర భౌతిక ప్రోత్సాహాలను కలుగజేయటం అవసరమని సోవియట్ కమ్యూనిస్టుపార్టీ కేంద్ర కమిటీ, సోవియట్ ప్రభుత్వం భావించాయి. పశు పెంపకానికి, పశునివాస సావిళ్ళ నిర్మాణానికి సంబంధించిన కృషిలో యంత్రాలను ప్రవేశపెట్టే నిమిత్తం విపులమైన పథకాన్నొకదానిని రూపొందించి, అమలు జరుపుతున్నాం. పశు పెంపకానికి సంబంధించిన కీలక శాఖలలో కార్యకర్తల సంఖ్యను పెంచే విషయమై స్థానిక పార్టీ కమిటీలు గణనీయమైన కృషిచేశాయి.

వీటన్నిటి మూలాన సత్ఫలితాలు సమకూరాయి. మన పశుగణంయొక్క స్థితిగతులను తెల్పే కొన్ని అంకెలను ఇక్కడ ఉదాహరించుతాను:

## సోవియట్ యూనియన్‌లో పశుగణం పెరుగుదల

(1950 = 100)

| | 1950 | 1951 | 1952 | 1953 | 1954 | 1955 |
|---|---|---|---|---|---|---|
| ఆవులు | 100 | 102 | 100 | 107 | 113 | 120 |
| మొత్తం పశుగణం | 100 | 103 | 99 | 110 | 114 | 117 |
| పందులు | 100 | 111 | 117 | 195 | 210 | 214 |
| గొర్రెలు | 100 | 110 | 114 | 139 | 142 | 151 |

## పశుగణంవల్ల లభించే ముఖ్యమైన పదార్థాలు

(1950 = 100)

| | 1950 | 1951 | 1952 | 1953 | 1954 | 1955 |
|---|---|---|---|---|---|---|
| మాంసం | 100 | 96 | 106 | 120 | 119 | 130 |
| పాలు | 100 | 102 | 101 | 103 | 108 | 119 |
| ఉన్ని | 100 | 107 | 122 | 130 | 128 | 142 |
| గుడ్లు | 100 | 113 | 123 | 137 | 147 | 154 |

పశు పెంపకానికి అపారమైన అవకాశాలు మనదేశంలో వున్నాయి. సమిష్టి, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలలో కనుక పట్టుదలతో నిర్మాణాత్మక కృషి సాగిస్తే ఒకటి రెండు సంవత్సరాలలోనే అపూర్వమైన సత్ఫలితాలను సాధించగలం. ఉదాహరణకు పందుల పెంపకాన్నే తీసుకోండి. అయిదో పంచవర్ష ప్రణాళికా కాలంలోని మొదటి రెండు సంవత్సరాలలో పందుల సంఖ్య చెప్పుకోతగ్గంతగా పెరగలేదని

పై సంఖ్యా వివరాలు తెల్పుతున్నాయి. కాని పందుల పెంపకానికి నిర్దుష్ట మైన చర్యలు తీసుకొన్నందువల్ల గత మూడు సంవత్సరాలలో ఆ సంఖ్య విపరీతంగా పెరిగింది. గత నాలుగు మాసాలలోను (1955 అక్టోబరు 1 నుంచి 1956 ఫిబ్రవరి 1 వరకు) 1954-1955 సంవత్సరంలోని అవే నెలల్లోకన్నా సమిష్టి వ్యవసాయ క్షేత్రాలు నాటికి 62 వంతుల ఎక్కువ పందులను ప్రభుత్వానికి సరఫరా చేశాయి. సమిష్టి వ్యవసాయ క్షేత్రాల కృషివల్ల పందులు బాగా బలుస్తున్నాయి. 1955 ఫిబ్రవరి 1 వ తేదీనాటికన్నా 1956 ఫిబ్రవరి 1 వ తేదీనాటికి కొవ్వెక్కిన పందులసంఖ్య మూడురెట్లకుపైగా పెరిగింది. పశుగణ ఉత్పత్తిని పెంపొందించేందుకు రూపొందించిన కార్యక్రమాన్ని జయప్రదంగా అమలుజరపగలమని మనం ఘంటాపథంగా చెప్పవచ్చు.

పశుగణాభివృద్ధికై నిర్దేశించిన కార్యక్రమంలో పశుగ్రాసోత్పత్తిని యితోధికం చేయటం అన్నదానికి ప్రత్యేక ప్రాధాన్యం ఉంది. ఆహారధాన్యాల వుత్పత్తిని పెద్దఎత్తున పెంచటం, మొక్కజొన్నపంట పండించే విస్తీర్ణాన్ని - ఇదే ప్రధానమైన విషయం-విస్తరింపచేయటంతోపాటు జొన్నగడ్డి, నిమ్మగడ్డివంటి గడ్డిపైరులుకూడా వేయాలి. అలాంటి గడ్డిపైరులువేసే టప్పుడు ఆయా ప్రాంతాలలోని శీతోష్ణస్థితినీ, భూమిపరిస్థితినీ దృష్టిలో వుంచుకొని, ఏగడ్డివేస్తే పైరు బాగా అవుతుందో ఆ గడ్డి పైరునే వేయాల్సివుంటుందని వేరే చెప్ప నక్కరలేదు. సాంవత్సరిక గడ్డిపైరులను కూడా - వుదాహరణకు దక్షిణ ప్రాంతాలలో సూడాన్‌గడ్డి, సోర్‌ఘుమ్‌గడ్డిపైరులను; మధ్యప్రాంతాలలో వెచ్‌ఓట్స్ మిక్చర్‌గడ్డిపైరునువేయమనీ మనం ప్రోత్సహించాలి.

గడ్డి పైరులను వేయటంపట్ల కొంతమంది కామ్రేడ్స్‌లో ఒక పొరపాటు దృక్పథంవుంది. నిమ్మగడ్డి విషయంలో ఎన్నో సంవత్సరాలపాటు నైపుణ్యాన్ని సంపాదించుకొన్న ప్రాంతాలలో ఆ పైరు వేయనీయకుండా అరికట్టిన వుదంతాలున్నాయి. గడ్డి పైరు విషయంలో అలాంటి వైఖరి అవలంబించటం పార్టీ ఆదేశాలకు పూర్తిగా విరుద్ధమైనది. ఫిబ్రవరి, మార్చి నెలల్లో సోవియట్ కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ విస్తృత సమావేశంచేసిన నిర్ణయాలు మీకందరకూ సుపరిచితాలే జొన్నగడ్డివంటి గడ్డిపైరులను అసలు వేయరాదని ఆ సమావేశం నిర్దేశించలేదు: గడ్డిపైరుల విషయమై ముక్కుకు సూటిగా ఆలోచించే పద్ధతిమాత్రమే తీర్మానం ఖండిస్తోంది; మెట్టప్రాంతాలలోని లక్షలాది హెక్టార్లలో గడ్డిపైరులువేసి, తక్కువపైరును పెంచి నందుకు మాత్రమే దుయ్యబట్టాం. గడ్డిపైరు వేయటంలో ముక్కుకు సూటిగా ఆలోచించే పద్ధతి గట్టిగా ఖండించ వలసిందే. అదే సమయంలో బాగా గడ్డిపైరులు అయ్యే ప్రాంతాలలో వాటిని తప్పకుండా పెంచాలనీ, ఎండుగడ్డి ఉత్పత్తిని ఎక్కువ చేయాలనీ పార్టీ తప్పనిసరిగా స్పష్టంచేయాలి.

స్వక్షేత్రంలో పెంచిన గడ్డి, ఎండుగడ్డి, పచ్చగడ్డి వేసి పశువులను పెంచేందుకు ఉన్న అవకాశాలన్నింటినీ ఉపయోగించే మానేజరు చాలా మంచి పని చేస్తున్నట్టుగా

పరిగణించాలి; పశుగణ వుత్పత్తి యితోధికం కావటానికి అదెంతో అవసరం. అయితే తమ ప్రాంతంలో పశుగ్రాసాన్ని యితోధికంగా ఉత్పత్తి చేయటానికి ఏమాత్రం కృషి చేయకుండా ఇతరులపై ఆధారపడే ముఖ్య కార్యకర్తలు, ప్రభుత్వం తమకు యింకా ఎక్కువ పశుగ్రాసాన్ని పంపాలని కోరే ముఖ్య కార్యకర్తలు ఈ నాటికీ అనేక సమిష్టి, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలలో వున్నారు. అంతే కాదు; ఆహార పదార్థాల ధరలను ప్రభుత్వం తగ్గించటాన్ని ఆసరాగా తీసుకొని, రొట్టెలను, గ్రిట్స్‌ను, తదితర వస్తువులను షాపులలో ఖరీదుచేసి, వాటినే పశువులకు మేపిన మహానుభావుల సంఖ్యకూడ ఏమంత తక్కువకాదు. ఇది జూదం మాత్రమే కాని వుత్పత్తి కార్యక్రమం కాదు.

ఒక ఉదంతం చూడండి: మాస్కో ప్రాంతంలోని ఒక సమిష్టి వ్యవసాయ క్షేత్ర అధ్యక్షుడు 12 మంది వ్యవసాయదారులతో పశుగ్రాససేకరణ దళాన్నొక దానిని ఏర్పరచి, ఆ దళానికి డబ్బు, సంచులు, ఒకలారీ యిచ్చాడు. పశుగ్రాసాన్ని సేకరించటానికి ఆదళం ఉపక్రమించింది; అయితే వారు ఆపనికి ఉపక్రమించింది పొలాలలో కాదు సుమా. మాస్కో షాపులలో ఆ పని ప్రారంభించారు. బక్‌వీట్ గ్రిట్స్, జొన్నలు, పెరల్ బార్లీ, పిండి, ఈస్ట్, తదితర సరుకులను కోళ్ళకు, పశువులకు ఆహారంగావారు ఖరీదుచేశారు.

ఇదేదో ఎక్కడో ఒకచోట మాత్రమే జరిగిన ఉదంతం కాదు. అలాంటి "వ్యాపారస్తుల" చర్యలవల్ల ఎంతో నష్టం వాటిల్లుతోంది; మనదేశంలో పశుపెంపకానికిగల శక్తిస్తోమతులనువారు నీరుకార్చుతున్నారు. తాము ప్రత్యేకంగా కృషిచేయకుండానే, ఇతరుల శ్రమపై ఆధారపడి ప్రథమశ్రేణికి రావాలని వారు కోరుకొంటున్నారు. వీరిని చూస్తుంటే గొగోల్ సృష్టించిన పట్‌స్యూక్ పాత్ర గుర్తుకొస్తోంది; పట్‌స్యూక్ నోరుతెరచి కూర్చుంటే లడ్డూలు వాటంతటవే ఎగిరివచ్చి అతనినోట్లో పడేవట. 'క్రిస్టమస్ ఈవ్' అన్న తన రచనలో గొగోల్ దానిని ఇలా చిత్రించాడు: "...పట్‌స్యూక్ నోరు తెరిచాడు; ఎదటగావున్న లడ్డూల వంకచూశాడు; నోటిని యింకా బాగా తెరచాడు. అక్షణంలో లడ్డూ పళ్ళెంలోనుంచి ఎగిరి వెన్నపూసలో పడి, సరాసరి అతని నోట్లోవచ్చిపడింది. పట్‌స్యూక్ దానిని తిన్నాడు; మళ్ళీ నోరు తెరచాడు; అదేవిధంగా ఇంకొకలడ్డూ ఎగిరివచ్చి అతని నోట్లోపడింది. పట్‌స్యూక్ పడిన కష్టమల్లా దానిని నమలి, మింగటం మాత్రమే" (సభలోనవ్వు).

అయితే పట్‌స్యూక్‌కు ఇలాంటిది క్రిస్టమస్ పండగరోజున మాత్రమే సంభవించింది. కాని ఈనాటి పట్‌స్యూక్ లున్నారు చూశారూ ప్రతిరోజూ లడ్డూలు ఎగిరివచ్చి తమ నోళ్ళలో పడాలని కోరుకుంటున్నారు; పైగా అలాంటివారిని ఇతరులు గౌరవిస్తున్నారుకూడా.

నగర శివార్లలోని సమిష్టి వ్యవసాయ క్షేత్రాలలో నిర్లక్ష్యపరులైన సభ్యులు, పనిపాటలు లేకుండా కాలక్షేపం చేస్తూ నగరాల శివార్లలో నివసించే వ్యక్తులు కొందరు ఇలాంటి "వ్యాపారాన్ని" పెద్దఎత్తున సాగిస్తున్నారు. రొట్టెలు, తదితర

వస్తువులను షాపులలో వారు ఖరీదుచేసి, పశువులకు మేపుతున్నారు; ఆ తర్వాత పశుగణ ఉత్పత్తి సరుకులను మార్కెట్లలోకి తీసుకొచ్చి, షాపుల ధరలకన్నా ఎక్కువ ధరలకు అమ్ముతున్నారు. దొంగలాభార్జనపరులకు వ్యతిరేకంగా యిప్పటి కన్నా తీవ్రతరమైన పోరాటాన్ని సాగించాలి. కొన్ని కొన్నిచోట్ల ప్రజావసరాలకు పూర్తిగా తగినన్ని సరుకులు అప్పుడప్పుడు లభ్యం కాకపోవడాన్ని ఆసరాగా తీసుకొని వారు లాభార్జనకు పూనుకుంటున్నారు; నిజాయితీపరులను, ప్రభుత్వాన్ని వారు దోచుకుంటున్నారు.

కామ్రేడ్స్, పశుగణాభివృద్ధి విషయంలో ప్రతి 100 హెక్టార్ల వ్యవసాయ క్షేత్రంలోని పశుగణ ఉత్పత్తిని సకల విధాల పెంపొందించటమే మన ప్రధాన కర్తవ్యం. అన్నిటికంటే ముఖ్యంగా సామాజిక యాజమాన్యంలోగల పశుగణ పెంపకాన్ని పెంపొందించటం అవసరం; అలా చేసిననాడు సమిష్టి వ్యవసాయ క్షేత్రాల ఆదాయం గణనీయంగా పెరుగుతుంది; సమిష్టి వ్యవసాయదారుల జీవనస్థితిగతులు యింకా బాగుపడతాయి; పాలు, మాంసం, తదితర సరుకులను యింకా ఎక్కువగా ప్రజలకు సరఫరాచేయ వీలవుతుంది. మేలురకం పశుగణాన్ని పెంపొందించేందుకు, పశుగణంలో ఆవుల నిష్పత్తిని పెంచేందుకు, పాడిపరిశ్రమలో ఉత్పత్తిని యితోధికం చేసేందుకు ప్రత్యేక శ్రద్ధచూపాలి; మాంసోత్పత్తిని త్వరితంగా పెంచేందుకు అత్యంత ముఖ్యసాధనాలలో ఒకటైన పందులను బాగా బలపటుంపట్ల ప్రత్యేకశ్రద్ధ చూపాలి. వొరొనెజ్ ప్రాంతంలోని వ్యవసాయదారులు చక్కని ప్రయత్నం ఒకటి చేస్తున్నారు. ఆరో పంచవర్ష ప్రణాళికా ముసాయిదాలో పేర్కొన్నట్టు, మాంసం, పాల ఉత్పత్తిని పెంచే కర్తవ్యాన్ని అనుకొన్నదానికంటే ముందుగానే పూర్తి చేస్తామని వారు శపథం పూనారు. అయిదు సంవత్సరాలలో కాక, ఒక్క సంవత్సరంలోనే మాంసోత్పత్తిని రెండింతలు చేస్తామనీ, 18 మాసాలలో పాలఉత్పత్తిని రెట్టింపుచేస్తామనీ ప్రతినబూనారు. వొరొనెజ్ వ్యవసాయదారులు దేశభక్తియుతమైన చొరవతో చూపిన ఆదర్శప్రాయమైన బాటను మిగతా ప్రాంతాలకు, ప్రదేశాలకు రిపబ్లిక్‌లకు చెందినవారుకూడా అనుగమిస్తూ, ఆరవ పంచవర్ష ప్రణాళికలో నిర్దేశించిన ప్రధానమైన పశుగణ ఉత్పత్తి లక్ష్యాలను రెండు లేక మూడు సంవత్సరాల కాలంలోనే పూర్తిచేయగలరని నిస్సందేహంగా చెప్పవచ్చు. (దీర్ఘహర్షధ్వానాలు)

ఉన్ని, మేలురకం ఉన్ని, మధ్యరకం ఉన్ని, మాంసం, గొర్రెతోళ్ళు సమకూర్చే మేలురకపు గొర్రెలను పెంచటం మన కర్తవ్య నిర్వహణకు ఎంతో అవసరం. ఆ విధంగా అత్యంత మేలుకరమైన ఉన్ని వస్త్రాలను, కరకూల్ తోళ్ళను, చక్కని గొర్రెతోళ్ళ కోటులను, ఫీల్డ్‌బూటులను తయారు చేయటానికి తోడ్పడాలి.

సమిష్టి, ప్రభుత్వ వ్యవసాయక్షేత్రాలు సాధ్యమైనంత ఎక్కువగా కోళ్ళను, బాతులను పెంచాలి; కొలనులలోను, చెరువులలోను చేపలను పెంచాలి; తేనెపట్టుల విషయంలో తగినంత శ్రద్ధచూపాలి.

పశుగణాభివృద్ధిలోగల అవరోధాలన్నింటిని అధిగమించినట్లు పరిస్థితిని చిత్రించటం పొరపాటుమాత్రమే కాక ఎంతో హానికరంకూడా కాగలదు. ప్రజల అవసరాలకు తగినంతగా పశుగణాభివృద్ధిని సాధించాలంటే సమిష్టి వ్యవసాయదారులు, మెషీన్ ట్రాక్టర్ కేంద్రాలలోను, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలలోను పనిచేసే కార్యకర్తలు, కష్టించి పనిచేయవలసి వుంటున్నదన్న విషయం కామ్రేడ్స్ గుర్తుంచుకోవాలి.

## 3. వ్యవసాయంలో యంత్ర సహాయం

కామ్రేడ్స్, మన సోషలిస్టు పరిశ్రమలు లక్షలాది ఆధునిక యంత్రాలను వ్యవసాయ రంగానికి సరఫరా చేస్తున్నాయి. ఈ విధంగా కొత్త యంత్ర పరికరాలను ప్రవేశపెట్టుతున్నందువల్ల వ్యవసాయపు పనిపాటలు యిలోధికంగా యంత్ర సహాయంతో జరుగుతున్నాయి. పొలాలలో అత్యంత ప్రధానమైన పనులు యంత్రాల ద్వారానే జరుగుతున్నాయి. సోవియట్ ప్రజలకు ఇదొక ఘనవిజయం.

వేరువేరు వ్యవసాయపు పనులను యంత్రాలతో నిర్వహించే దశనుండి మొత్తం వ్యవసాయోత్పత్తినంతా, పశుగణ పెంపకంతోసహా యంత్రాలతో నిర్వహించే సర్వసమన్వితపద్ధతిని సాధ్యమైనంతతక్కువకాలంలో పూర్తిచేయుటమే తక్షణ కర్తవ్యం. ఇలాంటి స్థితులలో మెషిన్ ట్రాక్టర్ కేంద్రాల ప్రాముఖ్యం మరింత హెచ్చుతోంది. గత రెండు సంవత్సరాలలో మెషిన్, ట్రాక్టర్ కేంద్రాల కృషిని మెరుగుపర్చేందుకు అనేకమైన ముఖ్యచర్యలు గైకొనబడినవి. ట్రాక్టర్ డ్రైవర్లుగాను, కంబైన్ ఆపరేటర్లుగాను, లారీడ్రైవర్లుగాను, ఇతర వ్యవసాయ యంత్రాల ఆపరేటర్లుగాను, నిపుణులుగాను యించుమించు 20 లక్షలమంది మెషిన్, ట్రాక్టర్ కేంద్రాలలో శాశ్వతోద్యోగులుగా చేరారు. పరిశ్రమల నుంచి 29 వేలమంది ఇంజనీర్లు, సాంకేతిక నిపుణులు మెషిన్, ట్రాక్టర్ కేంద్రాలకు పంపబడ్డారు. దీనంతటి ఫలితంగా ఆ కేంద్రాలస్థితి బాగుపడింది. అయితే నేటి అవసరాలకు తగినట్టుగా వాటి స్థితిగతులు బాగుపడినట్టు మాత్రం చెప్పటానికి వీలులేదు.

సోషలిస్టు ఉత్పత్తిశాఖ లన్నింటినీ అణా పైసలతోసహా లెక్కలువేసి, నిర్వహించటం అత్యంత ప్రధానమైన విషయమని మన అనుభవం చాటిచెబుతోంది. కాని అన్ని విధాలయిన పరీక్షలకు తట్టుకొని రాటుతేలిన ఈ నిర్వహణ పద్ధతినిమాత్రం మెషిన్, ట్రాక్టర్ కేంద్రాలలో అమలుజరపడం లేదు. స్టేట్ బడ్జెట్ద్వారా మెషిన్, ట్రాక్టర్ కేంద్రాలకు ధనం మంజూరుచేసే పద్ధతి ప్రస్తుతం అమల్లో ఉండటంవల్ల బాధ్యతారాహిత్యం, అజమాయిషీ లేకుండాపోవటం సంభవిస్తోంది. మెషిన్, ట్రాక్టర్ కేంద్రాలలో పనిచేసే కార్యకర్తలలో చాలామంది తమ తమ కేంద్రాల నిర్వహణకు ఎంతెంత సొమ్ము ఖర్చు అవుతున్నదో జాగ్రత్తగా పరిశీలించటమే లేదు; యంత్రాలను కడు సమర్థవంతంగా వినియోగించాలన్న దృష్టి తగినంతగా వారికి లేకుండాపోతోంది. మెషిన్, ట్రాక్టర్ కేంద్రాల పనిపాటల

తీరు ఎలావున్నా, దానితో నిమిత్తంలేకుండా డబ్బు మంజూరు చేస్తున్నారు. మెషిన్, ట్రాక్టర్ కేంద్రాలలో పని చేస్తున్నవారి కిచ్చే వేతనాలు, వారు చేసే పనినిబట్టీ, వారు ప్రదర్శించే నేర్పరితనాన్నిబట్టీ, తీసే ఫలసాయాన్నిబట్టీ, సమిష్టి వ్యవసాయ క్షేత్రంలోని పశుగణ ఉత్పత్తినిబట్టీ యివ్వడంలేదు.

మెషిన్, ట్రాక్టర్ కేంద్రాలలో జరిగే పనిపాటల్నింటినీ క్రమంగా అణా పైసల లెక్కలలోకి మార్చటం మేలు. దేశమంతటా గల మెషిన్, ట్రాక్టర్ కేంద్రాలన్నిటికీ ఒకే రకమైన సూచికలతో సారూప్యమైన పద్ధతిని ప్రవేశపెట్టటం సహజంగా సాధ్యంకాదు. అణా పైసల లెక్క ప్రాతిపదికపై వివిధ ప్రాంతాలలోని, జిల్లాలలోని విశిష్ట లక్షణాలను పరిగణనలోకి తీసుకొని ఒక యుక్తియుక్తమైన పద్ధతిని రూపొందించుకోవటం అవసరం. ఈ చర్య తీసుకోటం మెషిన్, ట్రాక్టర్ కేంద్రాలలో పనిచేసే కార్యకర్తల కృషికి ప్రోత్సాహకరంగా వుంటుంది; వ్యవసాయాభివృద్ధికొరకు వారు మరింత బాధ్యతతో పనిచేయటానికి ఆ చర్య సహాయ పడుతుంది.

మెషిన్, ట్రాక్టర్ కేంద్రాల కృషిని మెరుగు పర్చటంతో పాటే, మన వ్యవసాయ మంత్రిత్వశాఖకు, ట్రాక్టర్, వ్యవసాయ యంత్రపరిశ్రమలశాఖకు చెందిన సాంకేతిక కార్యవిధానంలో ప్రధానమైన మార్పులు తీసుకురావటం కూడా అవసరం. సువిశాలమైన మనదేశంలోని ప్రాంతాలన్నింటా ఒకే రకమైన ట్రాక్టర్లను, కంబైన్లను, దుక్కి పనిముట్లను ఉపయోగించాలన్న భావం పైన పేర్కొన్న మంత్రిత్వ శాఖలలోపనిచేస్తున్న ప్రధానోద్యోగ్యులలో ఉంది. పెద్దపెద్ద స్టెప్పీలున్న కుబాన్ ప్రాంతఉపయోగంకోసం తయారుచేసే భారీకాటర్‌పిల్లర్ ట్రాక్టర్లను, ట్రాక్టర్ డ్రాన్, సెల్ఫ్‌ప్రొపెల్డ్ కంబైన్లనే పశ్చిమోత్తర లేక బాల్టిక్ రిపబ్లిక్‌లలోని చిన్నచిన్న మళ్ళలో ఉపయోగించేందుకు కూడాతయారుచేస్తున్నారు. అలాచేయటం పొరపాటు. దేశంలోని ప్రధాన ప్రాంతాలయొక్క విశిష్ట లక్షణాలను పరిగణనలోకి తీసుకొని, రకరకాలైన వాటిని తయారుచేసేందుకు పూనుకోవలసిన సమయం ఆసన్నమైంది.

యుద్ధానికి పూర్వమూ, యుద్ధానంతర తొలి సంవత్సరాలలోను పశ్చిమోత్తర, తదితర ప్రాంతాలలో చక్రాల ట్రాక్టర్లు ఎంతోచక్కగా ఉపయోగపడ్డాయి. ఈ మధ్య చక్రాల ట్రాక్టర్ల ఉత్పత్తి పెద్ద ఎత్తున పడిపోయింది. అయితే కేటర్‌పిల్లర్ ట్రాక్టర్ల అవసరంకన్నా చక్రాల ట్రాక్టర్ల అవసరం ఏమాత్రం తక్కువగాలేదు; పైగా రబ్బరుటైర్ ట్రాక్టర్లను నడపటం బహు సులభంకూడా. వాటి ఉత్పత్తీ, ముఖ్యంగా వాటిని నడపటమూ, వాటి బాగుచేతలూ చాలా తేలికగాను, ఎంతో చవకగాను ఉంటాయి.

ఆరో పంచవర్ష ప్రణాళికా కాలంలో వ్యవసాయరంగంలో ట్రాక్టర్ మౌంటెడ్ నాగళ్ళను, తదితర వ్యవసాయ పరికరాలను పూర్తిగా ప్రవేశపెట్టాలి. పోతే, ట్రాక్టర్లచేత ఈడ్వబడే వ్యవసాయ పనిముట్లులకు (ఉదాహరణకు పెద్దపెద్ద నాగళ్ళకు) సంబంధించినంతవరకు లాగుడు యంత్రపరికరాలను నిర్వహించేవారి అవ

సరం లేకుండానే ట్రాక్టర్ డ్రైవరే ఆ పరికరాలను నిర్వహించటానికి వీలుగా ప్రత్యేకమైన అనుబంధ పనిముట్లను (స్పెషల్ అటాచ్‌మెంట్స్) ఫ్యాక్టరీలు ఉత్పత్తి చేయాలి. ఆ విధంగా మౌంటెడ్ యంత్రపరికరాలను ప్రవేశపెట్టినందువల్ల లాగుడు యంత్రపరికరాలను నడిపే వేలాది నిర్వాహకులును ఇతర పనులకు వినియోగించ వీలవుతుంది; యంత్రపరికరాల కోసం ప్రస్తుతం ఉపయోగిస్తున్న లోహాల పరిమాణంలో నూటికి 40 నుంచి 50 వంతులకు తగ్గించ వీలుచిక్కుతుంది; ఇంధన వ్యయాన్ని తగ్గించ సాధ్యపడుతుంది; శ్రామికోత్పాదనను పెంచనూవచ్చు.

ప్రధానంగా ఆహారధాన్యాలు పండిస్తున్న ప్రాంతాలలో రానున్న సంవత్సరాలలో ఈ పద్ధతిని ప్రవేశపెట్టేందుకు వీలుగా రెండు దశలలో కోత, నూర్పిళ్ళను పూర్తిచేసేటటువంటి యంత్రాల ఉత్పత్తిని గణనీయంగా పెంచటం ఎంతో ముఖ్యం.

సమిష్టి వ్యవసాయక్షేత్రాలను, మెషిన్, ట్రాక్టర్ కేంద్రాలను, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలను విద్యుదీకరించే విషయంపై ప్రత్యేకమైన శ్రద్ధను చూపాలి; యంత్రసహాయంతో వ్యవసాయాన్నంతా చేయాలంటే విద్యుచ్ఛక్తి ఉపయోగం అత్యంత ప్రధానమైన అంశంగా వుంటుంది. ఇంతవరకూ మనమీ సమస్యను సక్రమంగా, దేశం మొత్తంమీద తగినవిధంగా పరిష్కరించలేలేదు. పైగా, సమిష్టి, ప్రభుత్వ వ్యవసాయక్షేత్రాలలో విద్యుచ్ఛక్తిని వినియోగించే విషయమై పొరపాటు వైఖరిని అవలంబించాం. విద్యుచ్ఛక్తి వినియోగం అధికంగా ఎంతో లాభకరమైనప్పటికీ, ఎలాంటి సాంకేతికమైన ఇబ్బందులు లేకపోయినప్పటికీ, సమిష్టి, ప్రభుత్వ వ్యవసాయక్షేత్రాలను విద్యుత్‌శక్తి మండలాలతో (పవర్ గ్రైడ్స్) జతపర్చటానికి వీలున్నచోట్లకూడా అనుమతించలేదు. సమిష్టి, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలలో విద్యుచ్ఛక్తిని ఉపయోగించే పద్ధతి దేశవ్యాపితంగా విద్యుచ్ఛక్తిని వుపయోగించే మహాపథకంలో ఒక భాగంగా పరిగణించాలి.

దేశమంతటా ఒక అల్లికలాగా విద్యుత్కేంద్రాలను నెలకొల్పాలని లెనిన్ అన్నప్పుడు, ఆయనదృష్టిలో కేవలం పెద్దపెద్ద ప్రభుత్వ విద్యుచ్ఛక్తి మండలాలేకాక, బహు ముఖ్యమైన గొలుసువలె గ్రామీణ విద్యుత్కేంద్రాలుకూడా నిర్మింపబడాలన్న విషయం మనం గమనించాలి. ఈ కర్తవ్యాన్ని నిర్వహించటం ఎలా? సమిష్టి, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాల్లో ప్రస్తుతం తమ సొంత బాధ్యతపై చిన్నచిన్న విద్యుత్కేంద్రాలను నిర్మించుకొంటున్నాయి. అయితే అలా నిర్మించుటవల్ల, విద్యుచ్ఛక్తి ద్వారా ఉత్పత్తిచేయుటంలో మనలను ఎదుర్కొనే సాంకేతిక సమస్యలను ఎల్లప్పుడూ సరిగా పరిష్కరించలేం. అనేక సమిష్టి వ్యవసాయక్షేత్రాలు కలిసి ఒక విద్యుత్కేంద్రం చొప్పునో, లేదా జిల్లాకొక విద్యుత్కేంద్రం చొప్పునో నెలకొల్పే పద్ధతిని మనం ప్రవేశపెట్టాలి. వివిధ ప్రాంతాల విశిష్ట లక్షణాలను పరిగణనలోకి తీసుకొని రూపొందించే ప్రామాణిక విద్యుత్కేంద్రాలనిర్మాణానికి పథకాలు తయారుచేయించాలి. ప్రకృతిసిద్ధమైన బొగ్గు, వాయువు లభించే ప్రాంతాలవద్ద నెలకొల్పే విద్యుత్కేంద్రాలను, బొగ్గు, వాయువును ఉపయోగించి నడపటానికి వీలుగా వాటిని

నిర్మించాలి; కొన్నింటిని పీట్‌తో నడపటానికి వీలుగాను, మరి కొన్నింటిని బొగ్గు లేక లిగ్నైట్‌ను ఉపయోగించి నడపటానికి వీలుగాను స్థాపించాలి. జల విద్యుత్ వనరు లున్నచోట్ల జలవిద్యుత్ కేంద్రాలను నెలకొల్పాలని వేరే చెప్ప నవసరంలేదు.

ఈ సందర్భంలో ఒక ప్రశ్న ఉత్పన్నం కావచ్చు; ఈ కేంద్రాలను ఎవరు నిర్మించాలి? వాటి కయ్యే ఖర్చును ఎలా భరించాలి? సహకార ప్రాతిపదికపైన సమిష్టి వ్యవసాయ క్షేత్రాల నిధులతో ఈ కేంద్రాలను ఆయా రిపబ్లిక్‌లకు చెందిన సంస్థలు నిర్మించటమే సరిగా వుంటుంది. కొన్ని సమిష్టి వ్యవసాయక్షేత్రాలు కలిసి నిర్మించే కేంద్రాలకు, జిల్లా ప్రాతిపదికపై నిర్మించే కేంద్రాలకు, కొన్ని జిల్లాలు కలిసి నిర్మించే కేంద్రాలకు ఇంధనం, తదితర సరకులను సరఫరా చేసేందుకు వీలుగా ప్రభుత్వ ప్రణాళికలలో అవకాశ మేర్పరచాలి.

వ్యవసాయంలో విద్యుచ్ఛక్తిని ఉపయోగించే కార్యక్రమం ఫలానా నాటికి పూర్తికావాలని యిప్పుడే మనం నిర్ధారణ చేయజాలం. ఈ విషయాన్ని ప్రభుత్వ ప్రణాళికాసంఘం, అందుకు సంబంధించిన వివిధ మంత్రిత్వ శాఖలు కూలంకషంగా పరిశీలించాలి; వివిధ రిపబ్లిక్‌లనుంచీ, రీజియన్‌లనుంచీ నిర్దిష్టమైన ప్రతిపాదనలను తెప్పించాలి; ఆ ప్రతిపాదనలను ఆధారంగా చేసుకొని, సమిష్టి ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలలోను, మెషిన్, ట్రాక్టరు కేంద్రాలలోను విద్యుచ్ఛక్తిని ఉపయోగించేం దుకు సమగ్రమైన ప్రణాళిక నొకదానిని తయారుచేసి, ప్రభుత్వానికి సమర్పించాలి.

## 4. ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాల అభివృద్ధి

నిరంతరమైన వ్యవసాయ విస్తరణ కృషిలో మనలను ఎదుర్కొంటున్న తక్షణ సమస్యలను పరిష్కరించే నిమిత్తం సోషలిస్టు వ్యవసాయ నిర్మాణ రూపాలలో కల్లా అత్యున్నతమైన ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలను అభివృద్ధిచేసే విషయమై మనం ప్రత్యేక శ్రద్ధను చూపవలసివుంటుంది. పాత ప్రభుత్వవ్యవసాయ క్షేత్రాలను బలవత్తరం చేసేందుకు, కొత్తవాటిని స్థాపించేందుకు పార్టీ కేంద్ర కమిటీ అనేక ప్రధాన మైన చర్యలను గైకొన్నది. గత రెండేళ్ళలోను కొత్తగా 581 పెద్దపెద్ద ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలు స్థాపించబడ్డాయి; వాటిల్లో 425 క్షేత్రాలు ఇంతవరకు బీళ్ళుగా వుంటూ వచ్చిన ప్రాంతాలలో నెలకొల్ప బడ్డాయి; సోవియట్ యూని యన్ ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాల మంత్రిత్వశాఖకు చెందిన ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలక్రింద 1,05,00,000 హెక్టార్ల అదనపుభూమి సాగులోకి తేబడింది. ఆ విధంగా ప్రభుత్వవ్యవసాయక్షేత్రాలక్రింద సాగుచేయబడుతున్న భూవిస్తీర్ణం గత సంవత్సరంలో 2 కోట్ల 45 లక్షల హెక్టార్లకు పెరిగింది; ఆహారధాన్యాలు పండించే భూవిస్తీర్ణం 2. 4 రెట్లు పెరిగింది. దీని ఫలితంగా ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాల నుంచి 1950 సంవత్సరంలోకన్నా ఈ నాడు ప్రభుత్వానికి ఆహార ధాన్యాలు ఎక్కు వగా ముట్టుతున్నాయి. పశుగణ ఉత్పత్తి సరకులను, బంగాళాదుంపలు తదితర కూర

గాయలను ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలు యింతకు ముందుకన్నా గణనీయమైనంత ఎక్కువగా సరఫరా చేస్తున్నాయి.

ప్రభుత్వ వ్యవసాయక్షేత్రాలలో ధాన్యోత్పత్తిని యితోధికం చేయటంతో పాటు పత్తి, షుగర్‌బీట్, తదితరపంటల వుత్పత్తినికూడా పెంచాలి. ప్రభుత్వ పశుగణ కేంద్రాలను, ముఖ్యంగా గొర్రెల పెంపక కేంద్రాలను సాగుకు లాయకి కాకపోయినప్పటికి, పశుగణాభివృద్ధికి తోడ్పడే బంజరుభూములలో నెలకొల్పాలి. 100 హెక్టార్లకు యింత వుత్పత్తి అన్న ప్రాతిపదికపైననూ, ఆయా ప్రదేశాలలోని విశిష్ట లక్షణాలను పరిగణనలోకి తీసుకోడంద్వారాను ప్రభుత్వ ప్రణాళికను రూపొందించే పద్ధతిలో మార్పులు తీసుకురావటం అవసరం. అలా చేసినందువల్ల వుత్పత్తి వ్యయం తగ్గించ వీలవుతుంది; ప్రతి ప్రభుత్వ వ్యవసాయక్షేత్రపు ఆదాయాన్ని ఆచరణయుక్తమైన ప్రాతిపదికపై సాధ్యమైనంత ఎక్కువగా పెంచటానికి వీలు చిక్కుతుంది.

## 5. విత్తనాల ఉత్పత్తి - వ్యవసాయాభివృద్ధికి ప్రధానాంశం

విత్తనాల ఉత్పత్తిని సక్రమంగా నిర్వహించటం అన్నది వ్యవసాయాభివృద్ధికి ప్రధానాంశంగా ఉంటుంది. మన దేశంలో విత్తనాల ఉత్పత్తిని అలక్ష్యం చేస్తున్నాం; నిజానికి సుసంఘటితమైన పెద్ద పెద్ద వ్యవసాయక్షేత్రాలలో ఈ కర్తవ్యాన్ని నిర్వహించటం ఏమంత కష్టమైన పనికాదు. విత్తనాల ఉత్పత్తియొక్క ప్రాధాన్యాన్ని వ్యవసాయదారులు తక్కువగా అంచనా వేస్తున్నారు. అందువల్లనే వారు దానిని సక్రమంగా నిర్వహించటం లేదు.

విత్తనాల ఉత్పత్తిని సక్రమంగా క్రమపద్ధతిలో సాగించకపోతే పంటలను తగినంతగా పెంచటం సాధ్యం కాదన్న విషయం మనం యిప్పటికైనా గుర్తించటం అవసరం. ఈ సమస్యను విధిగా పరిష్కరించితీరాలి. అత్యుత్తమమైన ప్రభుత్వ క్షేత్రాలలో ప్రధానంగా విత్తనాల ఉత్పత్తిని మాత్రమే సాగించడంద్వారాను, విత్తనాలను ఉత్పత్తిచేసే జిల్లాక్షేత్రాల స్థితిగతులను బాగుపర్చటం ద్వారాను ఈ సమస్యను సత్వరంగా పరిష్కరించ వీలవుతుంది. ప్రతి ప్రభుత్వక్షేత్రానికీ, ప్రతి జిల్లా విత్తనాల ఉత్పత్తిక్షేత్రానికీ ఒక ప్రదేశాన్ని కేటాయించి, ఆ ప్రదేశంలో విత్తనాల ఉత్పత్తికి అవి బాధ్యత వహించేటట్లు చేయాలి; ఆ చుట్టుప్రక్కలగల సమిష్టి క్షేత్రాలకు విత్తనాలను సరఫరా చేసేబాధ్యత వాటికి అప్పగించాలి.

సంకీర్ణ మొక్కజొన్న (హైబ్రిడ్ మెయిజ్) విత్తనాలను ఉత్పత్తిచేసే విషయంలో ప్రత్యేకశ్రద్ధను చూపాలి. ఈ విషయంలో మనదేశ వ్యవసాయం ఇతర దేశాలకన్నా వెనకబడివుంది. సంకీర్ణీకరణ (హైబ్రిడైజేషన్) ప్రాధాన్యాన్ని మన వ్యవసాయదారులు గమనించకపోవడంవల్ల మనము అలా వెనకబడివున్నామని చెప్పేందుకు వీలులేదు. మన శాస్త్రవేత్తలు, అగ్రశ్రేణికి చెందిన వ్యవసాయ క్షేత్రాల నిర్వాహకులు చాలా కాలంనుంచి సంకీర్ణ విత్తనాలను ఉత్పత్తిచేస్తు

న్నారు. అయితే వ్యవసాయ సంస్థలు ఈ కృషిని సరియైన పద్ధతిలో పెట్టలేదు. దాని ఫలితంగా మనం అమెరికానుంచి సంకీర్ణ మొక్కజొన్న విత్తనాలను దిగుమతి చేసుకోవలసి వస్తుంది. యుద్ధకాలంనుంచి అమెరికన్లు దాదాపు సంకీర్ణ మొక్కజొన్న విత్తనాలనే వాడుతూ వచ్చారు; అలా వాడుతున్న ఫలితంగా మొక్కజొన్నపంట హెక్టారు ఒకటింటికి 1.5 నుంచి 2.5 లేదా 2.7 టన్నుల ధాన్యం వరకు పెరిగింది. అమెరికాలో ప్రత్యేకమైన విత్తనాల ఉత్పత్తి కంపెనీలున్నాయి. కొన్ని నిర్దిష్టమైన ప్రాంతాలకోసమని ఆ కంపెనీలు సంకీర్ణ విత్తనాలను పండించుతాయి. మొక్కజొన్న పైరువేసి పెంచి, పంటను నూర్చి ఎండబెట్టి, గింజలను సైజువారీగా కేటాయించి, బస్తాలకెక్కించి రైతులకు ఆ సంస్థలు అమ్ముతాయి.

పైరును యేపుగా పెరిగేటట్లు చూడటం, పెద్దఎత్తున సంకీర్ణ మొక్కజొన్న విత్తనాలను ఉత్పత్తి చేయటం, విత్తనాలను బాగుచేసి, ప్యాక్ చేసే ఫ్యాక్టరీలను నెలకొల్పటం, ఈ కృషికి పరికరాలను, కార్యకర్తలను కేటాయించటం - ఒక్కమాటలో చెప్పాలంటే సంకీర్ణ మొక్కజొన్న విత్తనాలను ఉత్పత్తిచేసే సమస్యను పరిష్కరించటమే మనం యిప్పుడు నిర్వహించవలసిన కర్తవ్యమై యున్నది.

## 6. సమిష్టి వ్యవసాయక్షేత్రాల గృహ నిర్మాణం

కామ్రేడ్స్, గ్రామీణప్రాంతాలలో గృహ నిర్మాణానికి సంబంధించిన సమస్యలను పార్టీ, ప్రభుత్వ సంస్థలదృష్టికి తేవటం తక్షణావసరంగావుంది. తరతరాలుగా పట్టుకు పీడించిన దారిద్ర్యాన్ని సాంస్కృతిక దళిరస్థితి మూలాన దాపురించిన దుస్థితి చిహ్నాలు, గత యుద్ధంవల్ల వుప్పతిల్లిన నిర్మూలన అనంతర అవశేషాలు ఈనాటికీ మన గ్రామాలలో కొట్టొచ్చినట్లు కన్పిస్తున్నాయి. సమిష్టి వ్యవసాయదారులకు గృహవసతికల్పించే విషయంలోనైతేనేమి, వారి జీవనస్థితిగతులను బాగుపర్చే విషయాలలోనైతేనేమి మనం సాధించవలసింది యింకెంతో వుంది; వారిలో అనేకమంది ఈనాటికీ వసతులులేని గృహాలలోనే నివసిస్తున్నారు. అలాగే గతావశేషమైన అనేక గ్రామీణజిల్లాలలో రోడ్లు లేకపోవటాన్ని మనం చూస్తూ సహించలేము. వుత్పత్తి అవసరాలకు ఎల్లప్పుడూ అగ్రతాంబూలం యివ్వవలసి వుటుందన్న విషయం ప్రత్యేకంగా పేర్కొనాల్సిన పనిలేదు. అదే సమయంలో సామాజిక యాజమాన్యంలోగల ఆర్థికవ్యవస్థను చెందిన సమిష్టి వ్యవసాయక్షేత్రాల వుత్పత్తి విస్తరించినందువల్లా, బాగుపడినందువల్లా కొత్త గృహాల నిర్మాణానికీ, సాంస్కృతిక భవనాల నిర్మాణానికీ అనుకూలపరిస్థితులు ఏర్పడతాయి. ఆర్థికంగా బాగా అభివృద్ధి చెందిన, పెద్ద ఎత్తున ఆదాయం సంపాదిస్తున్న సమిష్టి వ్యవసాయక్షేత్రాలు ఈనాడు వేలకొలదీ మనదేశంలో వున్నాయి. అలాంటి క్షేత్రాలన్ని గృహనిర్మాణ కార్యక్రమాన్ని అన్నిటికంటే ముఖ్యంగా సామాజిక యాజమాన్యానికి చెందిన సమిష్టి క్షేత్రాల భవనాలను, కిండర్ గార్డెన్‌లను, మాతాశిశు కేంద్రాలను, వినోదకేంద్రాలను, స్నానశాలలను, ముసలి రైతులకోసం యిళ్ళను, ఫలహారశాలలను మాత్రమే

కాక, సమిష్టి క్షేత్రానికి చెందిన సభ్యులకు గృహ నిర్మాణంలోను, తమ జీవనస్థితిగతులను బాగుపర్చటంలోను తోడ్పడగలస్థితిలో వున్నాయి.

సమిష్టి వ్యవసాయదారులు తమ సొంతధనంతో యిళ్ళను నిర్మించుకోవాలి. సకల వసతులుగల, సుందరమైన భవనాలను నిర్మించుకోటానికి తగినంత ఆదాయం వస్తున్న సమిష్టివ్యవసాయదారుల కుటుంబాలు ఈనాడు సోవియట్‌లో లక్షలసంఖ్యలో వున్నాయి. అయితే ప్రతి సమిష్టి వ్యవసాయదారు తన యింటిని నిర్మించుకొనే బాధ్యతను, ముఖ్యంగా గృహనిర్మాణ సామగ్రిని ఖరీదుచేసుకొనే బాధ్యతను నెత్తి నేసుకోగల స్థితిలోవున్నాడని మనం భావించరాదు. అందుచేత గృహనిర్మాణానిక అవసరమైనవాటిని ఎక్కడికక్కడే తయారు చేయటంలో సమిష్టి వ్యవసాయ క్షేత్రాలకు సహాయపడటం అవసరమవుతోంది.

అలాగే జిల్లాసంస్థలలో పనిచేసే ఉద్యోగులు కూడా అత్యున్నత సాంకేతిక స్థాయిలో గృహనిర్మాణానికి అవసరమైన వస్తువులను ఉత్పత్తి చేసేందుకు పూనిక వహించి పనిచేయాలి. అలాచేస్తే గృహనిర్మాణానికి అవసరమైన మేలురకపు వస్తువులు చవుకగా లభ్యంకాగలవు. పైగా అన్నింటికంటే ముఖ్యమైన విషయమేమిటంటే అవి పుష్కలంగా కూడా లభించగలవు. మనకు అందుబాటులోవున్న అవకాశాలన్నింటినీ ఉపయోగించుకోవాలి; ప్రామాణికమైన పథకాలప్రకారం ప్రి ఫాబ్రికేటెడ్ యిళ్లను (పోతయిళ్ళు) నిర్మించాలి.

ఈ సందర్భంలో ఒకప్రశ్న ఉత్పన్నం కావచ్చు. యిళ్ల నిర్మాణానిక అవసరమైన డబ్బును ఎలా చెల్లించటం? దీనికి వివిధ పద్ధతులను అనుసరించవచ్చు. ఒకటి: ఇంటిని నిర్మించుకోవాలనో కొనుక్కోవాలనో కోరేవారు తమ రోజువారీ వేతనాలవల్ల వచ్చేడబ్బులో కొంతభాగం అందుకు ప్రత్యేకించుతూ వుండవచ్చు. ఇలా ప్రత్యేకించిన డబ్బును ప్రత్యేకనిధిగా కేటాయించవచ్చు. ఆ నిధిని బ్యాంకులో నిల్వచేయాలి; భవననిర్మాణానికి తప్ప మరొకందుకు దాన్ని వినియోగించరాదనే నియమం విధించాలి. ఇదొకపద్ధతి. మరొక పద్ధతికూడా అవలంబించవచ్చు. సమిష్టి వ్యవసాయ క్షేత్రానికి అవసరమైన భవనాలు, సాంస్కృతిక కేంద్రాలను, ఆస్పత్రులు మొదలైనవాటి నిర్మాణం పూర్తిచేయటంద్వారా సమాజికావసరాలను తీర్చగలిగిన సమిష్టి వ్యవసాయక్షేత్రాలు తమ ఆదాయంలో కొంతమొత్తాన్ని యిళ్ళ నిర్మాణానికి ప్రత్యేకించవచ్చు, సమిష్టి వ్యవసాయదారులందరి ఆమోదంతో సర్వసభ్య సమావేశామోదంతో మాత్రమే ఈపని చేయవలసి వుంటుందని వేరే చెప్పవలసిన పనిలేదు. సమిష్టి వ్యవసాయక్షేత్రపు సభ్యులకోసం యిళ్ళను నిర్మించటానికి ఆ మొత్తం వినియోగించబడుతుంది. ఇంటినిర్మాణానికి అయిన మొత్తం ఖర్చును సుమారుఅయిదు లేక పది సంవత్సరాలలో ఆయా పరిస్థితులనుబట్టి సమిష్టి వ్యవసాయదారులు తిరిగి చెల్లించాలి. ఒకప్రక్క గృహనిర్మాణానికై సమిష్టి వ్యవసాయక్షేత్రం తన సభ్యులకు అప్పులిస్తూంటుంది; రెండోప్రక్క సమిష్టి వ్యవసాయదారు తన సొంత ఆదాయంనుంచి కొంతమొత్తాన్ని ఆ అప్పుకు జతచేస్తూంటాడు. ఈ గృహాలు

నిర్మాణంలో నైతేనేమి, సైజులో నైతేనేమి, రూపురేఖలలో నైతేనేమి వైవిధ్యంగా వుండవచ్చునని, వుండాలనీ మనం గ్రహించాలి.

ఇక నిర్మాణాన్ని నిర్వహించట మెలాగు? గృహ నిర్మాణంలో నిపుణులైన వారితో కూడిన దళాలను సమిష్టి వ్యవసాయ క్షేత్రంలో నెలకొల్పాలనీ, సమిష్టి వ్యవసాయక్షేత్రపు గృహనిర్మాణదళాల ఉత్పాదక శక్తి యితోధిక మవటానికి వీలుగా అవసరమైన పరికరాలను, పనిముట్లను ఆ దళాలకు సరఫరా చేయాలనీ మనం సిఫారసు చేయవలసివుంటుంది. సాధ్యమైన ప్రతిచోటా జిల్లా సమిష్టిక్షేత్రపు గృహనిర్మాణసంస్థను నెలకొల్పాలి; గృహనిర్మాణంలోని వివిధవృత్తుల నిర్వాహకులను కొందరిని సమిష్టిక్షేత్రాలు ఆ సంస్థలకు ప్రత్యేకిస్తాయి. అలా చేసినందువల్ల గృహనిర్మాణంలో పెద్దఎత్తున యంత్రాలను ఉపయోగించడం సాధ్యపడుతుంది; ఇళ్ళను, భవనాలను మరింతవేగంగా తక్కువ ఖర్చుతో నిర్మించవీలవుతుంది. సమిష్టి క్షేత్రాల నిధులతోనే సహజంగా అలాంటి భవననిర్మాణసంస్థలు నిర్వహించబడతాయి. అవి సమిష్టి క్షేత్రాల సహకార సంస్థలు; సమిష్టి వ్యవసాయదారులే వాటికి యజమానులు. ప్రభుత్వం తరఫున జిల్లా సోవియట్ కార్యనిర్వాహక వర్గాలు ఆ సంస్థలను నడపటంలో మాత్రమే సహాయపడుతుంటాయి.

ఇటుకల, పెంకుల ఉత్పత్తిని గురించి ఇక్కడ కొద్దిగా ప్రస్తావిస్తాను. ఈ సమస్యను సమిష్టి వ్యవసాయదారులు తమంతటతామే పరిష్కరించుకోవలసివుంటుంది. సాధ్యమైనచోట్ల ఈ సమస్యను సమిష్టి వ్యవసాయదారులు తమంతతామే పరిష్కరించుకోగలిగినచోట్ల సమిష్టి వ్యవసాయ క్షేత్రాలలోనే యిటుకల, పెంకుల ఉత్పత్తిని ప్రారంభించాలి. కొన్నిచోట్ల సమిష్టి వ్యవసాయ క్షేత్రానికి ఒకటి చొప్పున, కొన్ని సమిష్టి వ్యవసాయక్షేత్రాలకు కలిపి ఒకటి చొప్పున యిటుకల లేక పెంకుల పరిశ్రమను నెలకొల్పటం మంచిది.

గృహనిర్మాణ కార్యక్రమాన్ని కొనసాగించే విషయంలోను, గ్రామాభివృద్ధిని సక్రమంగా ప్లానుచేసే విషయంలోను, యిళ్ళు, తదితర భవనాలకు ప్రామాణిక నమూనాలను తయారుచేయించే విషయంలోను సమిష్టి వ్యవసాయక్షేత్రాలకు వ్యవసాయ మంత్రిత్వశాఖ, యూనియన్, స్వయంపాలిత రిపబ్లిక్ల మంత్రివర్గాలు, ప్రదేశ, జిల్లా సోవియట్ల కార్యవర్గాలు సహాయంచేయాలి. అడుసుల, మేకులు, బందులు మున్నగువాటిని, చిలుకులకు, కీలీలకు వుత్పత్తి చేయటంలో ముఖ్యంగా వాటికి తోడ్పడాల్సిన అవసరం వుంది. సమిష్టి వ్యవసాయదారులకు గృహాలను నిర్మించటం తక్షణావసరం; ఎందుకంటే కోట్లాది సమిష్టి వ్యవసాయదారుల జీవన, సాంస్కృతికాభివృద్ధికీ, దానికీమధ్య అవినాభావ సంబంధం ఉంది.

## 7. వ్యవసాయరంగంలో ఉత్తమ నాయకత్వం అవసరం

కామ్రేడ్స్, వ్యవసాయాన్ని ఒక్క పెట్టున వృద్ధిచేసేందుకు కావలసిన భౌతిక, నిర్మాణ పరిస్థితులు యిప్పుడు మనకు వున్నాయి. ఇక సరియైన నాయకత్వం

పైనా, పార్టీయొక్క, ప్రభుత్వంయొక్క వ్యవసాయ సంస్థలయొక్క సామర్థ్యంపైనా పార్టీ నిర్ణయాలు జయప్రదంగా అమలుజరప గల్గటమా, లేదా అన్న విషయం ఆధారపడి వుంటుంది.

సోవియట్ యూనియన్‌లో ఒకే రకమైన వాతావరణస్థితీ, భూస్థితీవున్న ప్రతిమండలంలోను బాగా అభివృద్ధిచెందిన సమగ్ర వ్యవసాయక్షేత్రాలు, ఒక మోస్తరుగా అభివృద్ధి చెందిన క్షేత్రాలు, వెనకబడియున్న క్షేత్రాలుకూడా ఉన్నాయి. అంటే దీని అర్థం ఏమిటి? వ్యవసాయోత్పత్తిని నిర్వహించవలసిన వ్యవసాయ క్షేత్రాల నాయకత్వంపైన, అన్నిటికంటె ముఖ్యంగా సమిష్టి వ్యవసాయ క్షేత్రాల అధ్యక్షులు, దళనాయకులు, భూగర్భ శాస్త్రజ్ఞులు, జీవశాస్త్ర నిపుణులు, మెషిన్, ట్రాక్టర్ కేంద్రాల నిర్వాహకులు, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాల నిర్వాహకులు మున్నగు వారి నియామకంపైననే అంతా ఆధారపడి వుంటుంది. అందుచేత సోషలిస్టు వ్యవసాయం నిరంతరాభివృద్ధి చెందాలంటే కార్యకర్తల నియామకం, నాయకత్వాన్ని మెరుగుపర్చటం నిర్ణయాత్మక ప్రాధాన్యం కలిగి యుంటాయి.

మన వ్యవసాయం నిరాఘాటంగా అభివృద్ధి చెందాలంటే కేంద్రంలోను, స్థానికంగానువున్న వ్యవసాయ సంస్థలకృషిని పెద్దఎత్తున బాగు పర్చటం ఎంతో అవసరం. ఉత్పత్తి కార్యక్రమంలో మన ప్రభుత్వ యంత్రాంగం పూర్తిగా తల దూర్చి, ఉత్పత్తిని యితోధికం చేసేందుకు వీలుగా తన కృషిని కేంద్రీకరించాలి. వ్యవసాయ మంత్రిత్వశాఖ, ప్రభుత్వ క్షేత్రాల మంత్రిత్వశాఖ, వ్యవసాయక సరుకుల నిల్వలను చూసే మంత్రిత్వశాఖ వీటి నిర్మాణ స్వరూపం, అనుదిన కార్య కలాపాలు పైనపేర్కొన్న అవసరాలకు తగినట్టుగా వున్నాయా? లేదనే చెప్పావల్సి వుంటుంది. వాటి నిర్మాణ స్వరూపం యిప్పటికీ తలబరువుగాను, నిరంకుశంగాను వుంది. స్థానికసంస్థలకు స్వస్తిచెప్పే కేంద్రయంత్రాంగం మనకు అవసరం లేదు.

ప్రస్తుత పరిస్థితులలో వ్యవసాయ మంత్రిత్వశాఖ నిర్వర్తించవలసిన విధులు ఏమిటి? దీర్ఘకాల ప్రణాళిక, అర్థికం, సరఫరా, ప్రభుత్వ కర్తవ్యాలను నిర్వహించే విషయంలో తనిఖీ - ఇవే వీటి కర్తవ్యాలు. అత్యుత్తమమైన అనుభవాన్ని పరిశీలించి, ప్రజలలో దానిని విరివిగా ప్రచారం చేయటం. అధునాతనమైన శాస్త్రీయ విజయాలను ఉత్పత్తిక్రమంలో ప్రవేశపెట్టటం - ఇదే వ్యవసాయ మంత్రిత్వశాఖ, ప్రభుత్వక్షేత్రాల మంత్రిత్వశాఖ నిర్వహించవలసిన ప్రధాన కర్తవ్యాలు. ఈవిధులను మంత్రిత్వశాఖలు నిర్వహించాలంటే, అత్యున్నత నైపుణ్యంగల యంత్రాంగం సమకూర్చుకోటం వాటి కెంతో అవసరం. అందుచేత ఈ యంత్రాంగ పరిమాణాన్ని సాధ్యమైనంతవరకు తగ్గించి, మారిన పరిస్థితులకు అనుగుణంగా దానిని పునర్నిర్మించాలి.

కొనుగోలు యంత్రాంగానికి సంబంధించినంతవరకు ఈ నాడు పరిస్థితి ఏమిటి? వివిధ రకాలైన వస్తువులను ఖరీదుచేసేందుకు ప్రస్తుతం ప్రతి సమిష్టి వ్యవ సాయక్షేత్రంలోను అనేకమంది ప్రతినిధులు వున్నారు. నిజంగా వారంతా అవ

పరమేనా? కాదనే చెప్పాలి. మన సోషలిస్టురాజ్యంలో ప్రతివిషయం ప్రణాళికా బద్ధంగా వుంటుంది; ప్రభుత్వ, సమిష్టి వ్యవసాయక్షేత్రాలు ప్రభుత్వప్రణాళికలను, కొనుగోలు ప్రతినిధులు గుర్తుచేయాల్సిన అవసరం లేకుండానే సకాలంలో పూర్తి చేస్తూవుంటాయి. అందుచేత వ్యవసాయ సరుకుల నిల్వల మంచి చెడులనుచూసే మంత్రిత్వశాఖ గ్రెయిన్ ఎలివేటర్లను తయారు చేయటం, పిండిమరలను, కాయ ధాన్యాల మరలను అభివృద్ధిచేయటం, ధాన్యాలను, తదితర సరుకులను స్వీకరించి, నిల్వచేయటం- వీటికి మాత్రమే తన విధులను పరిమితం చేసుకోవాలి. కొనుగోలుకు సంబంధించిన నిత్యకార్యక్రమం మంచిచెడులుచూసే బాధ్యతను మెషిన్, ట్రాక్టర్ కేంద్రాలకు అప్పజెప్పాలి; ఆ విధంగా ప్రస్తుతం లక్షలాదిగాగల కొనుగోలుదారులను వుత్పత్తి కార్యక్రమంలో ఉపయోగించాలి.

మన వ్యవసాయంలోని శాఖలన్నింటికీ అత్యున్నతమైన సాంకేతిక నిపుణుల్ని సమకూర్చగలిగిన శక్తి ఈనాడు మన సోషలిస్టు రాజ్యానికుంది. కాలేజీ విద్యను లేక ఉన్నతవిద్యను పొందిన 4 లక్షల మంది నిపుణులు గత సంవత్సరం వ్యవసాయరంగంలో పనిచేశారు. అద్యతన భావిలో పొలంలో పనిచేసే దళాలకు, ట్రాక్టరు దళాలకు, భూశాస్త్రజ్ఞులు, మెకానిక్‌లు నాయకత్వం వహించవలసి వుంటుందన్న విషయమూ, పశుగణ శాఖకు జీవశాస్త్ర నిపుణులు నాయకత్వం వహించవలసి వుంటుందన్న విషయమూ దృష్టిలో వుంచుకొని మరీ మనం కార్యకర్తలకు శిక్షణ గరిపే ప్రణాళికను రూపొందించుకోవాలి.

వ్యవసాయక రంగంలోని స్థితిగతులను బాగుపర్చాలంటే, ఆర్థిక సమస్యలపైన, ఉత్పత్తిలో శ్రమవ్యయాన్ని తగ్గించాలన్న సమస్యపైన మన కార్యకర్తలు తమ దృష్టిని లగ్నంచేసేటట్లు చూడాలి. లెక్కకట్టటం నేర్చుకోండి - సోవియట్ రాజ్యం అవతరించిన రోజులలో కార్యనిర్వాహకులకు లెనిన్ యిచ్చిన సలహా యిదే. మన రాజ్యం అవతరించిన తొలిరోజులలో ఆ సలహా ఎంతో ముఖ్యమైనదైతే, ఈ రోజున అంతకన్నా వందరెట్లు ఎక్కువ ప్రాముఖ్యం దానికి ఉన్నది. తల 1 కి ఉత్పత్తి విషయంలో ప్రధాన పెట్టుబడిదారీదేశాల స్థాయిని మనం అందుకొని అధిగమించాలనుకొంటున్న ఈ దశలో ఆ సలహాకు ఎంతో ప్రాముఖ్యం ఉంది.

ఒకటన్ను పాలను ఉత్పత్తి చేయటానికి అమెరికాలోకన్నా మన దేశంలో గణనీయమైన హెచ్చుశ్రమను వినియోగిస్తున్నామన్న సంగతి సంఖ్యా వివరాలనుబట్టి తేలుతోంది. దాని ఫలితంగా అమెరికాలోకన్నా సోవియట్ యూనియన్‌లో జనాభాలో ఎక్కువ భాగం వ్యవసాయ రంగంలో పనిచేస్తున్నారు. ఈవిషయంలో మనం అమెరికాను గుడ్డిగా అనుసరించరాదన్న మాట నిజమేననుకోండి. అమెరికాలో ఒక వ్యక్తిని దివాళాతీయించి మరొక వ్యక్తి లాభం పొందుతాడు. 1940 నుంచి 1954 వరకు, అంటే 14 సంవత్సరాల కాలంలో అమెరికాలో గాదాపు 13 లక్షల వ్యవసాయదారులు చితికిపోయారు; భూములు పోగొట్టుకున్నారు; వారంతా తమ కుటుంబాలతోపాటు ఉదరపోషణార్థం పట్టణాల కెగబ్రాకారు; పరిశ్రమలలో పని

పాటులు చేసుకొని బ్రతుకు తెరువు చూసుకునేందుకు పట్టణాలకుచేరిన వారిని 'వలసవచ్చిన రైతులు' అనిపిలుస్తున్నారు. అలాంటివారంతా నిలవ నీడకోసం, భుక్తికోసం ఒక రాష్ట్రంనుంచి మరొక రాష్ట్రానికి కాళ్ళు బలపాలు కట్టేటట్లు తిరుగుతున్నారు. గత నాలుగు సంవత్సరాలలోను అమెరికాలో వ్యావసాయిక సంఖ్యావివరాలనుబట్టి 6 లక్షల వ్యవసాయక్షేత్రాలు తగ్గిపోయినట్లు తేలుతోంది. పెట్టుబడిదారీ పద్ధతిపై వ్యవసాయం సాగించే పెద్దరైతు కార్మికుల శ్రమశక్తి తన లాభాలకు మూలాధారంగా పరిగణిస్తుంటాడు. కార్మికుడు కనుక తన ఆరోగ్యం కోల్పోతే, అతనిని పనినుంచి తొలగిస్తారు; ఎందుకంటే ఆరోగ్యం కోల్పోయిన కార్మికుడు యజమానికి గరిష్ఠలాభం సంపాదించిపెట్ట లేడు.

కాని మన దేశంలో స్థితిగతులు ఇందుకు పూర్తిగా భిన్నంగా వున్నాయి. సమిష్టి వ్యవసాయక్షేత్రం ఒక సహకార సంస్థ. సమిష్టి వ్యవసాయదారులందరూ దాని యజమానులు; వారంతా ఆ సంస్థలో సంపూర్ణ సభ్యులు; వారు పనిపాటలను తమలో తాము విభజించుకొంటారు. దీనిని మనం పూర్తిగా అర్థంచేసుకోవచ్చు. మన సోషలిస్టు సమాజ లక్ష్యం ప్రవర్థమాన మవుతున్న మానవుని అవసరాలను సంతృప్తి పర్చటం వినా మరొకటికాదు. ఏ కారణం చేతనైనా తమతోటివారిలో ఒకరు పూర్తిగా పనిచేయలేని స్థితిలో వుంటే ఆ వ్యక్తిని సమిష్టి వ్యవసాయదారులు ఆవలకు నెట్టివేయరు. అందువల్ల అమెరికాలోకన్నా మన దేశంలో ఉత్పత్తికి సంబంధించిన ప్రతి ఒక యూనిట్ కు వెచ్చించే శ్రమ తక్కువగా వుండే స్థితికి మనం చేరుకొన్నప్పటికీ అమెరికాలో కన్న సోవియట్ యూనియన్ జనాభాలో హెచ్చు సంఖ్య వ్యవసాయరంగంలో పనిచేస్తూండక తప్పదు. ఏది ఏమైనప్పటికీ, ఉత్పత్తికి అత్యంత దోహదకరంగా వుండే విధంగా మన మింకా శ్రమను వినియోగించటంలేదు. అందుకని మన కృషిని విమర్శనాత్మక దృష్టితో సమీక్షించుకోవాలి; విదేశాలకు చెందిన అనుభవం ఎంతవరకు వుపయోగకరంగా వుంటుందో అంతవరకు దానిని మనం ఉపయోగించుకోవాలి.

వ్యవసాయరంగంలో పార్టీ సూచనల ప్రకారం చర్యలు గైకొనేపక్షంలో, ప్రవర్థమాన మవుతున్న దేశావసారాలకు తగినట్లు వ్యవసాయోత్పత్తిని యితోధికంగా బహుకొద్దికాలంలోనే సాధించగల్గుతాం.

కమ్యూనిస్టుపార్టీ నాయకత్వాన ముందుకు సాగిపోతున్న సోవియట్ ప్రజలు ఈ గురుతర కర్తవ్యాన్ని గౌరవప్రదంగా నిర్వహించగలరని మనం విశ్వసించవచ్చు.

## సోవియట్ ప్రజల జీవన సాంస్కృతిక ప్రమాణాలలో అభివృద్ధి

కామ్రేడ్స్, పారిశ్రామిక రంగంలోను, వ్యవసాయరంగంలోను సాధించిన అభివృద్ధి ప్రాతిపదికపై సోవియట్ ప్రజల జీవనప్రమాణం క్రమానుగతంగా వృద్ధి చెందింది. అయిదో పంచవర్ష ప్రణాళికా కాలంలో సోవియట్ యూనియన్ జాతీయాదాయం యిందులో సాల్గింట మూడువంతులు ప్రజల జీవన స్థితిగతులను

బాగుపర్చేందుకే వినియోగపడుతున్నదన్న విషయం మీ కందరకూ తెలుసు - నూటికి 68 వంతులు పెరిగింది. ఫ్యాక్టరీలలోను, ఆఫీసులలోను పనిచేసే కార్మికుల, తదితర కార్మికుల వాస్తవ వేతనాలు నూటికి 87 వంతులు పెరిగాయి; సమిష్టి వ్యవసాయదారుల వాస్తవ ఆదాయం నూటికి 50 వంతులు పెరిగింది. సామాజిక భీమాసౌకర్యాలకోసం, ఫ్యాక్టరీ, ఆఫీసు, తదితర కార్మికులకు జీతంపై సెలవులు మంజూరు చేసేందుకూ, విశ్రాంతి, ఆరోగ్య కేంద్రాలలో సౌకర్యాలు కల్పించటం కోసమూ, పింఛనులు, వైద్యసౌకర్యాలు, విద్యా సౌకర్యాలు మున్నగు వాటిని కల్పించే నిమిత్తము ప్రభుత్వం 68,900 కోట్ల రూబుళ్ళను ఖర్చుచేసింది.

సోషలిస్టు ఆర్థిక వ్యవస్థ వృద్ధిచెందుతూండటంతోపాటే ప్రజల కొనుగోలు శక్తికూడా పెరిగింది. 1950 లో కన్నా 1955 లో ప్రభుత్వ, సహకార వ్యాపార సంస్థల సరుకులు నూటికి 90 వంతులు ఎక్కువగా అమ్ముడయాయి.

ప్రభుత్వ, సహకార వ్యాపార సంస్థలద్వారా ప్రజలు ఆయా సరుకులను ఏ విధంగా కొనుక్కున్నారో ఈ క్రింది పట్టిక తెల్పుతుంది :

(1950 = 100)

| | 1950 | 1951 | 1952 | 1953 | 1954 | 1955 |
|---|---|---|---|---|---|---|
| మాంసం, మాంసపు సరుకులు | 100 | 120 | 124 | 171 | 206 | 220 |
| చేపలు, చేపవస్తువులు | 100 | 112 | 128 | 137 | 162 | 185 |
| వెన్న | 100 | 107 | 110 | 150 | 160 | 158 |
| వనస్పతి నూనెలు | 100 | 135 | 170 | 182 | 222 | 222 |
| దుస్తులు | 100 | 107 | 115 | 151 | 182 | 198 |
| పాదరక్షలు | 100 | 108 | 118 | 150 | 168 | 168 |
| ఫర్నిచరు | 100 | 142 | 154 | 201 | 272 | 307 |

పంచదార, సిల్కు, నూలువస్త్రాలు, గడియారాలు, చేతిగడియారాలు, కుట్టు మిషన్లు, తదితర వస్తువుల అమ్మకంకూడా గణనీయంగా పెరిగింది.

రేడియో, టెలివిజన్, వాద్య పనిముట్లు, సైకిళ్ళవంటి వస్తువుల అమ్మకం పెద్ద ఎత్తున పెరిగింది. అలాగే సాంస్కృతికావసరాలను, గృహావసరాలను తీర్చే వస్తువుల అమ్మకంకూడా పెరిగింది. సోవియట్ ప్రజలు మరింత పుష్టికరమైన ఆహారాన్ని పొందుతున్నారు. మరింత మంచి రకం దుస్తులు వేసుకొంటున్నారు. తమ సాంస్కృతికావసరాలను మరింత ఎక్కువగా తీర్చుకుంటున్నారు.

అయిదో పంచవర్ష ప్రణాళికా కాలంలో సోవియట్ యూనియన్ జనాభా 1 కోటి 63 లక్షల మంది పెరిగినప్పటికీ, ప్రజల జీవన స్థితిగతులు బాగుపడటం గమనార్హమైన విషయం.

## 1. నానాట వృద్ధిచెందుతున్న ప్రజల జీవితావసరాలను యితోధికంగా తీర్చాలి

ఇవన్నీ గణనీయమైన విజయాలే. అయితే గతంతో పోల్చుకుని మనం సంతృప్తి చెందితే సరిపోదు; క్రమానుగతంగా వృద్ధిచెందుతూన్న ప్రజల జీవిత, సాంస్కృతికావసరాలను ప్రధానంగా దృష్టిలో వుంచుకొని, వాటిని తీర్చటంకోసం కార్యక్రమం రూపొందించుకోవాలి. ఈ విషయాన్ని దృష్టిలో వుంచుకొన్నప్పుడు, వాడకం వస్తువులు ఈ నాటికీ తగినంతగా ఉత్పత్తి కావటంలేదని, ఇళ్ళకొరత వుందనీ, ప్రజల జీవన ప్రమాణాలకు సంబంధించిన అనేక ప్రధాన సమస్యలు యింకా పరిష్కరించబడనే లేదని చెప్పాల్సి వుంటుంది.

అక్టోబరు విప్లవానికి పూర్వం మన దేశం ఆర్థికంగా ఎంతో దళిత స్థితిలో వుందన్న విషయమూ, మన పరిశ్రమలు ఎంతో వెనకబడి వున్న సంగతీ, మన వ్యవసాయం ఆదిమకాలపు పద్ధతిలోనే వుందన్న సంగతీ మనం గుర్తులో వుంచుకోవాలి. సోవియట్ రాజ్యం అవతరించిన పిదప యీ 38 సంవత్సరాల కాలంలోను రెండు భీషణ యుద్ధాలకు గురికావలసివచ్చింది; మన జాతీయార్థిక వ్యవస్థ చెప్పనలవికాని నష్టాలకు లోనుకావలసివచ్చింది. లక్షల కొలదీ జనం చచ్చిపోయారు.

అందుచేత, మన ప్రజల జీవన ప్రమాణం గణనీయంగా పెరిగినప్పటికీ, సోషలిస్టు వ్యవస్థవల్ల సిద్ధిస్తున్న అపారావకాశాలకు అనుగుణంగాను, నిరంతరాభివృద్ధి చెందుతున్న సోవియట్ ప్రజల అవసరాలకు అనుగుణంగాను ప్రజల జీవనప్రమాణాన్ని యింకా పెంపొందించేందుకు కమ్యూనిస్టుపార్టీ, సోవియట్ ప్రభుత్వం యింకా చేయవలసింది చాలా వుంది.

ప్రజల జీవన ప్రమాణాన్ని మరింతగా పెంపొందించే నిమిత్తం గత కొలది సంవత్సరాలలోను కేంద్రకమిటీ అనేక చర్యలు గైకొన్నది. అయినప్పటికీ ప్రధానమైన అనేక ఆహారపదార్థాల ఉత్పత్తి, పారిశ్రామిక వస్తువుల వుత్పత్తీ పెరుగుతున్న అవసరాలకు తగినట్టుగా లేదు. కొన్ని పట్టణాలకు, కొన్ని వర్గాలకు మాంసం, పాలు, వెన్న, పండ్లు మున్నగునవి చాలినంతగా సరఫరా కావటంలేదు; చివరకు బంగాళా దుంపలు, తదితర కూరగాయలుకూడా సక్రమంగా అందని ఉదంతాలుకూడా ఉన్నాయి. కొన్ని మేలురకపు పారిశ్రామిక వస్తువులను ప్రజలకు సరఫరా చేయుటంలో యిబ్బందులు తప్పటంలేదు. మన వాణిజ్య సంస్థల కృషిలో లోపాలు కొంతవరకు కారణమైనప్పటికీ, ఉత్పత్తి తగినంతగా జరగకపోవటమే యిందుకు ప్రధానకారణమని చెప్పాలి. వ్యావసాయకోత్పత్తిని ఒక్క పెట్టున పెంపొందించటం, భారీ పరిశ్రమల అభివృద్ధికి ప్రథమ తాంబూలం యిస్తూనే తేలికపరిశ్రమలు, ఆహార పదార్థాల పరిశ్రమలను త్వరత్వరగా మరింత విస్తరింప చేయుటం - ఇదే మన కర్తవ్యం.

కాౖమేడ్స్, ఫ్యాక్టరీ, ఆఫీసు, తదితర కార్మికుల వాస్తవిక వేతనాలను నూటికి 30 వంతులు, సమిష్టి వ్యవసాయదారుల వాస్తవిక ఆదాయాలను నూటికి 40 వంతులు పెంచాలని ఆరో పంచవర్ష ప్రణాళికలో సూచించబడింది.

ఈమధ్య కేంద్ర కమిటీ సూచించిన చర్యలన్నింటినీ అమలు జరిపితే, ప్రజల జీవనస్థితిగతులను యింకా బాగుపర్చేందుకు అవి దోహదకరం కాగలవు.

తక్కువ జీతాలు వచ్చే తరగతికి చెందిన కార్మికుల వేతనాలను పెంచేందుకు వీలుగా ఒక చట్టం రూపొందించాలని కేంద్ర కమిటీ, సోవియట్ మంత్రిమండలి ఆదేశించి ఎంతో కాలం కాలేదు. అలాంటి కార్మికుల వేతనాలను పెంచడానికి తీసుకొనే చర్యలతోపాటే, ఫ్యాక్టరీలు, ఆఫీసులలో పనిచేసే కార్మికులకు, మన ఆర్థిక విధానంలో వివిధశాఖలలో పనిచేసే తదితర కార్మికులకు వేతనాలిచ్చే పద్ధతిని నియమబద్ధంచేసేందుకు కూడా చర్యలు తీసుకోవాలి. వారి వారి అర్హతలు, వారు నిర్వహించే బాధ్యతలలోగల కష్ట నష్టాలను ఆధారంచేసుకొని వివిధ తరగతులకు చెందిన కార్మికులకు సరియైన వేతనాల నిష్పత్తిని నిర్ణయించాలి.

వేతనాల పద్ధతిలోను, రేట్-ఫిక్సింగ్ పద్ధతిలోను ఎన్నో అవకతవకలు, గందరగోళం ఉన్నాయన్న సంగతి యిక్కడ పేర్కొనవలసి వుంది. మంత్రిత్వ శాఖలు, ఇతర సంస్థలు, ట్రేడ్‌యూనియన్లు పైన పేర్కొన్న విషయాలలో తగినంత శ్రద్ధ చూపలేదు; వాటిని అవి అలక్ష్యం చేశాయి. వేతనాలను చదును చేయటం (వేజ్ లెవెలింగ్) అన్నది అక్కడక్కడా మాత్రమే జరగలేదు. పైగా, వివిధ శాఖలలో ఒకేరకమైన పని నిర్వహిస్తున్నవారి వేతనాలలో తేడాలున్న ఉదంతాలుకూడా అనేకం వున్నాయి; అంతేకాదు. ఒకే సంస్థక్రింద ఒకేరకమైన పనులు చేస్తున్నవారి వేతనాలలో కూడా తేడాలున్న ఉదంతాలు లేకపోలేదు. తక్కువ వేతనాలు పుచ్చుకొంటున్న కార్మికులతోపాటే, మరొక రకం కార్మికులు-వారి సంఖ్య స్వల్పంగానే వుందనుకోండి-న్యాయ విరుద్ధంగా అధిక వేతనాలు పొందుతూంటే చూస్తూ సహించబడుతోంది.

సక్రమమైన పద్ధతిలో శ్రమకు ప్రతిఫలాన్ని ముట్టజెప్పే విషయంలో ప్రధానమైన రాజకీయ ఆర్థిక కర్తవ్యమొకటి మనలను ఎదుర్కొంటోంది. కార్మికులలో వ్యక్తిగతమైన చొరవను ప్రోత్సహించాలన్న సూత్రాన్ని మనం తు. చ. తప్పకుండా పాటిస్తుండాలి; ఈ సూత్రాన్ని అమలుజరపటం ద్వారా మాత్రమే ఉత్పత్తి నిరాటంకంగా వృద్ధిచెందుతుందన్న విషయం మనం దృష్టిలో పెట్టుకోవాలి. "జాతీయార్థిక వ్యవస్థలోని ప్రతి ప్రధాన శాఖ కూడా వ్యక్తిగత చొరవ ప్రాతిపదికమైననే ఆధారపడేటట్లు చేయాలి" అని లెనిన్ మనకు ఉపదేశించాడు (వర్క్స్ సంపుటి 33; పేజీ 47).

మన ఆర్థిక విధానంలోని శాఖలన్నింటిలోను వేతనపద్ధతిని మెరుగుపరచి లోపరహితం కావించాలి; ప్రతి కార్మికుడు చేసేపనియొక్క గుణాన్నిబట్టి, పరిమాణాన్నిబట్టి వేతనం నిర్ధరించబడాలి; శ్రామికోత్పాదక శక్తిని యితోధికం చేసే

నిమిత్తం బలీయమైన భౌతిక ప్రోత్సాహకాలను సాధనంగా వినియోగించుకోవాలి. ఆ యా షాపులు, సంస్థలు, పరిశ్రమలు, సమిష్టి వ్యవసాయ క్షేత్రాలు, మెషిన్ ట్రాక్టర్ కేంద్రాలు లేక ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలు-వీటిలో జరిగేపనికి,ఇంజనీర్ల,సాంకేతిక నిపుణుల, నిర్వాహకుల జీతాలలో కొంత భాగానికి ప్రత్యక్ష సంబంధ మేర్పరచడం అవసరం. చేసిన పనినిబట్టి ప్రతిఫలం ముట్టుతుందన్న సోషలిస్టు సూత్రానికి ఇది అనుగుణ్యమైనది. ఈ సమస్యను మనం సరిగా పరిష్కరించగలిగితే, ఉత్పత్తి యింకా యిబ్బడికం కావటానికీ, మన ప్రజల స్థితిగతులను బాగుపర్చేందుకు తోడ్పడుతుంది.

కామ్రేడ్స్, పనిగంటల సంఖ్యను తగ్గించడం అత్యంత ప్రధానమైన సమస్య. నేటి పరిస్థితులిందుకు అనుకూలంగా ఉన్నాయని పార్టీ కేంద్ర కమిటీ భావిస్తోంది (దీర్ఘ హర్షధ్వానాలు).

పెట్టుబడిదారీ విధానంలో పనిగంటల తగ్గింపుకోసం కార్మికవర్గం తరతరాలుగా పోరాడుతూ వచ్చింది. శాస్త్రీయ సోషలిజానికి పితామహుడు, కార్మికవర్గానికి మహోపాధ్యాయుడు అయిన కారల్ మార్క్స్ 1866 లో జరిగిన మొదటి ఇంటర్నేషనల్‌లోనే రోజుకు 8 గంటల పనిఅన్న నినాదాన్ని యిచ్చారు. రష్యన్ సోషల్ డెమోక్రటిక్ లేబరుపార్టీ (బోల్షివిక్స్) కార్యక్రమంలో రూపొందించిన కోర్కెలలో రోజుకు 8 గంటల పనిఅన్నది ఒకటి. అక్టోబరు సోషలిస్టు మహా విప్లవం జయప్రదం కావటంతో, ఆ నినాదం ఆచరణరూపం ధరించింది. సోవియట్ ప్రభుత్వం జారీచేసిన మొట్టమొదటి డిక్రీలలోనే రోజుకు 8 గంటల పనిని చట్ట బద్ధం చేసింది. సోషలిస్టు విప్లవం సాధించిన ఘనవిజయం అది.

అంతేకాదు; సామాజికోత్పత్తి పెరిగినకొలదీ, శ్రామికోత్పాదకశక్తి యిబ్బడిక మైనకొలదీ పని గంటలను క్రమంగా తగ్గించేందుకు పూనుకోవాలని మన పార్టీ 8 వ మహాసభ చాటింది. ఆ మేరకు యుద్ధానికి పూర్వపు సంవత్సరాలలో ప్రథమ చర్యలు తీసుకోబడ్డాయన్న సంగతి మీ కందరికీ తెలుసు. అయితే యుద్ధ ప్రమాదం ముంచుకు వచ్చినందువల్లా, ద్రోహబుద్ధితో హిట్లర్ మన దేశంమీద దండయాత్ర ప్రారంభించుటవల్లా ఆ విషయంలో మరికొన్ని చర్యలు తీసుకొనేందుకు తాత్కాలి కంగా అంతరాయం కలిగింది. ఈ సమస్యను తిరిగి మనం పరిష్కరించేందుకు యిప్పుడు నిజమైన అవకాశాలు ఏర్పడ్డాయి; ఇంతకుపూర్వం మన మేరకైతే చేయలేకపోయామో దానిని యిప్పుడు చేయగలం.

ఆరో పంచవర్ష ప్రణాళికాకాలంలో ఫ్యాక్టరీ, ఆఫీసు, తదితర కార్మికు లందరికీ రోజుకి 6 గంటల పనిని ప్రవేశపెట్టాలన్న తన నిర్ణయాన్ని కేంద్రకమిటీ ఈ మహాసభకు నివేదిస్తోంది (హర్షధ్వానాలు). బొగ్గు, ముడి లోహపు గనుల లోపల పనిచేసే కార్మికులు రోజుకు 6 గంటలుమాత్రమే పనిచేయాలని కేంద్రకమిటీ నిశ్చయించింది; 16 నుంచి 18 సంవత్సరాల మధ్య వయస్సుగల యువకులుకూడా రోజుకు 6 గంటలు మాత్రమే పనిచేయాలన్న సూత్రాన్ని పునరుద్ధరించటానికి నిశ్చయించాం (హర్షధ్వానాలు). శనివారాలలోను, సెలవు దినాలకు ముందురోజున

ఫ్యాక్టరీ, ఆఫీసు తదితర కార్మికులు 6 గంటలు మాత్రమే పనిచేయాలనికూడా నిర్ణయించాం (దీర్ఘ హర్షధ్వానాలు).

1957 లో ప్రారంభించి, జాతీయార్థిక విధానంలో ఒక శాఖ తర్వాత మరొక శాఖలో రోజుకు 7 గంటల పనిని పార్టీ, ప్రభుత్వమూ క్రమంగా ప్రవేశపెట్టుతాయి; లేదా ఉత్పత్తి స్థితిగతులదృష్ట్యా వీలుపడితే వారానికి అయిదురోజుల పనిని (రోజుకి 8 గంటల చొప్పున పని, రెండు రోజులు సెలవు) ప్రవేశపెట్టుతాయి; ఈ కార్యక్రమాన్నంతటినీ ఆరో పంచవర్ష ప్రణాళికాకాలం పూర్తయ్యేసరికి అమలు జరపాలన్న లక్ష్యంతో పార్టీ, ప్రభుత్వమూ పనిచేస్తాయి (హర్షధ్వానాలు).

పనిగంటలను తగ్గించినందుకు ఫ్యాక్టరీ, ఆఫీసు, తదితర కార్మికుల వేతనాలు ఏ మాత్రం తగ్గించబడవు (హర్షధ్వానాలు).

పనిగంటలను తగ్గించాలని కేంద్ర కమిటీ చేసిన నిర్ణయానికి గొప్ప జాతీయ, ఆర్థిక, రాజకీయ ప్రాధాన్యం వుంది. ఈ నిర్ణయాన్ని 20 వ పార్టీ మహాసభ, సోవియట్ ప్రజలు ఏకగ్రీవంగా ఆహ్వానిస్తారనటంలో ఎలాంటి సందేహం లేదు. జాతీయార్థిక కార్యక్రమాలను పూర్తిచేసి, అధిగమించేందుకు సోవియట్ ప్రజలు యినుమడించిన ఉత్సాహంతో తమ కృషిని యినోధికం చేసేందుకు ఈ చర్యలన్నీ ప్రోత్సాహమీయగలవు (మిన్నుముట్టే దీర్ఘ హర్షధ్వానాలు).

పనిగంటలు తగ్గించబడుతున్నాయి కనుక అయిదో పంచవర్ష ప్రణాళిక లక్ష్యాలను జయప్రదంగా సాధించాలంటే అందుకు వివిధసంస్థల నిర్వాహణాధిపతులు, పార్టీ, ట్రేడ్‌యూనియన్ సంస్థల నాయకులు కొంతవరకు నిర్మాణసంబంధమైన కృషి సాగించాలని ఈ సందర్భంలో ప్రత్యేకంగా గుర్తుచేయవలసివుంటుంది.

తక్షణావసరమైనవిషయం యింకొకటికూడా వున్నది. వేతనపద్ధతిని క్రమబద్ధం చేయటం, పనిగంటలను తగ్గించటంతోపాటే; పింఛనుపద్ధతినికూడా బాగుపర్చాలి. సోవియట్‌యూనియన్‌లో పింఛనుపద్ధతిని అమలుజరిపేందుకు అవసరమైన డబ్బును ప్రభుత్వం, ప్రజాసంస్థలు భరిస్తున్నాయి. ఇచ్చే పింఛను మొత్తాలలో పెద్దపెద్ద వ్యత్యాసా లుంటున్నాయి. అనేకరకాలైన పింఛనుదారులకు తక్కువమొత్తం పించను యిస్తున్నారు; మరొకప్రక్క మరికొంతమంది పౌరులకు, వారిలో కొంతమంది వృద్ధులు కాకపోయినప్పటికీ, పెద్దపెద్ద మొత్తాలు పించనురూపంలో ముట్టుతున్నాయి.

నిజమే; చాలామంది కామ్రేడ్స్ పార్టీ ఆశయసాధనకు పింఛన్లు పుచ్చుకొనే అర్హతను కలిగియున్నప్పటికీ, కష్టపడి పనిచేస్తున్నారు. ఉదాహరణకు కామ్రేడ్ ఒగ్లొవస్కీనే తీసుకోండి. ఆయన ప్రస్తుతం బైలోరష్యన్ రిపబ్లిక్‌లో రాస్యవెట్ సమిష్టి వ్యవసాయక్షేత్రపు అధ్యక్షుడుగా పనిచేస్తున్నారు.

సైనిక బలాలలో అనేక సంవత్సరాలపాటు కామ్రేడ్ ఒగ్లొవస్కీ పనిచేశారు. యుద్ధకాలంలో ధైర్యసాహసాలతో శత్రువు నెదిర్చి పోరాడారు. ఆయన ప్రదర్శించిన సాహస పరాక్రమాలకు 'సోవియట్ యూనియన్ వీరుడు' అన్న బిరుదును

పొందారు. యుద్ధంలో ఒక చేయిని పోగొట్టుకొన్నారు. లెఫ్టినెంట్ కర్నల్‌గా రిటైర్ అయ్యారు; సముచితమైన పద్ధతిలో ఆయనకు వచ్చే పింఛనుతో హాయిగా కాల క్షేపం చేయవచ్చు. కాని, పింఛనుదారు బ్రతుకు వెళ్ళబుచ్చటానికి కమ్యూనిస్టుగా ఆయన అంగీకరించలేకపోయారు. మండలపార్టీ కమిటీ కార్యాలయానికి ఆయన వెళ్ళారు; అగ్రశ్రేణిలో ఏదో ఒక పని పురమాయించమని పార్టీని కోరారు: సమిష్టి వ్యవసాయక్షేత్రపు అధ్యక్షునిగా ఎన్నుకోవాలని పార్టీ కమిటీ సిఫారసు చేసింది. కామ్రేడ్ ఒగ్లొవస్కీ తనకు అప్పజెప్పిన పనిలో పూర్తిగా నిమగ్నమైపోయారు. ఎంతో వెనకబడివున్న ఆ వ్యవసాయక్షేత్రం ఆయన నాయకత్వంక్రింద ఎంతో అభివృద్ధి చెందిన క్షేత్రంగా మార్పుచెందింది. ఈ నాడు ఈ సమిష్టి వ్యవసాయక్షేత్రం పేరు సోవియట్ యూనియన్ అంతటా మారుమ్రోగిపోతోంది. ఆయన నిజమైన కమ్యూనిస్టు దేశభక్తుడు! (దీర్ఘహర్షధ్వానాలు).

పింఛన్లు యిచ్చే పద్ధతిని క్రమబద్ధం చేసేందుకు పార్టీ కేంద్ర కమిటీ, సోవియట్ ప్రభుత్వం కొన్ని చర్యలు తీసుకొంటున్నాయి; తక్కువ మొత్తం పింఛన్లను గణనీయంగా పెంచేందుకు, అసమంజసమైన పద్ధతిలో ఎక్కువ మొత్తాలు పుచ్చుకొంటున్నవారి పింఛన్లను కొంతవరకు తగ్గించేందుకు ఆ చర్యలు నిర్దేశించబడ్డాయి. సోవియట్ యూనియన్ అంతటా ఒకేరకమైన పింఛనుపద్ధతిని ప్రవేశపెట్టేందుకు, పైన పేర్కొన్న లోపాలను తొలగించేందుకు వీలుగా ఒకబిల్లును త్వరలోనే సోవియట్ యూనియన్ సుప్రీం సోవియట్‌లో ప్రతిపాదించబోతున్నాం (దీర్ఘ హర్ష ధ్వానాలు).

దిక్కులేని, లేదా ఏదోఒక కారణంచేత తమ కుటుంబాలతోపాటు కలిసి జీవించలేని కువృద్ధుల బాగోగులపట్ల మరింత ఎక్కువ శ్రద్ధ చూపాలి. తమ జీవితమంతా దేశ శ్రేయస్సుకోసం వళ్ళు దాచుకోకుండా కష్టపడి పనిచేసిన వారికి వృద్ధాప్యంలో వాస్తవమైన విశ్రాంతి, భద్రత చేకూర్చేనిమిత్తం మనం గృహాలను నిర్మించాలి (హర్షధ్వానాలు). నేత్రానందంకూర్చే ప్రకృతిదృశ్యాలు శోభాయమానంగా వెలుగొందే ప్రదేశాలలో అలాంటి గృహాలను నిర్మించాలి. అలాగే వికలాంగులకుకూడా హెచ్చుసంఖ్యలో యిళ్ళను నిర్మించి, వారిచేత సామాజికంగా ఉపయోగమైన పనిని, వారి ఆరోగ్యానికి భంగంకాని పనిని చేయించాలి.

పార్టీ, ప్రభుత్వమూ తీసుకొంటున్న ఈ చర్యలపట్ల సోవియట్ ప్రజలు-నిర్మాతల జాతి - సముచితోత్సాహాన్ని ప్రదర్శించగలరన్న విశ్వాసం కమ్యూనిస్టుపార్టీ కేంద్ర కమిటీకి వున్నది; సామాజిక ఆర్థిక విధానానికి చెందిన శాఖ లన్నింటిలోను వారు తమ కార్యకలాపాలను యినుమడించిన ఉత్సాహంతో కొనసాగించగలరన్న నమ్మకం కేంద్రకమిటీకి ఉన్నది. ఎందుకంటే ఉత్పత్తి నిరవధికంగా వృద్ధిచెందితేనే శ్రామికోత్పాదన యితోధికమైతేనే సామాజిక సంపద పుంఖానుపుంఖంగా పెరుగుతుంది; పనిగంటలు తగ్గించ వీలుపడుతుంది; క్రమానుగతంగా ప్రజలజీవన స్థితిగతులు బాగుపర్చ సాధ్యపడుతుంది (దీర్ఘమైన హర్షధ్వానాలు).

ఈ చర్య లన్నింటినీ సైకోనాలంటే గణనీయమైన ధనం అవసర మవుతుందని వేరే చెప్పనవసరంలేదు. ఆడబ్బు ఎక్కడనుంచి వస్తుంది? మొదటివిషయం: శ్రామికోత్పాదన యితోధిక మైనందువల్లా, పొదుపరితనంవల్లా, దుబారాను తగ్గించడం వల్లా, పరిపాలనా నిర్వహణ ఖర్చులను తగ్గించడంవల్లా కొంతవరకు డబ్బు మిగల్చవచ్చు. ధరల తగ్గింపుకోసం ప్రభుత్వం యింతకుపూర్వమే కేటాయించిన డబ్బులో కొంతభాగాన్ని యిందుకోసం ఉపయోగించటంకూడా మంచిదే. అందుచేత, వచ్చే కొలది సంవత్సరాలలోను ధరల తగ్గింపుకోసం కేటాయించే మొత్తాలనుంచి కొంత సొమ్మును ఈ చర్యలకోసం ఉపయోగించాలి (హర్షధ్వానాలు).

గృహావసతులను మెరుగుపర్చటం అన్న దానిని తన ప్రధానకర్తవ్యాలలో ఒకటిగా పార్టీ ఎంచుకొంటుంది. కామ్రేడ్స్! యుద్ధంవల్ల మన దేశానికి ఎంత అపారమైన నష్టం వాటిల్లిందో మీకందరకూ తెలుసు. భస్మీపటలమైపోయిన యిళ్ళను పునరుద్ధరించటానికి ప్రభుత్వం పెద్ద పెద్ద మొత్తాలను ఖర్చుచేయవలసి వచ్చింది. ఇళ్ళ నిర్మాణంకోసం కేటాయించే మొత్తాలు ఆయేటి కాయేడు ఎక్కువవుతున్నాయి. ఉదాహరణకు, గత ఆయిదు సంవత్సరాలలోను యిళ్ల నిర్మాణం కోసం ప్రభుత్వం వెచ్చించిన పెట్టుబడి మొత్తం 10 లక్షల మిలియన్ల రూబుళ్ళు; అంటే నాలుగో పంచవర్ష ప్రణాళికాకాలంలోకన్న నూటికి 120 వంతులు ఎక్కువగా ఖర్చు చేశాం.

గృహ నిర్మాణం విషయంలో మనం చాలా సాధించాం; అయినప్పటికీ మన జాతీయార్థిక విధానం యొక్క అభివృద్ధితోను పట్టణ, పారిశ్రామిక కేంద్రాల పెరుగుదలతోను పోల్చి చూసుకుంటే, గృహ నిర్మాణ కృషి ఎంతో వెనకబడి వుందనే చెప్పాలి. దీనికితోడు, అనేక మంత్రిత్వ శాఖలు, తదితర సంస్థలు తమతమ గృహనిర్మాణ కార్యక్రమాలను అమలు జరపటంలో విఫలమవు తున్నాయి. అవమాన కరమైన యిలాంటి స్థితిగతులను యింకెంతమాత్రం సహింపరాదు.

అయిదో పంచవర్ష ప్రణాళికతో పోల్చినప్పుడు ఆరో పంచవర్ష ప్రణాళిక క్రింద పట్టణాలలోని గృహనిర్మాణ కార్యక్రమానికి కేటాయించిన మొత్తం దాదాపు రెట్టింపు. ఈ ప్రణాళికలో కేటాయించిన ధనంతో మొత్తం 20 కోట్ల 50 లక్షల చదరపు మీటర్ల వైశాల్యంగల గృహాలు నిర్మించబడతాయి. ఒక్క 1957 సంవత్సరం లోనే 2 కోట్ల 90 లక్షల చదరపు మీటర్ల వైశాల్యంగల యిళ్ళను ప్రభుత్వం నిర్మిస్తుంది. ఆయేటికాయేడు గృహనిర్మాణ కార్యక్రమం యితోధిక మవుతూంటుంది.

గృహనిర్మాణంలో పురాతన పద్ధతులకు, దుబారాకు స్వస్తిచెప్పాలని పార్టీ కేంద్రకమిటీ, మంత్రిమండలి స్పష్టంచేసిన సంగతి మీకు తెలుసు. కొంతమంది వాస్తు శాస్త్రజ్ఞులయొక్క లేనిపోని అభిరుచులను సంతృప్తిపర్చే నిమిత్తం అర్థంపర్థంలేని అలంకరణలకోసం లక్షలాది రూబుళ్ళను వెచ్చించటానికి మనం అంగీకరింపజాలం. సోషలిస్టు వాస్తుశాస్త్ర విలసితమైనశైలిని మన వాస్తుశాస్త్రజ్ఞులు సృష్టించటం

గౌరవప్రదంగా వుంటుంది; గతంలో మానవాళి సంతరింపజేసుకొన్న ఉత్తమోత్తమ వాస్తుశిల్ప లక్షణాలను ఆ సృష్టిలో మూర్తీభవింపచేయాలి; అదే సమయంలో అంత్యంలో అభ్యుదయకరమైన సోవియట్ వాస్తుశిల్పంలోని సారాంశం అందులో ప్రతిబింబించేటట్లుండాలి. మనం నిర్మించే గృహాలు అత్యంతోపయోగంగాను, సకల వసతులతోను విరాజిల్లుతుండాలి. ఎక్కువకాలం మన్నేవిగా వుండాలి. తక్కువ డబ్బుతో అత్యంత ఆకర్షణీయమైన భవనాలను నిర్మించాలి.

గృహనిర్మాణానికి సంబంధించిన నిర్వహణను పారిశ్రామిక ప్రాతిపదికపై సాగిస్తూ, దానిని బాగా చక్కపర్చాలి. మొదట మాస్కోలోను, ఆటుతర్వాత లెనిన్‌గ్రాడ్, కీవ్‌లలోను గృహనిర్మాణ సంస్థలను కేంద్రీకృతం గావించి, సంలీనం చేసినందువల్ల ఎన్నో సత్ఫలితాలు సమకూడినవి. ఇతర రిపబ్లిక్‌లకు, పట్టణాలకు, ఆర్థికవిధానంలోని వివిధశాఖలకుకూడా ఆ కార్యక్రమాన్ని ధైర్యంతో, దృఢసంకల్పంతో విస్తరింపచేయాలి.

దేశంలోని ఇతర ప్రాంతాలనుంచి జనం మాస్కో, లెనిన్‌గ్రాడ్, కీవ్‌వంటి నగరాలకు వస్తుంటారు. కనుక వాటి జనాభా నిరంతరం పెరుగుతూంటుంది. పెరిగే జన సంఖ్యకు తగినట్లుగా అలాంటి పెద్ద నగరాలలో గృహ వసతిని పెంపొందిస్తుండాలి. ఈ జనాభా పెరుగుదల ఎంత ఎక్కువగా ఉంటుందో తెలుసుకోవాలంటే మాస్కో ఉదాహరణనే తీసుకొంటేచాలు. అయిదో పంచవర్ష ప్రణాళిక కాలంలో ఇతర ప్రాంతాలనుంచి 3 లక్షలమంది మాస్కో నగరానికి వచ్చి స్థిరపడ్డారు. ఆ అయిదు సంవత్సరాలలోను మాస్కో నగరంలో 43,05,000 చదరపు మీటర్ల వైశాల్యంగల యిళ్ళు నిర్మించబడ్డాయి. గృహ నిర్మాణ కార్యక్రమం అంత పెద్దఎత్తున సాగినప్పటికీ యిళ్ళ కొరత యింతకు పూర్వంలాగానే వుంటూవచ్చింది.

మన పట్టణ జనాభా సహజ పద్ధతిలోనే పెద్ద ఎత్తున పెరుగుతున్నది కనుక, ఇతర ప్రాంతాలనుంచి నగరాలకు కార్మికులను తెప్పించే కార్యక్రమం ఆపుచేయవచ్చు; ఒకవేళ అదనపు కార్మికులు ఆవసరమైనప్పటికీ, పట్టణ ప్రజలనుంచే అదనపు కార్మికులను నియోగించవచ్చు (హర్షధ్వానాలు). ఈ విషయంలో మనం ఎలాంటి యిబ్బందినీ ఎదుర్కోనవలసిన అవసరం వుండదు. ఎందుకంటే మనం పెద్దపెద్ద నగరాలలో కొత్తగా పారిశ్రామిక నిర్మాణం కొనసాగించటంలేదు; పైగా యిప్పుడున్న పరిశ్రమంలో సాంకేతిక స్థాయిని త్వరితగతిని పెంపొందిస్తున్నాం; ఉత్పత్తికి సంబంధించిన సాంకేతిక చాతుర్యాన్ని బాగుపరుచుతున్నాం; ఉత్పాదకశక్తి క్రమంగా పెంపొందుతోంది. ఇతర జిల్లాలనుంచి ప్రజలు పెద్దపెద్ద నగరాలకు తరలిరాకుండా ఆపుచేయగలిగిన పద్ధతిలో పట్టణాలలో యిళ్ళకొరతను తక్కువ కాలంలోనే సంతృప్తికరంగా తీర్చగలం.

మనం మరొకపని కూడా చేయాలి. మాస్కో, లెనిన్‌గ్రాడ్, కీవ్, ఖార్కోవ్‌వంటి పెద్దపెద్ద నగరాలలోని జనాభాను విస్తరింపచేసే నిమిత్తం ఆ నగరాల పరిసరాలలో చిన్న చిన్న ఆధునిక పట్టణాలను అభివృద్ధి చేయాలి. ఈ నగరా

లలో గృహనిర్మాణ కార్యక్రమానికి కేటాయించిన డబ్బుతో ఈపని చేయవచ్చు. మరోవిధంగా చెప్పాలంటే, చక్కని ఆధునిక భవనాలను నగరాల లోపలకాక కొంచెం దూరాన నిర్మించాలి; అలాంటి చిన్నచిన్న పట్టణాలలో చక్కని వసతులు కల్పించి, తద్వారా ప్రజలను ఆకర్షించేటట్లు చూడాలి. ఆ చిన్న పట్టణాలలో నివసించే ప్రజలు పనిచేసేందుకు వీలుగా కొన్ని ఫ్యాక్టరీలను అక్కడకుతరలించాలి.

ప్రభుత్వం తరఫున భవనాలు నిర్మించుటతోపాటే, వ్యక్తులుకూడా సొంత గృహాలను నిర్మించుకొనేపద్ధతిని ప్రోత్సహించాలి. ఫ్యాక్టరీ, ఆఫీసు, తదితర కార్మికులు తమతమ ఆదాయాలలో కొంత మిగుల్చుకొని సొంతగృహాలను నిర్మించు కొనేందుకు మరింత విస్తారమైన సహాయం చేయాలి. గృహనిర్మాణసామగ్రిని, ప్రామాణిక గృహాలకు చెందిన భాగాలను ప్రజలకు హెచ్చుగా అమ్మేందుకు వాటి ఉత్పత్తిని యితోధికం చేయాలి.

ప్రజల నిత్యజీవితావసరాలపట్ల మనం తగినంత శ్రద్ధచూపటంలేదు. సోవియట్ కుటుంబంయొక్క జీవితాన్ని సుఖమయం చేసేందుకు తక్కువ శ్రమతో యింటి పనులను జరుపుకొనటానికి వీలైన గృహోపకరణాలను యంత్రాలను - ఎలెక్ట్రిక్ అప్లయన్సెస్, వాషింగ్ మెషిన్స్, కుట్టుయంత్రాలు, చక్కని వంటసామగ్రి మున్నగు వాటిని మనం ఉత్పత్తిచేయాలి. పబ్లిక్ సర్వీసు ఎస్టాబ్లిష్మెంటులను, లాండ్రీలను, టైలరింగ్ సంస్థలను, బట్టలు, బూట్లు, చెప్పుల రిపేర్ షాపులను మనం యింకా ఎక్కువగా స్థాపించాలి.

హోటళ్ళవంటివాటిని స్థాపించటంద్వారా ప్రజలకు భోజన సదుపాయాలు కల్పించటం ప్రజల నిత్యజీవితాన్ని బాగుపర్చటంలో ప్రధానపాత్ర నిర్వ హిస్తుంది. సక్రమపద్ధతిపైన అలాంటి భోజన సదుపాయాలను కల్పించినందువల్ల వంటయింటి బాదరబందీనుంచి లక్షలాది స్త్రీలు విముక్తి అవుతారు; సామాజికంగా ప్రయోజనకరమైన పనిపాట్లలో వారు పాల్గొనగలుగుతారు; మనకు ప్రత్యేకంగా ఎంతో ముఖ్యమైన పిల్లల పెంపకం విషయంలో వారు మరింత శ్రద్ధ చూప వీలవు తుంది. అందుచేత హోటళ్ళవంటివాటిని నెలకొల్పటంద్వారా ప్రజలకు భోజన సదుపాయాలను పెద్ద ఎత్తున కలుగజేయాలి.

ఒక ప్రక్క ఇలా చేస్తూనే, మరొకప్రక్క భోజనశాలలలోని, రెస్టారెంటు లలోని స్థితిగతులను మెరుగుపర్చేందుకు గట్టిగా కృషిచేయవలసివుంటుంది. అనవసర మైన ఖర్చులను తగ్గించి, మరింత మంచిరకం వంటకాలను తయారుచేస్తూ, వాటిధరలను తగ్గించాలి. ప్రజలకు అమ్మేందుకు అన్నిరకాలైన సెమీ ప్రపేర్డ్ వంటకాలను భోజనశాలలు, రెస్టారెంటులు యిప్పటికన్నా ఎక్కువగా తయారుచేస్తుండాలి. స్థానికంగా దొరికే సరుకులను పూర్తిగా వినియోగించుకొంటూ, అనుబంధ క్షేత్రా లను అభివృద్ధిచేయాలి. మనం గట్టి పట్టుదలతో కఫిఫేరియా లేక స్వయం సహాయక పద్ధతిని అమలు జరపాలి. యిప్పటికన్నా ఎక్కువగా ఆటోమెటిక్ సర్వీసింగ్ పద్ధతులను ప్రవేశపెట్టాలి. ఒక్కమాటలో చెప్పాలంటే, యింట్లో వంటవండుకోటం

కన్నా భోజనశాలలకు పోయి భోజనం కొనుక్కొని తెచ్చుకోటమే ఎక్కువ సౌకర్యం అన్న భావాన్ని ప్రజలలో కలిగేటట్లు చూడాలి.

పాఠశాలల్లో చక్కని పద్ధతులపై భోజనశాలలను నడపాలి: ముందుతరంవారి ఆరోగ్యం కాపాడేందుకు, విద్యాప్రమాణాలు పడిపోకుండా కాపాడేందుకు అదెంతో అవసరం. పాఠశాలల్లోని పిల్లలకు వేడివేడి భోజనాలు పెట్టుతుండాలి; అందుకు వీలుగా భోజనశాలలను నెలకొల్పాలి. తక్కువ వేతనాలు ముట్టుతున్న తలిదండ్రుల పిల్లలకు ఉచితంగానో తక్కువ ధరకో భోజనాలు పెట్టేసమస్యను అద్యతన భావిలోనే మనం పరిష్కరించవలసి వుంటుంది (హర్షధ్వానాలు).

ప్రజారోగ్య సౌకర్యాలను యింకా బాగుపర్చటం ప్రధానమైన కర్తవ్యంగా పరిగణించాలి. ఈ రంగంలో మనం సాధించిన విజయాలు లోకవిదితమే. అయినప్పటికీ ఈ రంగంలోకూడా, ముఖ్యంగా గ్రామీణ ప్రాంతాలలో, తీవ్రమైన లోపాలు లేకపోలేదు. వచ్చే కొలది సంవత్సరాలలోను యింకా అనేక వైద్యసంస్థలను మనం నెలకొల్పాలి. అవి సాగించేకృషిని యింకా మెరుగుపర్చాలి.

ప్రజల జీవన స్థితిగతులను బాగుపర్చటానికి సంబంధించిన ప్రతి అంశంలోను తక్షణం సాగించవలసిన కృషి ఎంతోవుంది. ఈ కృషికి ఎంత ఎక్కువ ప్రాధాన్యంవుందో వేరే వివరించి చెప్పనవసరంలేదు; ప్రజల జీవితాలకు సంబంధించిన ప్రధానమైన ప్రయోజనాలు అందులో యిమిడివున్నాయి. మనపార్టీ, సోవియట్ ప్రభుత్వమూ సాగించే కృషిలో ప్రజల సౌఖ్యానందాలు సదా కీలకస్థానమాక్రమిస్తుంటాయి (మిన్నుముట్టే దీర్ఘ హర్షధ్వానాలు).

## 2. సోవియట్ శాస్త్ర, సంస్కృతీ వికాసంకోసం

కామ్రేడ్స్, మనదేశంలో సాధించబడిన మహత్తర సాంస్కృతిక విప్లవం యొక్క ఫలితాలను సోవియట్ ప్రజలు అనుభవిస్తున్నారు. సోవియట్ యూనియన్‌లోవున్నన్ని పాఠశాలలుగానీ, సాంకేతిక ఉన్నతపాఠశాలలుగానీ, ఉన్నతవిద్యాసంస్థలుగానీ, పరిశోధనా సంస్థలుగానీ, ప్రయోగ కేంద్రాలుగానీ, ప్రయోగశాలలుగానీ, నాటకశాలలుగానీ, క్లబ్‌లుగానీ, గ్రంధాలయాలుగానీ, తదితర సాంస్కృతిక, విద్యాసంస్థలుగానీ మరి యే పెట్టుబడిదారీదేశంలోను లేవు (హర్షధ్వానాలు).

మన సాంస్కృతికాభ్యున్నతికి మన దేశంలోని ప్రజావిద్య స్థితిగతులే తిరుగులేని తార్కాణం. పట్టణాలలోను, గ్రామీణ ప్రాంతాలలోకూడా సోవియట్ యూనియన్ సార్వజనీన సప్తవర్ష విద్యను ప్రవేశపెట్టింది. ప్రధాన నగరాలలో దశవర్ష విద్యను చాలావరకు అమలు జరిపింది. వచ్చే అయిదు సంవత్సరాలలో సార్వజనీన ఉన్నతవిద్యను చాలావరకు పట్టణాలన్నింటిలోను, గ్రామీణ ప్రాంతాలన్నింటిలోను ప్రవేశపెట్టాలని ఆరో పంచవర్ష ప్రణాళిక నిర్దేశిస్తోంది. ఇది చాలా

ప్రధానమైన కర్తవ్యం. ఈ కర్తవ్యాన్ని నిర్వర్తించాలంటే జనరల్ పాఠశాలల్లో విద్యావసతులను, భౌతిక వసతులను గణనీయంగా అభివృద్ధిపరచవలసి వుంటుంది.

ఉన్నత పాఠశాలల్లోని పైతరగతులలోను, సాంకేతికోన్నత పాఠశాలలలోను, కాలేజీలలోను, విశ్వవిద్యాలయాలలోను యిప్పటికీ కొద్దిగా ట్యూషన్‌ఫీజు వసూలు చేయబడుతోంది. సార్వజనీన ఉన్నతవిద్యను ప్రవేశపెట్టేందుకు, యువజనులు ఉన్నతవిద్యను పొందేందుకు ఎక్కువ అవకాశాలు కల్పించేనిమిత్తం వచ్చే సంవత్సరంనుంచి ఫీజు వసూలుచేసే పద్ధతిని రద్దుచేయాలని నిర్ణయించాం (హర్షధ్వానాలు).

మన పాఠశాలా పద్ధతిలో ఒక పెద్ద లోపంవుంది; విద్యాబోధన కొంతవరకు వాస్తవ జీవితంనుంచి దూరమైపోయింది. పాఠశాల విద్యను పూర్తిచేసి బయటకువస్తున్న విద్యార్థులు ఆచరణయుక్తమైన కృషిలో పాల్గొనేందుకు తగినంత సామర్థ్యం కలిగి యుండటంలేదు. అయిదో పంచవర్ష ప్రణాళికాకాలంలో పాఠశాలల్లో పాలీటెక్నిక్ శిక్షణను ప్రవేశపెట్టేందుకు చర్యలు తీసుకోవాలని 19వ పార్టీ కాంగ్రెసు నిర్దేశించినప్పటికీ, దీనికి సంబంధించిన కృషి చాలా నెమ్మదిగా సాగుతోంది. అనేకమంది విద్యావేత్తలు, అనేక విద్యా శాస్త్రపరిషత్‌లు యిప్పటికీ పాలిటెక్నిక్‌శిక్షణయొక్క గొప్పతనంగురించి వట్టి మాటల్లో వర్ణిస్తున్నారేగానీ, ఆచరణలో పెట్టేందుకు ఏమాత్రం కృషిచేయటంలేదు; కబుర్లు చెప్పటం మాని, ఇక త్వరగా కార్యాచరణకు ఉపక్రమించాలి. పాఠశాలల్లో బోధించే విద్యను వాస్తవ జీవితానికి సన్నిహితంగా తెచ్చేందుకు పాఠశాలల్లో కొత్త కొత్త బోధనావిషయాలను సాంకేతిక శాస్త్రానికి, ఉత్పత్తికి సంబంధించిన మూలసూత్రాలను నేర్పటం మాత్రమేకాక, ఫ్యాక్టరీలలోను, ప్రభుత్వ సమిష్టి వ్యవసాయ క్షేత్రాలలోను, ప్రయోగ క్షేత్రాలలోను, పాఠశాలా కార్మాగారాలలోను విద్యార్థులు పనిచేయటాన్ని అలవర్చుకొనేటట్లుకూడా చూడాలి; ఉన్నత పాఠశాలలకు సంబంధించిన బోధనా విషయాలను రివైజ్ చేసి, ఉత్పత్తికి సంబంధించిన ప్రత్యేక విషయాలను యింకా ఎక్కువగా చేర్చాలి. ఆవిధంగా దశవర్ష పాఠశాల విద్యను పూర్తిచేసిన యువతీ, యువకులు ఉన్నత విద్యాపథం చేపట్టి ముందుకు పోయేందుకు అవసరమైన చక్కని జనరల్ విద్యను నేర్పటంతోపాటు ఆచరణ యుక్తమైన కార్యకలాపాలలో పాల్గొనేందుకు వీలుగాకూడ వారిని సన్నద్ధంచేయాలి; ఎందుకంటే ఉన్నత పాఠశాలా విద్యను పూర్తిచేసినవెంటనే జాతీయ ఆర్థిక విధానంలోని వివిధశాఖలలో ప్రవేశించే విద్యార్థులసంఖ్య ఎక్కువగానే వుంటుంది.

కమ్యూనిస్టు సమాజ నిర్మాణానికి బలీయమైన భౌతిక ఉత్పత్తి పునాదులు వేయటంలో మనదేశం ఆరో పంచవర్ష ప్రణాళికా కాలంలో పెద్దముందంజ వేస్తూందని చెప్పవచ్చు. అయితే కమ్యూనిజాన్ని ప్రాథమికదశనుంచి ఉన్నతదశకు మార్చే ఈ చారిత్రక పరివర్తన కార్యక్రమాన్ని పూర్తిచేసేందుకు అవసరమైన భావ సంపద సృష్టించుకొనే సమస్యనుకూడా మనం పరిష్కరించగలగాలి. మనదేశంలో

యువతరానికి చెందిన వారికి విద్యగరపటం అన్న విషయానికి అపారమైన సామాజిక ప్రధాన్యంగలదన్న సంగతిని నేను ఇక్కడ ప్రస్తావించదలచాను.

యుద్ధంమూలాన భర్తలను కోల్పోయిన అనేక భార్యలనెత్తిన పిల్లలను పెంచి, పోషించి, పెద్దచేసే గురుతరమైన భారం పడింది. తల్లిదండ్రులిద్దరూ ఏ ఫ్యాక్టరీలోనో, ఏ ఆఫీసులోనో పనిచేస్తూ, పిల్లల పెంపకం విషయంలో అంతగా శ్రద్ధ తీసుకోజాలని కుటుంబాలుకూడ చాలా వున్నాయి. ఇలాంటి పరిస్థితులలో అనేకమంది పిల్లలు బంధువుల, లేక ఇరుగుపొరుగువారి అదుపాజ్ఞలలో పాలిపెట్టబడుతున్నారు; కొన్ని సందర్భాలలో అసలు ఎలాంటి అదుపాజ్ఞలు లేకుండానే వదిలిపెట్టబడుతున్నారు. ఆ విధంగా గణనీయమైన సంఖ్యలో పిల్లలు గాలిగా వదిలిపెట్టబడుతున్నారు. దీనివల్ల ఎన్నో దుష్ఫలితాలు సంభవిస్తున్నాయి. పిల్లలకు సోషలిస్టు విద్యను గరిపే విషయంలో కుటుంబం, పాఠశాల అత్యంత ప్రధాన కేంద్రాలనేవి నిజమేననుకోండి. అయితే వాటికిమాత్రమే ఆ బాధ్యతను పరిమితంచేయరాదు.

గతాన్ని ఒకసారి పరికించిచూస్తే మనకు ఒక విషయం కనిపిస్తుంది. ప్రవర్ధమానతరానికి విద్యాబుద్ధులు గరిపేనిమిత్తం పాలకవర్గాలు జనరల్ పాఠశాలలతోపాటు, ఆనాడున్న ప్రభుత్వానికి, ఆనాటి కాలానికి అనుగుణమైన విద్యాపద్ధతిని అమలుజరుపుతూ వచ్చారన్న విషయం మనకు తెలుస్తుంది. ఆస్తిగలవర్గాల ప్రయోజనాలకు అనుగుణమైన పద్ధతిలో ప్రవర్ధమానతరానికి శిక్షణగరిపేందుకు ప్రభుత్వం ప్రత్యేకంగా పిల్లల శిక్షణాకేంద్రాలను నెలకొల్పింది. వాటినే “కోర్ ఆఫ్ పేజెస్”, “క్యాడెట్ కోర్”, “శ్రీమంతుల కుటుంబాలకు చెందిన యువతుల పాఠశాలల”ని పిలిచేవారు. అలాంటి సంస్థలలోచేరిన పిల్లలు రాజసమైన పద్ధతులలో పెరిగి పెద్దవారయ్యేవారు.

పిల్లలకు విద్య గరిపే విషయంలో సోషలిస్టు దేశం అంతకన్నా చక్కని పద్ధతిని రూపొందించాలి; ప్రజలకు ఆగర్భ శత్రువులైన ఒక రాజకులాన్ని తయారు చేయాలన్న దృష్టితోగాక, నూతన సమాజనిర్మాతలను తయారుచేయాలన్న లక్ష్యంలో ఆ పద్ధతిని మనం రూపొందించాలి; అభ్యుదయకర మానవాళికి మకుటాయమానంగా ముందుకు సాగిపోతున్న తమ దేశానికి నిస్వార్థభావంతో సేవచేసే యువతీ యువకులను తయారు చేసేందుకు ఉదాత్త భావాలను, మహోన్నతాశయాలను వారికి రంగరించి పోయాలి (దీర్ఘ హర్షధ్వానాలు).

ఆచరణలో మనం ఈ కర్తవ్యాన్ని ఎలా నిర్వర్తించాలి? శోభాయమానమైన ప్రకృతిదృశ్యాలుగల నగరపరిసరాలలోను, ఆరోగ్యానికి అనువైన వనప్రదేశాలలోను బోర్డింగ్ స్కూళ్ళను (వాటికి పేరుపెట్టే విషయమై కొంత ఆలోచించాలి) నిర్మించ పూనుకోటం ఉత్తమం. ఇలాంటి పాఠశాలల్లోని గదులు విశాలమైనవిగాను, శోభాయమానమైనవిగాను ఉండాలి; చక్కని పడకగదు లుండాలి; ఆధునికమైన భోజనశాలలు, అన్నిరకాలైన ఆట విడుపు కార్యకలాపాలకు అనువైన కేంద్రాలు నిర్మించాలి; ఆ విధంగా సోవియట్ దేశానికిచెందిన బాల శౌరులు అటు శారీర

కంగాను, ఇటు మానసికంగాను అభివృద్ధి చెందటానికి సకలావకాశాలు కల్పించాలి. తల్లిదండ్రులు కోరితే మాత్రమే వారి పిల్లలను ఇలాంటి బోర్డింగ్ స్కూళ్ళలో చేర్చుకోవాలి. పిల్లలు పాఠశాలలలో నివసిస్తుంటారు; తల్లిదండ్రులు సెలవుదినాలలోను, సెలవుల్లోను, లేదా పాఠ్య సమయం ముగిసినపిమ్మట వచ్చి తమ పిల్లలను చూసుకొని పోతుంటారు. మానవ హృదయ నిర్మాతలుఅన్న పేరుకు మూర్తులా తగినట్టి మంచి ఉపాధ్యాయులను మాత్రమే ఇలాంటి పాఠశాలలలో నియమించాలి.

ఈ పాఠశాలల్లో పిల్లలు చెల్లించేజీతాల పద్ధతి కనీసం ప్రారంభంలోనైనా క్రమానుగత ప్రాతిపదికపై ఉండాలి. అంతగా సంపాదన లేనటువంటి తల్లిదండ్రుల బిడ్డల, లేదా పెద్దపెద్ద కుటుంబాలను పోషించాల్సిన బాధ్యత నెత్తినపడిన తల్లిదండ్రుల బిడ్డల జీతాలను ప్రభుత్వమే భరించాలి. హెచ్చుఆదాయం వచ్చే తల్లిదండ్రులు తమ బిడ్డలకు విద్యాబుద్ధులు గరిపేందుకుఅయ్యేఖర్చులో కొంత భరించాలి. బోర్డింగ్ పాఠశాలల్లో తమ పిల్లలకు చదువుసంధ్యలు నేర్పుతూ ఇందుకోసం ప్రభుత్వం వ్యయంచేసిన డబ్బును కొంతమంది తల్లిదండ్రులు పూర్తిగా భరించాలి.

ఇలాంటి విద్యాబోధన పద్ధతికిగల అపారమైన ప్రాధాన్యం గురించి ఆట్టే వివరించి చెప్పనక్కరలేదు. ఈ విషయంలో ఎంత డబ్బు ఖర్చుచేయవలసి వచ్చినా, ఎంత కృషి సాగించవలసివచ్చినా తటపటాయించరాదు. ఎందుకంటే ఈ విషయమై ఖర్చుపెట్టే ప్రతిదమ్మిడీకి వందరెట్ల ప్రతిఫలం తిరిగి మనకు ముట్టు తుంది (హర్షధ్వానాలు).

విద్యారంగానికి సంబంధించిన మరొక పెద్ద సమస్యను పరిష్కరించటానికి కూడ మనం పూనుకోవాలి. తల్లిదండ్రుల కోరికమేరకు నర్సరీ, ప్రీస్కూల్ వయస్సులోని పిల్లలందరినీ చేర్చుకొనేందుకు ప్రభుత్వం నిర్వహించే నర్సరీ, కిండర్ గార్డెన్లలో అవకాశాలు కల్పించాలి. ఈ సమస్యను పూర్తిగా పరిష్కరించటానికి కొంతకాలం పట్టుతుందనుకోండి. అయితే వర్తమాన పంచవర్ష ప్రణాళికాకాలంలో ఈ సమస్యను పరిష్కరించేందుకు పెద్ద ఎత్తున కృషి ప్రారంభించాలి. గ్రామీణ ప్రాంతాలలో నర్సరీలను, కిండర్‌గార్డెన్‌లను నిర్మించి, వాటిని నిర్వహించే విష యంలో సమిష్టి వ్యవసాయ క్షేత్రాలు, అలాగే ప్రభుత్వసంస్థలుకూడా పాల్గొనాలి. పిల్లల బాగోగులు, వారి చదువు సంధ్యలు మొత్తం దేశానికంతటికీ సంబంధించిన సమస్య. ప్రవర్ధమానతరానికి కమ్యూనిస్టు విద్యాబుద్ధులు గరిపే విషయంలో మన సోవియట్ సమాజం యికముందు కూడా ప్రత్యేకమైన శ్రద్ధ తీసుకొంటూనే వుంటుంది (దీర్ఘ హర్షధ్వానాలు).

జాతీయార్థిక విధానంలోని శాఖలన్నింటికీ చెందిన నిపుణులను తయారుచేసే విషయంలో మన దేశంలో ఎంతో కృషి జరిగింది. అయిదో పంచవర్ష ప్రణాళికా కాలంలో మన కాలేజీలలోను, విశ్వవిద్యాలయాలలోను 11లక్షల 20వేల మందికిపైగా నిపుణులు పట్టాలు పొందారు; మరొకవిధంగా చెప్పాలంటే నాలుగో పంచవర్ష

ప్రణాళికా కాలంలోకన్న నూటికి 72 వంతులు ఎక్కువమంది నిపుణులు పట్టాలు పొందారు. సాయంసమయ కళాశాలల సంఖ్య, ఉత్తర ప్రత్యుత్తర కళాశాలల సంఖ్య ప్రత్యేకించి విస్తరిల్లాయి: అయిదో పంచవర్ష ప్రణాళికాకాలంలో అలాంటి కళాశాలలలో ఉత్తీర్ణులయిన నిపుణుల సంఖ్య 2,60,000 కు మించివుంది; అంటే గత పంచవర్ష ప్రణాళికాకాలంలోకన్నా నూటికి 170 వంతులకన్నా ఎక్కువమంది ఉత్తీర్ణులయ్యారన్నమాట. మధ్యరకానికి చెందిన నిపుణులకు శిక్షణయిచ్చే విషయంలో స్థితిగతులు బాగుపడ్డాయి.

నిపుణులకు శిక్షణగరిపే విషయంలో పరిమాణాత్మకాంశానికి సంబంధించినంత వరకు మనకు పూర్తి సంతృప్తి కలుగుతున్నప్పటికీ, గుణాత్మకాంశానికి సంబంధించినంతవరకు పరిస్థితి ఉండవలసినంత సంతృప్తికరంగాలేదని చెప్పాలి; కనుక ఆ అంశంపట్ల గట్టి శ్రద్ధవూనాలి. ఉన్నత విద్యాసంస్థలు ఆచరణ సంబంధమైన కృషినుంచి, ఉత్పత్తినుంచి వేరైపోవటం, ప్రస్తుత సాంకేతిక స్థాయికన్న వెనకబడివుండటం —ఇది పెద్ద లోపంగావుంది. నిర్దిష్టమైన ఆర్థిక విషయాలగురించి ఐతేనేమి, ఉత్పత్తి నిర్వహణకు సంబంధించిన విషయాలగురించి ఐతేనేమి యువక ఇంజనీర్లకు, వ్యవసాయ శాస్త్రజ్ఞులకు తగినంత పరిజ్ఞానాన్ని ఆ విద్యాసంస్థలు యిప్పటికీ యివ్వలేక పోతున్నాయి. విద్యార్థులకు ఒసగే ఆచరణయుక్తమైన శిక్షణను ప్రధానంగా మెరుగు పర్చాల్సిన అవసరం ఎంతోఉంది. విద్యార్థులు ఒకప్రక్క అధ్యయనంచేస్తూనే మరొక ప్రక్క వాస్తవికవిషయాలతోను, ఉత్పత్తితోను, ఫ్యాక్టరీలతోను, సమిష్టి-ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలతోను సంబంధాలు పెట్టుకొనేటట్లు, ఆ విధంగా ఉత్పత్తి అనుభవం సంపాదించేటట్లు విద్యాసంస్థల కృషిని పునర్వ్యవస్థీకరించాలి.

ఉన్నత విద్యాసంస్థల భౌగోళికపంపిణీ తప్పుడు పద్ధతిలో జరిగిందన్న విషయం యిక్కడ ప్రస్తావించాలి. ప్రధాన నగరాలైన మాస్కో, లెనిన్‌గ్రాడ్, కీవ్, తిబిలిసి, ఖార్కోవ్, బాకూ, టాష్కెంట్, మినిస్కు వంటి నగరాలలో మాత్రమే ఆ విద్యాసంస్థలు ప్రధానంగా కేంద్రీకృతమై వున్నాయి. దేశమందంతా పాఠశాలలను విస్తరింపచేయాలన్న ధోరణి మనకు కన్పించకపోగా, ఈ నగరాలలో మాత్రమే వాటన్నిటినీ యింకా కేంద్రీకరించాలన్న ధోరణి గోచరిస్తోంది. ఇలాంటి వ్యవహారం ఏమంత మంచిదికాదు. ఉన్నత విద్యాసంస్థల భౌగోళిక పంపిణీగురించి పునర్విచారణ చేయవలసిన సమయం ఆసన్నమైంది. ఉత్పత్తికేంద్రాలలో నిపుణుల అవసరం ఎక్కువగావున్న ప్రాంతాలలో వాటిని నెలకొల్పవలసిన తరుణం ఆసన్నమైంది.

వ్యవసాయ కళాశాలల భౌగోళిక పంపిణీ విషయంలో ప్రత్యేకంగా సహించరాని పరిస్థితి ఏర్పడింది; వాటిలో హెచ్చు కళాశాలలు పెద్దపెద్ద నగరాలలో కేంద్రీకృతమై వున్నాయి. దేశమంతటా వ్యవసాయ కళాశాలలను సక్రమంగా పంపిణీ చేయటానికి వ్యవసాయ మంత్రిత్వశాఖ, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాల మంత్రిత్వ శాఖ, ఉన్నతవిద్యా మంత్రిత్వశాఖ పూనుకొంటే మంచిది. ప్రతి వ్యవసాయ

కళాశాలక్రింద 2 వేల లేక మూడువేల హెక్టార్లుగల వ్యవసాయక్షేత్రాలు, మంచి మంచి పశుగణకేంద్రాలువుంటే మంచిదని వేరే చెప్పనక్కరలేదు. ఈ వ్యవసాయ క్షేత్రాలను విద్యార్థులే ప్రధానంగా నిర్వహించాలి. ఆ విధంగా జనరల్ విద్య, సిద్ధాంత పరిజ్ఞానంతోపాటు వ్యవసాయాన్ని సక్రమంగా నిర్వహించేందుకు అవసరమైన పరిజ్ఞానాన్ని, అనుభవాన్ని చక్కని ఆచరణయుక్తమైన శిక్షణద్వారా వారికి గరపవచ్చు (హర్షధ్వానాలు).

ప్రభుత్వ వ్యవసాయక్షేత్రాలను ఆధారంగా చేసుకొని కొత్తగా వ్యవసాయ కళాశాలలను నెలకొల్పే సందర్భాలలో ఫలప్రదమైన కృషిని సాగించేందుకు అనువైన చక్కని వసతులను అధ్యాపకవర్గానికి కల్పించాలి. వ్యవసాయ కళాశాలలను భౌగోళిక ప్రాతిపదికపై సక్రమంగా పంపిణీ చేసేందుకు తక్షణం పూనుకోవాలి.

ఇదేవిధంగా వైద్యకళాశాలలను, ట్రెయినింగ్ కళాశాలలను పంపిణీచేసే విషయంకూడా ఆలోచించాలి; వివిధ రిపబ్లిక్‌లలోను, ప్రదేశాలలోను, మండలాలలోను వైద్యులకు, ఉపాధ్యాయులకు గరిపే శిక్షణను మెరుగుపర్చాలన్న దృష్టితో ఈ విషయం ఆలోచించాలి.

ఉత్తరప్రత్యుత్తర, సాయంసమయ కళాశాలలను యింకా ఎక్కువగా నెలకొల్పి, వాటి కృషిని మెరుగుపర్చాలి. ఫ్యాక్టరీ, ఆఫీసు, తదితర కార్మికులు చదువు సంధ్యలు ఆర్జించేందుకు సాధ్యమైనంత ఎక్కువగా మనం అవకాశాలు కల్పించాలి. ఉత్పత్తికి సంబంధించిన లోతుపాతులు ఎరిగినవారిని ఇంజనీరింగ్ సాంకేతిక నిపుణులుగా తయారుచేయటానికి అదొక్కటే చక్కని పద్ధతిఅని అనుభవంలో రుజువైంది. ఇకముందు ప్రతి సంవత్సరం అనేక వేలమంది యువతీయువకులు తమ ఉన్నత విద్యను పూర్తిచేసుకొని వ్యావసాయిక పారిశ్రామిక రంగాలలో ప్రవేశిస్తుంటారు. కనుక ఉన్నతవిద్యను ఉత్తరప్రత్యుత్తర పద్ధతిపై వ్యాపింపచేయటానికి అపారావకాశాలు ఏర్పడనున్నాయి.

జాతీయార్థిక విధానంలోని వివిధ శాఖలకు సంబంధించిన నిపుణులకు శిక్షణ గరపటంలో ఒక విడ్డూరమైన విషయం కన్పిస్తోంది. ఆయాశాఖల అభివృద్ధికిగల అవకాశాలనుబట్టి కాక, మంత్రిత్వశాఖలు, తదితర సంస్థలు ఆధార రహితంగా చేసే అపసవ్యమైన అభ్యర్థనలను పురస్కరించుకొని ఆయా శాఖలకు సంబంధించిన నిపుణుల సంఖ్య నిర్ణయించబడుతోంది. దీని ఫలితంగా ఆర్థిక, సాంస్కృతిక శాఖలకు చెందినకొన్నింటిలో నిపుణులకు కొరతఏర్పడటం, మరికొన్నింటిలో మిగులుఏర్పడటం సంభవిస్తోంది. దేశంలోని ఆయా మండలాల విశిష్ట లక్షణాలను పరిగణనలోకి తీసుకోకుండా, ఎక్కడ ఏ జిల్లాలలో,ఏ ఫ్యాక్టరీలలో నిపుణులు పని చేస్తారుఅన్న విషయాన్ని పరిగణనలోకి తీసుకోకుండా, నిపుణులకు శిక్షణ గరుపుతూండటం ఒక పెద్ద లోపంగా పేర్కొనాలి; ఈ లోపాలన్నింటినీ తొలగించుకొనేందుకు గట్టి కృషి చేయాలి.

కాౖమేడ్స్, సోవియట్ సోషలిస్టు వ్యవస్థకన్నా విజ్ఞాన శాస్త్రాభివృద్ధిని అందుకు అవసరమైన పరిస్థితులను కల్పించడం పరమాశయంగా పెట్టుకొనే సామాజిక వ్యవస్థ మరొకటి వుండదు. మన శాస్త్రవేత్తలు కమ్యూనిస్టుపార్టీ, సోవియట్ ప్రభుత్వాల సహకారాన్ని నిరంతరం, పెద్ద ఎత్తున పొందుతున్నారు. అనేక శాస్త్ర విషయాలలో, భౌతిక శాస్త్రంలోను, భూగర్భ గణితశాస్త్రాలలోను, మెకానిక్స్, ఖగోళ శాస్త్రాలలోను, జంతు శాస్త్రంలోను, వ్యవసాయ శాస్త్రానికి సంబంధించిన కొన్ని శాఖలలోను వారు అమోఘమైన ఫలితాలు సాధించారు.

అణుశక్తిని సాధించే సమస్యను సోవియట్ శాస్త్రజ్ఞులు బహుకొద్దికాలంలోనే అత్యద్భుత పద్ధతిలో పరిష్కరించారు. వారు మన దేశంయొక్క విద్యుచ్ఛక్తి వనరులను యితోధికంచేస్తున్నారు. జాతీయార్థికవిధానాన్ని అభివృద్ధిచేయటంలో జయప్రదమైన కృషి నిర్వహిస్తున్నారు; మన మాతృదేశరక్షణస్తోమతను పటిష్ఠం చేస్తున్నారు. వారి కృషిఫలితంగానే సాంకేతికభావ సంపదకు చెందిన విద్యుచ్ఛక్తి గుణకారయంత్రాలు, యితర పరికరాలు, మెకానిజమ్స్‌కంటె అత్యద్భుత వస్తువులు తయారవుతున్నాయి. శాస్త్ర, సాంకేతిక విషయాలకు సంబంధించిన అనేక యితర క్లిష్టసమస్యలపైనకూడా జయప్రదంగావారు కృషి సాగిస్తున్నారు. మనశాస్త్రవేత్తలు సాగిస్తున్న ఫలప్రదమైన కృషికి ఈ మహాసభ వేదికనుంచి ప్రజలతరఫున ప్రగాఢమైన గౌరవభావం వ్యక్తంచేసేందుకు అనుమతించండి (మిన్నుముట్టే దీర్ఘహర్షధ్వానాలు).

సోవియట్ విజ్ఞానశాస్త్రం మహత్తరమైన తిరుగులేని విజయాలనే సాధించింది. అయితే మన విజ్ఞాన శాస్త్రసంస్థలలో కొన్నిటి కృషిలోగల పెద్ద పెద్ద లోపాలను మనం అలక్ష్యం చేయజాలం. సోవియట్ విజ్ఞాన శాస్త్రానికి సంబంధించిన కొన్ని శాఖలు వృద్ధిచెందుతున్న జాతీయార్థికావసరాలకు అనుగుణంగా అభివృద్ధిచెందటంలేదు; కాగా, కొన్ని రంగాలలో ఇతర దేశాలు సాధించిన శాస్త్ర విజయాలకన్నా మనం వెనకబడివున్నాం.

ఈ లోపాలకుగల కారణాలలో ఒకటి అనేక విజ్ఞాన శాస్త్రసంస్థలకు, ఆచరణయుక్తమైన కార్యకలాపాలకు (అంటే ఉత్పత్తికి) మధ్య బలహీనమైన సంబంధాలు వుండటమేనని చెప్పాలి. ఆచరణరీత్యా గొప్ప ప్రాధాన్యంలేని సమస్యలపైననే కొన్ని విజ్ఞానశాస్త్రసంస్థలు కృషి సాగిస్తున్నాయి. మన అభివృద్ధిలో సంతరింపచేసుకొన్న అనుభవాన్ని అవి సూత్రీకరించడంలేదు. ఆర్థిక, ప్రకృతి పరిస్థితులను పరిగణనలోకి తీసుకోటంద్వారా శాస్త్రసంస్థల, ప్రయోగకేంద్రాల భౌగోళిక పంపిణీ జరగటంలేదు. అనేక ప్రయోగాత్మక సంస్థలు, ఉన్నత విద్యాసంస్థలు కృషి సాగించవలసిన విషయాలకు చాలా దూరంలో నెలకొల్పబడ్డాయి. ఉదాహరణకు మాస్కోలో మూడు ఓషనోగ్రాఫిక్, మెరైన్ పరిశోధనా సంస్థలు, మెరైన్ హైడ్రోఫిజికల్ ఇన్‌స్టిట్యూట్, ఓషనాలజీ ఆఫ్ యు. ఎస్. ఎస్. ఆర్. ఉన్నాయి. మరి రెండు మైనింగ్ ఇన్‌స్టిట్యూట్లు - ఒకటి సోవియట్ విజ్ఞానశాస్త్ర పరిషత్ ఆధ్వర్యాన, మరొకటి బొగ్గుపరిశ్రమ మంత్రిత్వశాఖ ఆధ్వర్యాన- మాస్కో

నగరంలోనే వున్నాయి. మాస్కో సముద్రానికి, వారొబ్లోవి కొండలకు అవి శాస్త్ర తలకుమించిన బరువుగా లేవా? (నవ్వు, హర్షధ్వానాలు) ఈ పరిస్థితిని మనం చక్క దిద్ది, ఏ విషయాలలో అయితే ప్రయోగాత్మక సంస్థలు, కళాశాలలు కృషిచేయవలసి వుంటుందో ఆ విషయాలకు దగ్గరలో వాటిని నెలకొల్పేటట్లు చూడాలి.

విజ్ఞాన శాస్త్ర పరిషత్‌కు చెందిన ప్రయోగాత్మక సంస్థల కృషికీ, పరిశ్రమలకు చెందిన ప్రయోగాత్మక సంస్థల కృషికీ, ఉన్నత విద్యాసంస్థల కృషికీ మధ్య ఎలాంటి సంబంధం, సమన్వయం లేకపోవటం పూర్తిగా సహించరాని విషయం. అత్యంత ప్రధానమైన శాస్త్రీయ, సాంకేతిక సమస్యలను పరిష్కరించేనిమిత్తం విజ్ఞానశాస్త్ర శక్తులన్నింటినీ కేంద్రీకరించటానికి అది అవరోధంగా వుంటోంది; హానికరమైన పోటీకి అది దారి తీస్తోంది; దండుగమారి ఖర్చుకు కారణభూతమవుతోంది; జాతీయ ఆర్థిక విధానంలో శాస్త్రీయ, సాంకేతిక విజయాలను ప్రవేశపెట్టడానికి అది ఆటంకంగా తయారవుతోంది.

సోషలిస్టు సంస్కృతిని పెంపొందించేందుకు మనం నిరంతరం శ్రద్ధ వహించాలి; సోవియట్ విజ్ఞాన శాస్త్రాన్ని నిరవధికంగా ముందుకు తీసుకుపోవాలి; కమ్యూనిజాన్ని నిర్మించటంలో మనలను ఎదుర్కొనే ఆచరణ సంబంధమైన కర్తవ్యాలను పరిష్కరించటంలో సోవియట్ విజ్ఞాన శాస్త్రం నిర్వహిస్తున్న పాత్రను యితోధికంచేయాలి.



# సోవియట్ సామాజిక, రాజ్యాంగ వ్యవస్థను యింకా పటిష్ఠతరమొనర్చి, పెంపొందించాల్సిన ఆవశ్యకత



కామ్రేడ్స్, 19వ పార్టీ మహాసభకు, 20వ పార్టీ మహాసభకు మధ్యకాలంలో మన ప్రజలయొక్క నైతిక, రాజకీయ ఐక్యమత్యాన్ని మరింత పటిష్ఠతర మొనర్చటం అన్నది సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీ సాధించిన అతి ప్రధాన ఫలితాలలో ఒకటి అని చెప్పవచ్చు. ఈ ఐక్యమత్యం, కమ్యూనిస్టుపార్టీ, సోవియట్ ప్రభుత్వమూ అనుసరిస్తున్న వైదేశిక, దేశీయ విధానాలకు సోవియట్ యూనియన్ ప్రజలంతా యిచ్చిన హృదయపూర్వక సహకారం మన ప్రజలు సాగిస్తున్న మహత్కార్యాలన్నిటిలోను వ్యక్తమవుతోంది.

కార్మికవర్గానికి, రైతాంగానికిమధ్య పార్టీ నెలకొల్పిన అవిచ్ఛిన్నమైన సంఘటనే మొత్తం సోవియట్ సమాజంయొక్క నైతిక రాజకీయ ఐక్యమత్యానికి మూలకందంగా వుంది. ఆ ఐక్యమత్యం మేరుపర్వతం వంటిది. పారిశ్రామిక రంగంలోను, వ్యావసాయిక రంగంలోను పార్టీ ప్రధానమైనచర్య పైకొన్న ఫలితంగా పట్టణ, గ్రామీణ ప్రజల జీవనస్థితిగతులు మరింత అభివృద్ధిచెందాయి; ఉత్పత్తి నిర్వాహణలో కార్మికవర్గానికి, సమిష్టి వ్యవసాయదారులకుమధ్య సహకారం యితోధికమైంది; ప్రజాసామాన్యంయొక్క సృజనాత్మక కార్యకలాపాలను పెంపొందించటానికి తోడ్పడింది.

## 1. మన జాతీయ కార్యపథానికి సంబంధించిన కొన్ని సమస్యలు

సోవియట్ యూనియన్‌లోగల జాతులన్నింటి మధ్య సోదర మైత్రిని పటిష్ఠతర మొనర్చి, పెంపొందించేందుకు కమ్యూనిస్టుపార్టీ అహర్నిశలు కృషిచేస్తోంది. ఎందుకంటే సోవియట్ రాజ్యాంగ వ్యవస్థ కలిమికీ, బలిమికీ ఆ మైత్రియే పెట్టని కోటగా వుంటుంది.

తన జాతీయ కార్యవిధానానికి సంబంధించినంతవరకు లెనిన్ మహనీయుని ఉపదేశాన్ని కమ్యూనిస్టుపార్టీ శిరసావహిస్తూ వచ్చింది; ఇకముందుకూడా శిరసావహిస్తూ

వుంటుంది. “వివిధ జాతుల ప్రయోజనాలను కంటిలో పాపలాగా చూసుకొంటున్నప్పుడు మాత్రమే సంఘర్షణలకు తావులేకుండా పోతుంది; పరస్పర అపోహాలు తొలగిపోతాయి...” (33 వ సంపుటి; 349 వ పేజీ). జారిస్టు రష్యాలో వివిధ జాతుల మధ్యగల పరస్పర అపోహాలను తొలగించటంలో మన పార్టీ కృతకృత్యమైంది; సోదర మైత్రీ సంబంధాలద్వారా సోవియట్ యూనియన్‌లోని జాతులన్నింటినీ ఒక త్రాటిపైకి తేగల్గింది. ఆ జాతుల ప్రయోజనాలను, వాటి వాటి విశిష్ట జాతీయ లక్షణాలను, వాంఛలను కంటిలో పాపలాగా పార్టీ చూసుకొంటూవచ్చినందువల్లనే పై మహాత్కార్యాన్ని పార్టీ సాధించగల్గింది; ఒకప్రక్క ఇలాంటి కృషి సాగిస్తూనే మరొకప్రక్క వివిధ జాతులకు చెందిన శ్రామిక జనానీకంలో సోషలిస్టు సమూహ భావాన్ని, దేశమంతటి ప్రయోజనాలపట్ల శ్రద్ధ పూనాల్సిన ఆవశ్యకతను పార్టీ ప్రచారంచేసింది. తత్పర్యవసానంగా, అంతకు పూర్వం పాత రష్యాలో ఏడనకు గురియవుతూ, ఎంతో వెనకబడియున్న జాతులు అపారాభివృద్ధిని సాధించగలిగాయి. సోవియట్ యూనియన్ మిత్ర జాతుల కుటుంబంలో సరిసమానమైన స్థానం సంపాదించుకున్నాయి.

సోదర యూనియన్ రిపబ్లిక్‌లకు చెందిన జాతీయార్థిక అభివృద్ధిని తెలియజేసే కొన్ని సంఖ్యావివరాలను యిక్కడ పేర్కొంటాను: 1913 తో పోల్చితే, 1955లో కజఖ్ సోవియట్ సోషలిస్టు రిపబ్లిక్ మొత్తం పారిశ్రామికోత్పత్తి 33 రెట్లు, జార్జియన్ సోవియట్ రిపబ్లిక్ పారిశ్రామికోత్పత్తి 27 రెట్లు, కిర్ఘిజ్ సోవియట్ రిపబ్లిక్ పారిశ్రామికోత్పత్తి 37 రెట్లు, ఆర్మేనియన్ సోవియట్ రిపబ్లిక్ పారిశ్రామికోత్పత్తి 41 రెట్లు, తజిక్ సోవియట్ రిపబ్లిక్ పారిశ్రామికోత్పత్తి 24 రెట్లు పెరిగింది.

మన రిపబ్లిక్కులు తమ జాతీయ సంస్కృతిని అభివృద్ధి చేసుకోటంలో అపారమైన పురోభివృద్ధిని సాధించాయి. యుద్ధాత్పూర్వపు దశతో పోల్చిచూస్తే, ఉచిత విద్యను పొందిన నిపుణుల సంఖ్య కజఖ్‌స్తాన్‌లో 3.8 రెట్లు, కిర్ఘిజియాలో 4.8 రెట్లు, తజిక్‌స్తాన్‌లో 3.4 రెట్లు, మోల్డావియాలో 3.4 రెట్లు, తుర్క్‌మేనియాలో 3.3 రెట్లు, ఎస్తోనియాలో దాదాపు మూడు రెట్లు పెరిగింది. అదేకాలంలో యూక్రేనియిన్‌లోని విజ్ఞాన శాస్త్రజ్ఞుల సంఖ్య 1.5 రెట్లు, లాట్వియన్ సోవియట్ రిపబ్లిక్‌లోను, అజర్‌బైజాన్ సోవియట్ రిపబ్లిక్‌లోను రెండు రెట్లకన్నా ఎక్కువగాను, కజఖ్‌స్తాన్‌లో 2½ రెట్లకన్నా ఎక్కువగాను, ఎస్తోనియన్ సోవియట్ రిపబ్లిక్‌లో దాదాపు మూడురెట్లు, లిథ్వేనియన్, కార్లో-ఫిన్నిష్ సోవియట్ రిపబ్లిక్‌లలో మూడు రెట్లకుపైగాను పెరిగింది.

యూనియన్ రిపబ్లిక్‌లు త్వరితగతిని ఆర్థిక, సాంస్కృతికాభ్యున్నతిని సాధిస్తున్నందువల్ల జాతీయార్థిక, సాంస్కృతికాభివృద్ధికి సంబంధించిన నాయకత్వాన్ని మెరుగుపర్చే విషయానికిచెందిన సమస్యలు కొన్ని చర్చనీయాంశాలై కూర్చున్నాయి.

ఇంతకుపూర్వం, స్థానికంగా బహుకొద్దిమంది నిపుణులుమాత్రమే వున్నప్పుడు, అనేక రిపబ్లిక్‌లలో నాయకత్వస్థానాలలోగల కార్యకర్తలు ఉన్నతస్థాయి చేసుకో

నప్పుడు - అందులోనూ ఆస్తేపరిశ్రమలుకూడా లేనప్పుడు—యూనియన్ మంత్రిత్వ శాఖలద్వారానే దాదాపు పరిశ్రమలన్నీ నిర్వహింపబడుతూండేవి. కాని, ఈనాటి పరిస్థితివేరు. యూనియన్ రిపబ్లిక్‌లలో పరిశ్రమలు అభివృద్ధి చెందటంతోపాటే ప్రజలూ అభివృద్ధిచెందారు; జాతీయ కార్యకర్తలు ముందుకు వచ్చారు; జనరల్‌గా సోవియట్ యూనియన్‌లోని ప్రజలందరి సాంస్కృతికస్థాయి పెద్దగాఅభివృద్ధిచెందింది. కొత్త పరిస్థితులలో ఆర్థిక వ్యవహారాలను పాతపద్ధతులతో నిర్వహించటం సాధ్యం కాదు. ఆ పద్ధతులను కొంతవరకు మార్చుకోవలసి వుంటుంది. సాధారణ సారధ్యానికిచెందిన అధికారాలను, ప్రణాళికలో చేర్చవలసిన లక్ష్యాలను నిర్ణయించటం, వాటి నిర్వహణపై తనిఖీ, యంత్ర పరికరాల సరఫరా, పెట్టుబడి సొమ్మును సమకూర్చటం వంటి అధికారాలను యూనియన్ మంత్రిత్వశాఖలకు వదిలిపెట్టుతూ, అదేసమయంలో రిపబ్లిక్ మంత్రిత్వశాఖల అధికారాలను గణనీయంగా విస్తరింపచేయాలి.

ఇటీవల పార్టీ కేంద్రకమిటీ ఈ విషయంలో అనేక చర్యలు చేకొన్నది. వాటిలో ప్రత్యేకంగా పేర్కొనదగినవి: రిపబ్లిక్ మంత్రిత్వశాఖలను నెలకొల్పటం, యుక్రేనియన్‌లో ఇనుము, ఉక్కు, బొగ్గు పరిశ్రమల మంత్రిత్వశాఖను, అజర్‌బైజాన్‌లో నూనె మంత్రిత్వశాఖను, కజఖ్‌స్తాన్‌లో నాన్ ఫెర్రస్ లోహపరిశ్రమ మంత్రిత్వశాఖను నెలకొల్పి, ఆయా రిపబ్లిక్‌లలోని ఆయా పరిశ్రమలను వాటికి అప్పజెప్పటం జరిగింది. ఈ చర్యల ఫలితంగా రిపబ్లిక్‌ల పరిశ్రమ కొంతవరకూ హెచ్చింది. ఈనాడు యుక్రేన్‌లో జరుగుతున్న మొత్తం పారిశ్రామికోత్పత్తిలో దానివాటా నూటికి 67 వంతులు, కజఖ్‌స్తాన్‌లో నూటికి 62 వంతులు, అజర్‌బైజాన్‌లో నూటికి 80 వంతులు ఉంది.

ఇలా చేయటం సరియైనదేనని అనుభవం ఖచ్చితంగా రుజువుచేసింది. పరిశ్రమల నిర్వహణ మరింత నిర్దిష్టంగావుంది; మరింత చక్కగా సాగుతోంది. రిపబ్లికన్ సంస్థల చొరవ గమనార్హంగా పెంపొందింది; పరిశ్రమలకు సంబంధించిన కృషిలో అవి మరింత బాధ్యతాయుతంగా పాల్గొంటున్నాయి. ఇదేవిధమైన కృషి యికముందు కూడా సాగాలి. దానివల్ల స్థానికంగా సృజనాత్మకమైన చొరవ అధికంగా పెల్లుబుకుతుంది; యూనియన్ రిపబ్లిక్‌లు బలవత్తరమవుతాయి; మన దేశంలోని వివిధ జాతుల మధ్య మైత్రి మరింత పటిష్ఠమవుతుంది.

యూనియన్ రిపబ్లిక్‌ల ఆర్థికాభివృద్ధికి సంబంధించిన మరికొన్ని ఆచరణయుక్తమైన సమస్యలను కూడా జాగ్రత్తగా పరిశీలించాలి. ఉదాహరణకు ఈ క్రింది సమస్యనే తీసుకొందాం. ఒకానొక రిపబ్లిక్‌లో సమిష్టి వ్యవసాయక్షేత్రాల ఆదాయాలు, సమిష్టి వ్యవసాయదారుల ఆదాయాలు ఇరుగుపొరుగునవున్న రిపబ్లిక్కులలోకన్న చాలా యెక్కువగా వున్నాయన్న విమర్శలు మనం ఒక్కొక్కప్పుడు వింటుంటాం. బాగా పెంపొందించవలసిన వ్యవసాయపంటల ఉత్పత్తిని మనం ప్రోత్సహించకుండా ఉండజాలమని వేరే చెప్పనవసరంలేదు. అయితే అలాంటి

ప్రోత్సాహ మివ్వదలుచుకొన్నప్పుడు సమిష్టిశ్రేయస్సును దృష్టిలో వుంచుకొని, అన్ని యూనియన్ రిపబ్లిక్‌లకు తెలియజేయటం, వాటి ఆమోదం పొందటం అవసరం. దీని నిమిత్తం ప్రతి రిపబ్లిక్‌లోని ఆర్థికవిధానాన్ని లోతుగా తరచిన చూడటం అవసరం. వివిధ రిపబ్లిక్‌లలోని పరిస్థితులను పోల్చిచూసి, సక్రమమైన నిర్ణయాలు చేయగలిగిన, వివిధజాతుల ప్రతినిధులతో కూడిన, వివిధ రిపబ్లిక్‌ల ప్రతినిధులతో కూడిన ఏజెన్సీలద్వారానే ఆ పని చేయించాలి.

ఉదాహరణకు సుప్రీం సోవియట్‌లో వివిధజాతులకు ప్రాతినిధ్యం వహించే సభ తాలూకు ఆర్థిక వ్యవహారాల సమితి అలాంటి ఏజెన్సీగా వ్యవహరించవచ్చు. వివిధ రిపబ్లిక్‌లకు చెందిన సమర్థవంతులైన ప్రతినిధులతోను, ప్రముఖ ఆర్థికవేత్తల తోను - రిపబ్లిక్‌లలోని ఆర్థిక విధానాలవిషయం వాటికి బాగా తెలిసివుంటుంది— ఏర్పడే ఈ సమితి ఆ యా వ్యవసాయ పంటల ఉత్పత్తికి వెచ్చించే శ్రమనుగురించి పరిశీలిస్తుంది. ఆ పరిశీలనను ఆధారంచేసుకొని వ్యవసాయ సరుకుల కొనుగోలు ధరలను సిఫారసు చేస్తుంది. అప్పుడు ఈ సమితి సిఫారసులను యూనియన్ రిపబ్లిక్‌లు చర్చిస్తాయి; అవి ఆమోదించబడితే శాసన సంబంధమైన కార్యనిర్వాహక సంస్థలకు పంపబడతాయి. ఒకానొక పంటను ప్రోత్సహించే నిమిత్తం కొన్ని చర్యలు తీకొన బడ్డాయన్న సంగతి అప్పుడు అందరికీ అవగతం అవుతుంది: ఆర్థిక లాభం దృష్ట్యా, దేశంలోని సకలజాతుల ప్రయోజనాలదృష్ట్యా ఆ చర్యలు తీసుకోటం అవసరమన్న విషయం అందరికీ తెలిసివస్తుంది.

లేదా, వివిధ యూనియన్ రిపబ్లిక్‌లమధ్య బడ్జెట్‌లో కేటాయించిన నిధులను పంపిణీచేయటాన్నే తీసుకోండి. మొత్తంమీద ఆ నిధులపంపిణీ సక్రమంగాజరుగుతూ, ఇప్పటికే ఈ విషయంలో రిపబ్లిక్‌ల పాత్రను, అధికారాన్ని యినోధికంచేసే విషయం మనం తీవ్రంగా ఆలోచించాలి. ప్రజావిద్య, ఆరోగ్య సౌకర్యాలు, గృహ నిర్మాణం, సాంస్కృతిక, తదితర సంస్థల నిర్మాణం, నగరాభివృద్ధి మున్నగువాటికి కేటాయించిన మొత్తాలను పంపిణీచేయటంలో యింతవరకు సరియైన పద్ధతిని అవలం బించుటలేదని కొంతమంది కామ్రేడ్స్ ఫిర్యాదు చేశారు. దీని ఫలితంగా కొన్ని రిపబ్లిక్‌లకు సంబంధించినంతవరకు అప్రోప్రియేషన్స్‌లో వివరించవీలులేని వ్యత్యాసం కొన్ని సందర్భాలలో మనకు కన్పిస్తోంది.

ఇలాంటి వ్యవహారం సాధారణమైన విషయమేనా? ఎంతమాత్రం కాదు. అందరికీ సరిసమానమైన హోదావుండాలనే ప్రాతిపదికకే అది తూట్లు పొడుస్తుంది. ఈ విషయంలో సరిసమానమైన హోదా అంటే అర్థం ఏమిటి? బడ్జెట్‌లో కేటా యించిన నిధులను పంపిణీ చేయటంలో ఉమ్మడి సూత్రాన్ని పాటించాలి అన్నదే అది; ఈ సూత్రాన్ని కనక పాటిస్తే, వాస్తవికమైన సూచనలను ఖచ్చితంగా ఆధారం చేసుకొని మొత్తాలు కేటాయించటం జరుగుతుంది. ఉదాహరణకు జనాభాలో ప్రతి ఒక తలకు యింత మొత్తమనో, జాతీయార్థిక విధానంలో వాస్తవంగా పనిచేసే ప్రతి వ్యక్తికి యింతమొత్తం చొప్పున అనో నిధులు కేటాయించవచ్చు.

యూనియన్ రిపబ్లిక్‌ల అధికారాలను విస్తరింప చేయాల్సిన అవసరాన్ని గురించి చర్చించేటప్పుడు కేంద్రీకృత ప్రణాళికారచనయొక్క ఆవశ్యకతను మనం వివరించవలసివుంటుంది. మన దేశమూ, సోవియట్ యూనియన్‌లోని ప్రతి రిపబ్లిక్ జయప్రదంగా వృద్ధిచెందుతూండాలంటే, అందుకు సోవియట్ ప్రజలందరి సమైక్యకృషి అత్యవసరమన్న విషయాన్ని మనం గుర్తుంచుకోవాలి; రిపబ్లిక్‌లు విస్తృతిమైన చొరవను, స్వతంత్ర కార్యాచరణను ప్రదర్శించేటట్లు చేయటంతోపాటు కొంతవరకు మన జాతీయార్థిక విధానాన్ని కేంద్రీకృతమొనర్చవలసి వుంటుంది. ప్లానింగ్ సూత్రంవల్ల సోషలిస్టు ఆర్థిక వ్యవస్థకు ఎనలేని సదవకాశం లభిస్తుంది. ఈ అవకాశాన్ని మనం జారవిడుచుకోటం లేదు; జారవిడుచుకోబోము. ఒకప్రక్క జాతీయార్థిక విధానాన్ని క్రమబద్ధంగా నడుపుకోటాన్ని మెరుగుపర్చుకుంటూనే, మరొకప్రక్క వివిధ రిపబ్లిక్‌ల ఆర్థికావసరాలను, వాటి ఆర్థిక సాంస్కృతికాభివృద్ధి లక్ష్యాలను జాగ్రత్తగా పరిశీలిస్తుండాలని, రిపబ్లిక్‌ల జీవితంలో ఉత్పన్నమయ్యే ప్రతి కొత్తవిషయాన్ని సకాలంలో గమనించి పరిగణనలోకి తీసుకోవాలనీ మాత్రమే మనం భావిస్తున్నాం. యూనియన్ రిపబ్లిక్‌ల విషయంలో సంరక్షకచర్యలను తీసుకోటాన్ని అనుమతించరాదు. యూనియన్ల జాతీయార్థిక ప్రణాళికల్లో పేర్కొన్న పరిమితులకు లోబడి, ఆయా రిపబ్లిక్‌లు తమ తమ విషయాలను తామే స్వయంగా నిర్ణయించుకోవాలి; తమ ఆర్థిక విధానంలో ఆయా శాఖల అభివృద్ధికి సంబంధించిన నిర్దిష్ట సమస్యలను అవే పరిష్కరించుకోవాలి. ఈ విధంగా చేసినందువల్ల ప్రతి రిపబ్లిక్ సార్వభౌమాధికారం మరింత ఎక్కువగా పటిష్ఠమవుతుంది; వివిధ రిపబ్లిక్‌లమధ్య పరస్పర విశ్వాసం పెంపొందుతుంది; స్థానికంగావున్న వనరులను ఉపయోగించటంలో ప్రతి రిపబ్లిక్ చొరవను పూర్తిగా పెంపొందించటానికి సహాయకారిగా వుంటుంది.

సోషలిజం, జాతీయ విభిన్నతలను, విశిష్ట లక్షణాలను తుడిచిపెట్టదు సరిగదా, వివిధజాతుల ఆర్థిక, సాంస్కృతిక సర్వతోముఖాభివృద్ధికే, వికాసానికే భద్రత చేకూరుస్తుంది. అందుచేత విశిష్ట లక్షణాలను, విభిన్నతలను మనం విస్మరించరాదు; ఆర్థిక, సాంస్కృతికాభివృద్ధి కృషికి నాయకత్వం వహించే సందర్భంలో వీటిని ప్రత్యేకంగా దృష్టిలో వుంచుకోవాలి.

జాతీయ సమస్యనుగురించి కొంతమంది కామ్రేడ్స్‌లో స్పష్టమైన అవగాహన లేదని ఈ సందర్భంలో ప్రస్తావించవలసి వుంటుంది.

ఉదాహరణకు సోవియట్ దేశభక్తి, అంతర్జాతీయత అన్న సమస్యనే తీసుకోండి. ఈ సమస్యపై సంపూర్ణమైన స్పష్టాభిప్రాయం ఏర్పరచుకోటం చాలా ముఖ్యం. మన దేశంలో జాతీయ విధానాన్ని లెనిన్ బోధించినట్లు, సక్రమంగా అమలుజరపటానికి మాత్రమేకాక, ఇతర దేశాలలోని శ్రామిక ప్రజలందరితోను, మన సోషలిస్టు శిబిరంలోని యితరులందరితోసహా, సరియైన పద్ధతిలో సంబంధాలు పెంపొందించేందుకుకూడా అది అవసరం. తమ మాతృదేశంపట్ల ప్రేమను కలిగి

వుండటంఅన్నది కార్మికవర్గ అంతర్జాతీయతకు, సోషలిస్టు అంతర్జాతీయతకు విరుద్ధమైనదని దురదృష్టవశాత్తు మనలో కొంతమంది కామ్రేడ్స్ తలుస్తున్నారు. అలాంటి వ్యాఖ్యానం ప్రజల జాతీయ భావాలను కించపరుస్తుంది; సోషలిస్టు జాతులమధ్య సహకారం పెంపొందించటానికి అది సహాయకారి కాదు; వివిధ దేశాలలోని శ్రామిక ప్రజల అంతర్జాతీయ సౌహార్దతను పెంపొందించటానికి అదితోడ్పడదు.

ఈ సందర్భంలో వ్లాడిమర్ ఇల్యిచ్ లెనిన్ చెప్పినమాటలను గుర్తు చేస్తాను. 1914లో మొదటిప్రపంచయుద్ధం ముమ్మరంగా సాగుతున్న రోజులలో, యూరపియన్ దేశాలన్నింటా జాతీయ దురహంకారం, బూర్జువా జాతీయతావాద కల్మషం వరదలై పారుతున్న సమయంలో, మన పార్టీ ఒక్కటే కార్మికవర్గ అంతర్జాతీయ పతాకాన్ని పైకెత్తి నిలబెట్టింది. ఆ సమయంలో మన పార్టీనాయకుడు లెనిన్ ఇలా వ్రాశాడు: "వర్గచైతన్యం గల మనకు, రష్యన్ కార్మికవర్గానికి చెందిన మనకు జాతీయాభిమానం పరతత్వ స్వభావం కల్గినదా? కానేకాదు; మన భాషను, మన దేశాన్ని మనం ప్రేమిస్తాం. దాని శ్రామిక జనావాళిని (దాని జనాభాలో పదింట తొమ్మిది వంతులు వారే.) చైతన్య ప్రదీప్తమైన ప్రజాతంత్రవాదులుగా, సోషలిస్టులుగా మార్చేందుకు మనం శాయశక్తులా కృషి చేస్తున్నాం" (21వ సంపుటి; 85వ పేజి).

సోషలిస్టు దేశాలమధ్య సోదర సంబంధాలను పటిష్ఠతర మొనర్చేందుకు గల సిద్ధాంత ప్రాతిపదికే సోషలిస్టుదేశభక్తికీ, అంతర్జాతీయతకూ గల అవినాభావ సంబంధం. గతంలో మన పార్టీ దీనినే శిరసావహించింది; ఇక ముందుకూడా తన కార్యవిధానం విషయంలో దీనినే శిరసావహిస్తూ వుంటుంది.

ప్రజలలో కార్మికవర్గ అంతర్జాతీయను గురించి పెద్ద ఎత్తున ప్రచారం కావించటానికి గతంలో మనం శాయశక్తులా కృషిచేశాం; ఇక ముందూ అలాగే చేస్తాం; తద్వారా యూనియన్ రిపబ్లిక్ లన్నింటి జాతీయార్థికాభివృద్ధిని దోహదపర్చుతున్నాం; వాటి సంస్కృతిని (జాతీయరూపంలో సామ్యవాదం సారాంశం) మరింతగా పెంపొందించేందుకు పాటుబడ్డాం. అదే సమయంలో బూర్జువా సిద్ధాంత ధోరణులన్నింటినీ, జాతీయవాదంతో సహా, మనం గట్టిగా ఎదిరించాలి; మన కమ్యూనిస్టు సిద్ధాంత పరిశుద్ధతను కాపాడాలి; సోవియట్ యూనియన్లోని జాతులన్నింటిమధ్యగల మహామైత్రిని యింకా పటిష్ఠ మొనర్చేందుకు అహర్నిశలు మనం కృషి చేస్తుండాలి.

## 2. సోషలిస్టు ప్రజాతంత్రాన్ని పెంపొందించాలి; రాజ్యాంగ యంత్రాన్ని మెరుగుపర్చాలి; సోవియట్ చట్టాన్ని పటిష్ఠతరంచేయాలి.

మనం సమీక్షించుకొంటున్న దశలో సోవియట్ ప్రజాతంత్రం యింతకు మునుపుకన్నా ఎక్కువగా వృద్ధిచెందింది; శ్రామికజనానీకంయొక్క సృజనాత్మక కృషి యింకా పెంపొందింది.

సోషలిస్టువ్యవస్థలో మాత్రమే రాజ్యాంగానికి సంబంధించిన అతిప్రధాన సమస్యల పరిష్కారానికి ప్రజాపద్ధతులు అనుసరించటం సాధ్యమవుతుంది. పార్టీ కేంద్రకమిటీ కేంద్రస్థాయిలోను, స్థానికంగానుకూడా కార్మికవర్గానికి, రైతాంగానికి, మేధావివర్గానికి చెందిన ప్రముఖ ప్రతినిధుల మహాసభలను ఏర్పాటుచేసింది. సోవియట్ ప్రజాతంత్రం విస్తరిల్లిందనటానికి మరొక తార్కాణంగా ఈ క్రింది విషయాన్ని తీసుకోవచ్చు. ఆరో పంచవర్ష ప్రణాళికలో తమ కర్మాగారాలకు చెందిన ముసాయిదా సూచనలను రూపొందించి, చర్చించటంలో కర్మాగారాలలో పనిచేసే కార్మికులు పెద్దఎత్తున పాల్గొన్నారు.

కమ్యూనిజాన్ని నిర్మించటంలో ప్రత్యక్షమయ్యే గురుతర కర్తవ్యాలను నిర్వర్తించటానికి శ్రామిక ప్రజల సృజనాత్మక కృషి, చొరవ యింకా పెంపొంద వలసిన అవసరంవుంది; రాజ్యాంగ పాలనలో సాధారణ ప్రజలు యింకా ఎక్కువగా పాల్గొనవల్సి వుంటుంది; అలాగే మనదేశంలో పెద్దఎత్తున సాగుతున్న నిర్మాణ, ఆర్థిక కార్యకలాపాలలో వారు ఎక్కువగా పాల్గోవల్సి వుంటుంది. దీని అర్థం సోవియట్ ప్రజాతంత్రాన్ని మనం అన్నివిధాల అభివృద్ధి చేయాలి; సర్వతోముఖాభివృద్ధికి ఆటంకంగా తయారైన ప్రతిదానిని నిర్మూలించాలి.

సోవియట్ యూనియన్‌కి రాజకీయ పునాదిగావున్న సోవియట్లకృషితో నేను ప్రారంభిస్తాను.

సోవియట్ల కృషిలో ప్రమాదకరమైన అనేక లోపాలు ఉన్నాయన్న సంగతి చెప్పక తప్పదు. కొన్ని కొన్ని సందర్భాలలో సోవియట్ రాజ్యాంగ విధులను, నిబంధనలను ఉల్లంఘించిన ఉదంతాలుకూడా ఉన్నాయి. ఉదాహరణకు ప్రజా ప్రతినిధులు తాము సాగించే కార్యకలాపాలను గురించి తమ ఓటర్లకు నివేదిస్తుండాలన్న నిబంధనే తీసుకోండి. అలాంటి నిబంధన ఉన్నప్పటికీ, ఇటీవలి సంవత్సరాలలో స్థానిక ప్రాంతాలలో తప్ప ఆచరణ అమలులోకి వచ్చింది; సోవియట్లలోని ప్రజా ప్రతినిధులు, కార్యనిర్వాహక వర్గాలలోని ప్రజాప్రతినిధులు అడపా తడపా మాత్రమే, ప్రధానంగా ఎన్నికల ప్రచార సందర్భంలో మాత్రమే, ఓటర్లకు తమ కృషిని గురించి నివేదించుకొంటున్నారు. ఓటర్లు తన యందుంచిన విశ్వాసాన్ని నిలుపుకో లేక పోయినప్పుడు, ఆ ప్రజాప్రతినిధి ఎన్నికను రద్దుచేసే అధికారం ఓటర్లకు ఉంది. దీన్ని మన రాజ్యాంగచట్టం ఒసగుతోంది. యూనియన్, స్వయంపాలిత రిపబ్లిక్‌ల సుప్రీం సోవియట్ సమావేశాలను సంవత్సరానికి రెండుసార్లు ఏర్పాటుచేయాలని రాజ్యాంగ చట్టంలో ఒక నిబంధనఉండగా, ఆ సమావేశాలను సంవత్సరానికి ఒకమారు మాత్రమే పిలుస్తున్నారు.

సోవియట్లకృషిలోగల ఈ లోపాలను తొలగించటం, ఓటర్లతో సంబంధాలను పటిష్ఠతరం చేయటం, రాజ్యాంగ చట్టంలోని నిబంధనలను తు. చ. తప్పకుండా పాటించటం అవసరం. ఆర్థిక, సాంస్కృతికాభివృద్ధికి సంబంధించిన నిర్దిష్ట సమస్య

లపై సోవియట్లు తమ దృష్టిని లక్ష్యం చేయాలి; సోవియట్ల సమావేశాలలో ఈ సమస్యలను క్రమబద్ధంగా చర్చించుతుండాలి.

కమ్యూనిస్టు సమాజ నిర్మాణంలో సోవియట్ రాజ్యాంగయంత్రం ప్రధానమైన పాత్ర నిర్వహిస్తుంది. మన రాజ్యాంగయంత్రం దాని స్వభావాన్నిబట్టే నిజమైన ప్రజాయంత్రం. సోవియట్ మేధావులలోనుంచి—తమ ప్రజల శ్రేయస్సు కోసం అహర్నిశలు పాటుబడే స్త్రీ పురుషులు కమ్యూనిస్టు సమాజనిర్మాణంలో నిమగ్నమైన స్త్రీ పురుషులు—తీసుకోబడిన ఒక పెద్ద సైన్యం అందులో నియమించబడింది. సోవియట్ రాజ్యాంగ యంత్రం ద్వారానే సోషలిస్టు రాజ్యానికి సంబంధించిన ఆర్థిక, నిర్మాణ, సాంస్కృతిక, విద్యాసంబంధమైన విధులు నిర్వర్తించబడుతున్నాయి. మన దేశరక్షణను పటిష్ఠతరంచేసే కర్తవ్యంకూడా అలాగే నిర్వర్తించబడుతోంది. ప్రజలకు శాశ్వతంగా నిలబడి, సమర్థవంతంగా పనిచేసే సమన్వితమైన, సుసంఘటితమైన రాజ్యాంగ యంత్రం లేనిదే సోషలిస్టు నిర్మాణానికి చెందిన ఏ ఒక రంగాన్నీ నిర్వహించటం సాధ్యంకాదు. అందుచేత సోవియట్ రాజ్యాంగయంత్రానికి సన్నిహితంగా వుంటూ, ఆ యంత్రానికి సంబంధించిన వివిధరంగాలలో పనిచేసే అశేష శ్రామికజనానీకంలో నిర్మాణ కృషిని, సిద్ధాంత కృషిని కొనసాగించటమే మన పార్టీసంస్థల కర్తవ్యమవుతోంది.

ఆ యంత్రంయొక్క నిర్మాణ కృషినిగూర్చి లెనిన్ ఉపదేశించిన సూత్రాలకు అనుగుణంగా సోవియట్ కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ, సోవియట్ మంత్రి మండలి పరిపాలనా యంత్రాన్ని తగ్గించేందుకు, దానిలో పనిచేసే కార్యకర్తలను తగ్గించి, దాని కృషిని మెరుగుపర్చేందుకు గత రెండు సంవత్సరాలలోను ప్రధానమైన చర్యలు తీసుకొన్నాయి. తత్ఫలితంగా పరిపాలనా నిర్వహణా యంత్రంలో పనిచేసేవారి సంఖ్య తగ్గింది; అందుబాటులోవున్న సంఖ్యా వివరాలనుబట్టి 7 లక్షల 50 వేల మంది తగ్గినట్లు తేలుతోంది. పరిపాలనా యంత్రం యిప్పటికే చాలా పెద్దదిగా వుందని చెప్పాలి; అంత పెద్ద యంత్రాన్ని పోషించేందుకు ప్రభుత్వం పెద్దపెద్ద మొత్తాలు ఖర్చుచేయవలసి వస్తోంది. సోవియట్ సమాజ శ్రేయస్సు దృష్ట్యా ఉత్పత్తి కార్యక్రమంలో మిల్లులలోను, ఫ్యాక్టరీలలోను, గనులలోను, గృహనిర్మాణంలోను, సమిష్టి వ్యవసాయ క్షేత్రాలలోను, మెషిన్ ట్రాక్టర్ కేంద్రాలలోను, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలలోను— ఇంతెందుకు ఎక్కడెక్కడైతే జాతీయ సంపద ఉత్పత్తి చేయబడుతూ వుంటుందో అక్కడెల్లా—ఎక్కువమంది పనిచేస్తూ వుండటం మంచిది.

పరిపాలనా నిర్వహణయంత్రాన్ని మెరుగుపర్చే కార్యక్రమం యికముందు కూడా మనం కొనసాగిస్తుండాలి. అయితే ఇదొక యాంత్రికమైన విషయం కాదు; దాని స్వరూపంలోగల చిక్కులను తగ్గించాలి. ఆచరణరీత్యా దాని కార్యకలాపాలను మెరుగుపర్చాలి; ప్రజలతో దాని సంబంధాలను పటిష్ఠతర మొనర్చాలి; ఆర్థిక సాంస్కృతికాభివృద్ధికి సంబంధించిన కార్యక్రమంలో పాల్గొనే కార్మికులు, సమిష్టి వ్యవసాయదారులు, మేధావులనుంచి ఉత్సాహవంతులైన కార్యకర్తల తోడ్పాటును

దానికి సంపాదించాలి. మన రాజ్యాంగయంత్రంలో ఒండొరుల పనిని చర్వితచర్వణంగా చేసే అనవసరమైన లింకులు యిప్పటికీ చాలా వున్నాయి. మంత్రిత్వశాఖలలోను, తదితర సంస్థలలోను పనిచేస్తున్న అనేకమంది కార్యకర్తలు పార్టీయొక్క, ప్రభుత్వంయొక్క నిర్ణయాలను అమలు జరపడంలో ఊపిరాడకుండా ప్రజలను సమాయత్తపర్చడానికి మారుగా, ఆఫీసులలో కూర్చొని, కాగితాలమీద గిలుకుతూ కాలయాపన చేస్తున్నారు. నిరంకుశాధికార పద్ధతిలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాగిస్తున్నారు. మన ఉమ్మడి ఆశయానికి పెద్ద హానికరంగా తయారైన పని నిర్వహణలో అనవుసరపు జాగు (రెడ్ టేప్)కు వ్యతిరేకంగా గట్టిపోరాటం సాగించి, సహించరాని ఆ చేటును నిర్మూలించాలి.

ఇటీవలి సంవత్సరాలలో పార్టీ, ప్రభుత్వమూ అనేక మంత్రిత్వశాఖలను విభజించింది; పరిపాలనా నిర్వహణయంత్రంలో పనిచేసే వారి సంఖ్యను ఒకప్రక్క తగ్గిస్తూనే, మరొకప్రక్క ఉత్పత్తి కేంద్రాలకు సన్నిహితంగా ఆర్థిక నాయకత్వం తీసుకురాబడుతూంది; ఆవిధంగా నాయకత్వం మరింత నిర్దిష్టంగా చేయబడుతూంది.

సోషలిస్టు ప్లానింగ్‌ను మెరుగు పర్చేందుకు పార్టీ తీసుకున్న చర్యలు మన ప్రభుత్వానికి ఎంతో ముఖ్యమైనవి. ఈ చర్యలలోకెల్లా ప్రత్యేకంగా పేర్కొనదగినది ప్లానింగుపరిస్థితులను పునర్వ్యవస్థీకరించాలని చేసిన నిర్ణయం. ఆ సంస్థలు దీర్ఘకాల ప్రణాళికా సంఘాలుగాను, వర్తమానకాల ప్రణాళికా సంఘాలుగాను విభజింపబడతాయి. దానివల్ల జాతీయార్థిక ప్రణాళికలను మరింత సాంగోపాంగంగా రూపొందించేందుకూ, ఆ ప్రణాళికలు ఎలా అమలు జరుగుతున్నాయో తనిఖీ చేసేందుకు వీలు చిక్కుతుంది.

సక్రమమైన నిష్పత్తిలో సోషలిస్టు ఆర్థికాభివృద్ధి అన్న సూత్రానికి అనుగుణంగా మన ప్రణాళికలు లేవనే చెప్పాలి. దానివల్ల మన దేశార్థిక జీవనంలో తాత్కాలికమైన, పాక్షికమైన ఎగుడు దిగుడులు సంభవిస్తున్నాయి; తత్పర్యవసానంగా ఆర్థిక విధానంలోని అనేక శాఖల అభివృద్ధికి అంతరాయం కలుగుతోంది. అలాంటి ఎగుడు దిగుడులు లేకుండా అరికట్టి, జాతీయార్థిక విధానం సక్రమమైన నిష్పత్తిలో వృద్ధిచెందేటట్లు చూడటం మన కర్తవ్యం. మన ప్రణాళికా సంస్థలు, ఆర్థిక సంస్థలు కూలంకషమైన పరిశోధన జరిపి, అనేక పంచవర్ష ప్రణాళికల కాలంలో మన జాతీయార్థిక వ్యవస్థకు చెందిన ప్రధాన శాఖల విస్తరణ కార్యక్రమాల లక్ష్యాలను రేఖామాత్రంగా సూచించాలి.

పార్టీయొక్క, ప్రభుత్వంయొక్క నిర్ణయాలు ఎలా అమలు జరుగుతున్నాయో తనిఖీ వేసేందుకు సరియైన పద్ధతిని రూపొందించే విషయంపై ప్రత్యేక దృష్టిని లగ్నం చేయటం అవసరం. కేవలం అజాగ్రత్తగా వుండే కార్యకర్తలను మాత్రమే తనిఖీ చేస్తుండాలని భావించటం పొరపాటు. పట్టుదలతో పనిచేసే కార్యకర్తలను కూడా తనిఖీ చేస్తూండటం అవసరం. తనిఖీ చేయటం అన్నది ఒక విలక్షణమైన పద్ధతి; అది ఉద్యోగులలో క్రమశిక్షణ కల్పిస్తుంది; వారు తప్పులు చేయకుండా అరికట్టుతుంది;

తమకు అప్పజెప్పిన పనిని వారు మరింత బాధ్యతాయుతంగా నిర్వహించేటట్లు చేస్తుంది.

కేంద్రంలోను, స్థానికంగాను పనిచేసే పార్టీ, ప్రభుత్వ, ఆర్థికసంస్థలు సాగించే నిర్మాణ కార్యకలాపాలలోకల్లా పార్టీయొక్క, ప్రభుత్వంయొక్క ఆదేశాలు ఎంతవరకు అమలు జరుపబడుతున్నాయో తనిఖీచేసే పద్ధతే ఎంతో లోపభూయిష్టంగా వుంది. సోవియట్ స్టేట్ కంట్రోల్ మంత్రిత్వశాఖకూడా ఈ కర్తవ్యాన్ని సరిగా నిర్వహించలేకపోతున్నది. స్టేట్ కంట్రోల్‌ను గురించి లెనిన్ యిచ్చిన ఆదేశాలను ఆ మంత్రిత్వశాఖ సరిగా అమలు జరపలేకపోతోంది; రాజ్యాంగ యంత్రాన్ని బాగుపర్చటానికి ఏలాంటి ప్రధానసమస్యలను అది తరచలేకపోతోంది.

పార్టీయొక్క, ప్రభుత్వంయొక్క ఆదేశాలు ఎలా అమలు జరపబడుతున్నాయో తనిఖీచేసేందుకు ప్రస్తుతమున్న పురాతనపద్ధతితో మనం సంతృప్తి చెందలేం. ఇంకెంతమాత్రం మిన్నకుండజాలం. స్టేట్ కంట్రోల్ మంత్రిత్వశాఖ కార్యకలాపాలను సమూలంగా పునర్వ్యవస్థీకరించాలి; రాజ్యాంగ యంత్రంయొక్క కృషిని గురించి, దాని స్వరూపం గురించి ఆ మంత్రిత్వశాఖ ముందుగా పరిశీలించేందుకు ఉపక్రమించాలి. పార్టీయొక్క, ప్రభుత్వంయొక్క నిర్ణయాలను రాజ్యాంగ యంత్రంలోని వివిధ లింకులు ఎలా అమలు జరుపుతున్నాయో తనిఖీచేయాలి; రాజ్యాంగ పరిపాలనను మెరుగుపర్చి, దానిని మరింత సమర్థవంతం చేసేందుకు దోహదమిచ్చే ప్రధాన సమస్యలను, సూత్రానికి సంబంధించిన సమస్యలను ప్రభుత్వం ముందుంచాలి.

సోషలిస్టు చట్టాన్ని పటిష్ఠతరం చేసేందుకు పార్టీ కేంద్రకమిటీ యింతకు ముందు ఎంతో శ్రద్ధ వహించింది; యిప్పుడూ శ్రద్ధ వహిస్తోంది. సోషలిస్టు చట్టం కాస్త బలహీనపడితే చాలు, దానిని నీచమైన తమ విద్రోహచర్యలకు వినియోగించుకోవాలని సోవియట్ శత్రువులు ప్రయత్నిస్తుంటారని గత అనుభవం చాటి చెబుతోంది. పార్టీ బట్టబయలుచేసిన బెరియా ముఠా సరిగా అలాగే వ్యవహరించింది. స్టేట్ సెక్యూరిటీ ఏజెన్సీలను పార్టీ అదుపాజ్ఞలలోనుంచీ, ప్రభుత్వ అదుపాజ్ఞలలోనుంచీ తొలగించి పార్టీకి, ప్రభుత్వానికి మిన్నగా ఉంచాలని ఆముఠా ప్రయత్నించింది; ఆవిధంగా ఆ ఏజెన్సీలలో అరాచక వాతావరణాన్ని, నిరంకుశాధికారాన్ని సృష్టించాలని చూసింది. తమ దుష్ట ఉద్దేశాలను ఈడేర్చుకొనేందుకు నిజాయితీపరులైన ముఖ్య కార్యకర్తలపైన, సాధారణ సోవియట్ పౌరులపైన అభూత కల్పనలతో తప్పుడు నేరారోపణలను మోపింది.

“లెనిన్‌గ్రాడ్ కేసు” అని చెప్పబడినదానినిగురించి కేంద్రకమిటీ దర్యాప్తు జరిపినమీదట బెరియా, అతని ముఠా మనుష్యులు కలిసి దానిని సృష్టించారని స్పష్టమైంది; లెనిన్‌గ్రాడ్ పార్టీసంస్థను, దాని కార్యకర్తలను అపఖ్యాతి పాలుచేయాలన్న దుశ్చింతతో ఆపని చేశారు. ‘లెనిన్‌గ్రాడ్ కేసు’ నిరాధారమైనదని నిర్ధారణ అయిన తర్వాత, అనుమానాస్పదంగావున్న యితర కేసులను గురించికూడా కేంద్రకమిటీ దర్యాప్తు జరిపింది. న్యాయాన్ని పునరుద్ధరించటానికి కేంద్రకమిటీ చర్యలు

గైకొన్నది; శిక్షించబడిన అనేకమంది నిరపరాధులను కేంద్రకమిటీ సిఫారసుపై విడుదల చేసింది.

వీటన్నిటినిబట్టి కేంద్రకమిటీ కొన్ని ప్రధానమైన నిర్ణయాలకు వచ్చింది. స్టేట్ సెక్యూరిటీ ఏజెన్సీల కార్యకలాపాలపైన పార్టీయొక్క, ప్రభుత్వంయొక్క తనిఖీని సక్రమపద్ధతిలో నెలకొల్పింది. స్టేట్ సెక్యూరిటీ ఏజెన్సీలను పటిష్ఠతరం చేయటానికి గణనీయమైన కృషి సాగించింది; న్యాయస్థానాలలోను, ప్రాక్యురేటర్స్ ఆఫీసులలోను నమ్మకస్తుల్ని, రాటుతేరిన వారిని నియమించాం. ప్రాక్యురేటర్స్‌యొక్క తనిఖీ అధికారాలు తిరిగి పూర్తిగా పునరుద్ధరించబడ్డాయి; పటిష్ఠతర మొనర్చబడ్డాయి.

సోవియట్ చట్టాలు పాటించబడేటట్లు మనపార్టీ, ప్రభుత్వమూ, ట్రేడ్ యూనియన్ సంస్థలూ కడు జాగరూకతతో చూస్తుండాలి; సోషలిస్టు చట్టాన్ని, శాంతి భద్రతలను ఎవరు ఉల్లంఘించినా, సోవియట్ పౌరుల హక్కులను ఎవరు భంగపరిచినా, అలాంటివారి నందరినీ తూర్పారబట్టాలి. ఏమాత్రం అరాచకత్వం, నిరంకుశత్వం పొడచూపినా దానిని మొగ్గలోనే త్రుంచివేయాలి.

అనేక కేసులు పునర్విచారింపబడి, రద్దుచేయబడ్డాయి కనుక స్టేట్ సెక్యూరిటి ఏజెన్సీలలో పనిచేస్తున్న కార్యకర్తలను కొంతమంది కామ్రేడ్స్ అనుమాన దృష్టితో చూడ్డం ప్రారంభించారన్న విషయం యిక్కడ ప్రస్తావించక తప్పదు. అలా చూడటం పొరపాటనీ, చాల హానికరమనీ వేరే చెప్పనక్కరలేదు. స్టేట్ సెక్యూరిటీ సంస్థలలో పనిచేస్తున్న కార్యకర్తలలో అత్యధిక సంఖ్యాకులు నిజాయితీ పరులన్న విషయమూ, ఉమ్మడి ఆశయ సాధనకై కృతనిశ్చయులై పనిచేస్తున్న సంగతీ మనకు తెలుసు; వారిని మనం విశ్వసిస్తాం.

కమ్యూనిజాన్ని నిర్మించటం అన్న గురుతర కర్తవ్యాన్ని మనం నిర్వర్తించకుండా ఆటంకపర్చేందుకు శత్రువులు సదా ప్రయత్నిస్తూ వచ్చారన్న విషయమూ, ఇకముందుకూడా అలాగే ప్రయత్నిస్తారన్న విషయమూ మనం విస్మరించరాదు. మన చుట్టూవున్న పెట్టుబడిదారీ ప్రపంచం అనేకమంది గూఢచారులను, విద్రోహులను దేశంలోకి పంపింది. మనకు హాని తలపెట్టే తమ యత్నాలను శత్రువులు యికవదులుకుంటారని భావించటం అవివేకమే అవుతుంది. పెట్టుబడిదారీ రాజ్యాలలోని అభివృద్ధినిరోధక వర్గాలవారు బాహాటంగానే మన దేశానికి వ్యతిరేకంగా విద్రోహ కార్యకలాపాలను ప్రోత్సహిస్తున్నా రన్న విషయమూ, ప్రచారం చేస్తున్నారన్న విషయమూ ఎవరికి తెలియనిది? సోషలిస్టు దేశాలకు వ్యతిరేకంగా విద్రోహచర్యలను సాగించే నిమిత్తం 1951 నుంచి ఏటా 100 మిలియన్ల డాలర్లను అమెరికా ఖర్చు చేస్తోంది. అందుచేత సోవియట్ ప్రజలలో విప్లవకర జాగరూకతను అన్ని విధాల ఎక్కువచేయాలి; స్టేట్ సెక్యూరిటీ ఏజెన్సీలను పటిష్ఠతరం చేయాలి.

సోషలిస్టు వ్యవస్థక్రింద కొత్తతరహా ప్రజలను, క్రియా, చైతన్య ప్రపూరిత కమ్యూనిస్టు నిర్మాతలను మన పార్టీ సృజించింది. ఇదొక ప్రధాన చారిత్రక

విజయంగా పేర్కోవాలి. అయితే ప్రజల మనస్సులనుంచి పెట్టుబడిదారీ విధానపు అవశేషాలు పూర్తిగా తొలగిపోయాయని భావించటం పొరపాటే అవుతుంది. దుర దృష్టవశాత్తు అద్భుతమైన, శ్రమశీలురుగల సోవియట్ కుటుంబంలో ఈనాటికి శ్రమైక జీవన సౌందర్యాన్ని ఆరాధించని కొంతమంది ఉన్నారు. వారు తమ కుటుం బానికిగానీ, సమాజానికిగానీ ప్రయోజనకరమైన పీసమెత్తుపనికూడా చేయటంలేదు. మన సోషలిస్టు సమాజంయొక్క సూత్రాలను ద్వేషభావంతో ఉల్లంఘించే వ్యక్తులు కూడా మనకు కన్పిస్తుంటారు. కేవలం పరిపాలనా సంబంధమైన చర్యలను తీసు కోటంద్వారానే ఈ పిచ్చి పోకడలను కట్టిపెట్టడం సాధ్యంకాదు; ఇందుకు ప్రజలు కూడా తమంతటతాము పూనుకోవాలి. ఈ విషయంలో ప్రజాభిప్రాయం పెద్దపాత్ర నిర్వహించగలదు. రుజువర్తనను, సోవియట్ నైతిక సూత్రాలను ఉల్లంఘించే వారు తమ చర్యలను మొత్తం సమాజం అంతా ఖండిస్తోందన్న భావం వారిలో కల్గించాలి. ఆ విధంగా వాతావరణం తయారు చేయాలి. మన రాజ్యాంగ చట్టం మూలకందాలలో ఒకటైన ఈ క్రింది నిబంధనను అనుల్లంఘనీయంగా చేయాలి. "సోవియట్ యూనియన్‌లో దేహదారుఢ్యంగల ప్రతిపౌరుడు పనిచేయటం విధ్యుక్తధర్మం; గౌరవప్రదమైన విషయం. ఈ సూత్రానుసారం ఏ వ్యక్తి పని చేయడో, ఆ వ్యక్తికి తిండి వుండదు."

సోవియట్ యువజనులు, శ్రామికప్రజలు తాముచేసే పనిపట్ల ప్రభుత్వ ఆస్తిపాస్తులపట్ల సోషలిస్టు వైఖరి నవలంబించేటట్లు కృషిచేయటం పార్టీ, ప్రభుత్వం, యువక కమ్యూనిస్టుసమితి, ట్రేడ్‌యూనియన్ల విధ్యుక్త ధర్మం; మార్క్సిజం - లెని నిజానికి చెందిన మహదాశయాలను వారిలో రంగరించి పోయటం ఆ సంస్థల విధ్యుక్త ధర్మం.

కామ్రేడ్స్, ఒకప్రక్క మనం ఖచ్చితమైన శాంతివిధానానికి కట్టుబడి వుంటూనే మరొకప్రక్క వీరోచితమూ, మహత్తరమూ అయిన సోవియట్ సాయుధబలాలను - మన సైన్యాలను నౌకా బలాలను వైమానిక బలాలను-నిరంతరం పటిష్ఠతర మొనర్చటం పవిత్ర కర్తవ్యంగా మన పార్టీ ఎంచుకొంటుంది; మన సాయుధబలాలకు ఆధునికమైన పరికరాలను సమకూర్చిపెట్టటం, సైనికులలో రాజకీయ చైతన్యాన్నీ, పోరాట పటిమనూ, నైపుణ్యాన్నీ పెంపొందించటం తన విధ్యుక్త ధర్మంగా మనపార్టీ పరిగణిస్తుంది. సోవియట్ ప్రజల శాంతియుత శ్రమైక జీవ నాన్ని పరిరక్షిస్తున్న సోవియట్ సాయుధబలాలు తమ సోషలిస్టు మాతృదేశంపట్ల తమకుగల బాధ్యతలను గౌరవప్రదమైన పద్ధతిలో నిర్వర్తించగలవని సోవియట్ ప్రజలు పూర్తిగా విశ్వసించవచ్చు (మిన్నుముట్టే దీర్ఘ హర్షధ్వానాలు).

సోవియట్ యూనియన్ ఆంతరంగిక పరిస్థితి ఈనాడున్నంత పటిష్ఠవంతంగా, సుస్థిరంగా యింతకుముందెన్నడూ లేదు. ఆర్థిక, సాంస్కృతిక రంగాలన్నిటిలో తాము సాగించిన కృషిఫలితంగా సిద్ధించిన మహత్తర సత్ఫలితాలను, తమ సృజ నాత్మక కృషిఫలితంగా సమకూడిన ఫలితాలను కాంచి కమ్యూనిస్టుపార్టీ, సోవియట్

ప్రజలు గర్వించవచ్చు. అయితే అదే సమయంలో లెనిన్ ఉపదేశించినట్లు మనం సాధించిన విజయాలను చూసుకొని మురిసిపోతూ విశ్రమించరాదు; ఇంకా అపరిష్కృతంగా మిగిలిపోయిన సమస్యలపైన దృష్టిని లగ్నంచేసి కృషి సాగించాలి.

సోషలిస్టు ఆర్థిక వ్యవస్థలోగల మహత్తర అవకాశంవల్ల, సోషలిస్టు ఉత్పత్తి పెద్ద ఎత్తున వృద్ధిచెందు తున్నందువల్ల, సోవియట్ యూనియన్‌యొక్క ప్రధాన కర్తవ్యాన్ని - జనాభాలో తల 1 కి ఉత్పత్తి పరిమాణం విషయంలో బాగా అభివృద్ధిచెందిన పెట్టుబడిదారీ దేశాలను అందుకొని, వాటిని తలదన్నే కర్తవ్యాన్ని - చారిత్రకంగా బహుకొద్ది కాలంలోనే నిర్వర్తించ సాధ్యపడుతుంది. ఈ కర్తవ్యాన్ని నిర్వర్తించగలిగితే మన దేశానికీ, సోషలిస్టు దేశాల మహాశిబిరానికీ అవాంతరాలుగాని, తలవనితలంపుగా వచ్చే ఉపద్రవాల భయంగాని యిక వుండబోదు; సోషలిస్టు సమాజంయొక్క మహదాశయాలకు అనుగుణమైన విధంగా ప్రజల జీవన స్థాయిని పెంపొందించడం సాధ్యపడుతుంది. ఈ కర్తవ్య నిర్వహణలో ఆరవ పంచవర్ష ప్రణాళిక ఒక మైలురాయి వంటిది. కొత్తపంచవర్ష ప్రణాళికా లక్ష్యాలను కేవలం పూర్తిచేయుటమేకాక, వాటిని అధిగమించటానికికూడా పూర్తిఅవకాశాలు మనకు గలవు (దీర్ఘహర్ష ధ్వానాలు).

అయితే అవకాశాలు యింకా వాస్తవరూపం ధరించలేదన్నవిషయం ప్రతివారికి తెలుసు. ఉన్న అవకాశాలను వాస్తవ విషయంగా మార్చాలంటే, పార్టీ, ప్రభుత్వమూ, ఆర్థికసంస్థలు, ట్రేడ్‌యూనియన్లు, యువకకమ్యూనిస్టుసమితి, సంస్థలు నిర్మాణకృషిని క్రమబద్ధంగా పట్టుదలతో కొనసాగించవలసి వుంటుంది; సోవియట్ ప్రజలంతా — మన వీరోచిత కార్మికవర్గం, మన మహత్తర సమిష్టి వ్యవసాయక్షేత్ర రైతాంగం, మన ప్రజా మేధావివర్గం — కష్టపడిపనిచేయవలసి వుంటుంది (దీర్ఘహర్షధ్వానాలు).

వచ్చే కొలది సంవత్సరాలలో దేశీయ విధానానికి సంబంధించిన రంగంలో మనం నిర్వర్తించవలసిన కర్తవ్యాలు యివి :

(1) సోవియట్ సమాజంయొక్క భౌతిక, ఉత్పాదక పునాదిని పట్టుదలతో నిరంతరం విస్తరింప చేస్తుండాలి; జాతీయార్థిక విధానంలోని శాఖలన్నింటిలోను ఉన్నతమైన సాంకేతికనైపుణ్యాన్ని, దేశీయ విదేశీయ విజ్ఞానశాస్త్రంనుంచి ఇంజనీరింగ్ సైన్సు సాధించిన విజయాలను, అగ్రగామి కార్మికులు కనుగొన్న ఉత్పత్తి పద్ధతులను ప్రవేశ పెట్టాలి.

(2) సాంకేతికాభివృద్ధి ప్రాతిపదికపై, అన్నింటికంటేముఖ్యంగా దేశమంతటా విస్తృతమైన విద్యుదీకరణ కార్యక్రమం అమలు జరపటంద్వారా, కార్యనిర్వహణను, ఉత్పత్తి నిర్వహణను నిర్ణయాత్మకంగా మెరుగుపర్చటంద్వారా శ్రామికోత్పాదనను క్రమానుగతంగా పెంపొందిస్తుండాలి. కార్మికుల శ్రమఫలితాలు పెరిగేకొలదీ వారి జీవన స్థితిగతులను మెరుగుపర్చుతుండాలన్న లెనిన్‌సూత్రాన్ని తు. చ. తప్పకుండా పాటించాలి.

(3) పారిశ్రామిక, వ్యావసాయికోత్పత్తి వ్యయాన్ని సాధ్యమైనంతవరకు తగ్గించేందుకు శాయశక్తులా కృషిచేయాలి. పరిశ్రమలలోను, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలలోను, మెషిన్, ట్రాక్టరీ కేంద్రాలలోను అణా పైసలతో సహా లెక్కకట్టే సూత్రాన్ని విస్తారంగా పాటించాలి; పొదుపరితనాన్ని ఖచ్చితంగా అవలంబించాలి; శ్రమవ్యయాన్ని తగ్గించాలి; తయారుచేసే వస్తువుల నాణ్యాన్ని పెంచాలి.

(4) మూలపరిశ్రమల నిర్మాణాన్ని నిర్ణయాత్మకంగా మెరుగుపర్చటంతో పాటు, ప్రస్తుతమున్న ఉత్పత్తిస్తోమతులను సమర్థవంతంగా ఉపయోగించుకోవాలి; జాతీయార్థికవిధానానికి చెందిన శాఖలన్నింటిలోను, ప్రతి పరిశ్రమలోను, భవన నిర్మాణ ప్రదేశాలలోను, ప్రతి సమిష్టి ప్రభుత్వ వ్యవసాయక్షేత్రంలోను ప్రస్తుత మున్న అవకాశాలను యితోధికంగా ఉపయోగించుకోనేందుకు ప్రయత్నించాలి.

(5) ఇకముందుకూడా మొత్తం మన సోషలిస్టు ఆర్థికవ్యవస్థకే మూలకంద మైన భారీపరిశ్రమల అభివృద్ధికి అగ్రతాంబూలం యివ్వటం; వాడకం వస్తువుల వుత్పత్తిని గణనీయంగా పెంపొందించటం, తేలిక, ఆహార పదార్థాల పరిశ్రమలను అభివృద్ధి చేసేందుకు నిరంతరం కృషి సాగిస్తుండటం.

(6) అగ్రగాములుగావున్న సమష్టివ్యవసాయ క్షేత్రాల, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాల మెషీన్ ట్రాక్టర్ కేంద్రాల అనుభవాన్ని ఉపయోగించుకొంటూ, కాయ ధాన్యాల ఉత్పత్తిని 11,000 మిలియన్ల పూడ్స్‌కు పెంచాలి; ప్రత్తి, షుగర్ బీట్, ఫ్లాక్స్, బంగాళాదుంపల, తదితర కూరగాయల ఉత్పత్తినీ, యితరపంటల ఉత్పత్తినీ ఆరోపంచవర్ష ప్రణాళిక కాలం ముగిసేలోగా గణనీయంగా పెంపొందించాలి. మాంసం ఉత్పత్తిని రెండింతలు చేయాలి. పాలఉత్పత్తిని కూడా దాదాపు రెండింతలకు పెంచాలి. ఉన్ని ఉత్పత్తిని నూటికి 82 వంతులు ఎక్కువ చేయాలి.

(7) శ్రామికప్రజల జీవనస్థితిగతులను, సాంస్కృతిక స్థాయిని క్రమానుగతంగా పెంపొందించాలి; పనిగంటలను తగ్గించే విషయమై పార్టీచేసిన నిర్ణయాన్ని క్రమ పద్ధతిలో అమలుజరపాలి; శ్రామిక ప్రజల ప్రయోజనార్థం గృహనిర్మాణ కార్య క్రమాన్ని పెద్దఎత్తున కొనసాగించాలి.

(8) సోవియట్ రాజ్యాంగయంత్రంయొక్క కృషిని నిరంతరం మెరుగుపర్చు తుండాలి; ఆ యంత్ర భారాన్ని తగ్గించాలి. దాని నిర్వహణకు అయ్యే ఖర్చును తగ్గించాలి. నిరంకుశత్వాన్ని, పని నిర్వహణలో అనవసరపు జాగును (రెడ్ టేప్) పట్టుదలతో నిర్మూలించాలి. జాతీయార్థిక విధానంలోని శాఖలన్నింటికి మరింత చక్కగా నాయకత్వం వహిస్తుండాలి; నాయకత్వ సూచనలు నిర్దిష్టంగా వుండాలి; ఆ విధంగా వెనుకబడివున్న పరిశ్రమలు, సమిష్టి వ్యవసాయ క్షేత్రాలు, మెషిన్ ట్రాక్టర్ కేంద్రాలు, ప్రభుత్వ వ్యవసాయక్షేత్రాలు బాగా అభివృద్ధిచెంది, అత్యంత పురోగామి సంస్థలతో సరితూగేటట్లు చూడాలి.

(9) కోటానుకోట్ల కార్మికుల, సమిష్టి వ్యవసాయదారుల, మేధావుల చొరవను, సృజనాత్మకశక్తిని విస్తారంగా అభివృద్ధిచేయాలి; ఆరో పంచవర్ష ప్రణాళిక లక్ష్యాలను పూర్తిచేసి, అధిగమించేందుకు గ్రామీణప్రాంతాలలో సోషలిస్టు పోటీని ఒక మహోద్యమంగా నడపాలి.

(10) కార్మికవర్గానికి, సమిష్టి వ్యవసాయదారులకు మధ్యగల ఐక్యసంఘటనను నిరంతరం పటిష్ఠతర మొనర్చుతుండాలి; సోవియట్ జాతులమధ్యగల అభేద్యమైన మిత్రత్వాన్ని, మొత్తం సోవియట్ సమాజంయొక్క రాజకీయ, నైతిక సమైక్యతను పటిష్ఠతర మొనర్చుతుండాలి. సోవియట్ దేశభక్తినీ, కార్మికవర్గ అంతర్జాతీయతను రంగరించి కోటానుకోట్ల శ్రామికప్రజలకు నూరిపోయాలి. మహత్తరమైన కమ్యూనిస్టు పార్టీ చుట్టూ, అజేయమైన మార్క్సిజం-లెనినిజం పతాకచ్ఛాయలలో వారిని మరింతగా సమీకరించాలి (మిన్నుముట్టే దీర్ఘహర్షధ్వానాలు).





# III

# పార్టీ నిర్మాణం

కా|| మేడ్స్, కమ్యూనిస్టుపార్టీ అనుసరిస్తున్న సరియైన కార్యవిధానంవల్లనూ, అది అహర్నిశలు సాగించిన అలుపు సలుపు లెరుగని నిర్మాణ కృషివల్లనూ మన దేశం ఘన విజయాలను సాధించగల్గిందన్న సంగతి సోవియట్ ప్రజలెరుగుదురు. ప్రజల విషయంలో సోవియట్ కమ్యూనిస్టుపార్టీ ప్రదర్శించిన సేవా నిరతి కారణంగా, మన దేశ ప్రజలలో మాత్రమేకాక అంతర్జాతీయ కమ్యూనిస్టు, కార్మికోద్యమంలోను, ప్రాక్పశ్చిమ జనసామాన్యంలోను దానికి అత్యున్నత ప్రతిష్ఠ సిద్ధించింది. ప్రపంచ ఘటనల తీరుతెన్నులపైన దాని కార్యవిధానంయొక్క ప్రభావం బలీయంగా వుంది.

## 1. కమ్యూనిస్టుపార్టీ కార్యకర్తల నిర్మాణ ఐక్యత : సోవియట్ ప్రభుత్వంలో దాని నాయకత్వపాత్ర

1956 ఫిబ్రవరి 1 వ తేదీనాటికి సోవియట్ కమ్యూనిస్టుపార్టీ మొత్తం సభ్యత్వం 72,15,505; అందులో 67,95,896 మంది రెగ్యులర్ సభ్యులు; 4,19,609 మంది క్యాండిడేట్ సభ్యులు. అంటే 18 వ పార్టీ మహాసభ నాటికివున్న సభ్యత్వంకన్నా యిప్పటి సభ్యత్వం మూడు రెట్లు హెచ్చు; 19 వ పార్టీ మహాసభ సమయానికివున్న సభ్యులకన్నా 3,38,000 సభ్యులు అధికం. మనం సమీక్షించుకొంటున్న దశలో పార్టీ యిటు నిర్మాణరీత్యా, అటు సిద్ధాంతరీత్యా కూడ మరింత పటిష్ఠమైంది. పార్టీ సభ్యులకు యిచ్చే మార్క్సిస్టు - లెనినిస్టు శిక్షణ బాగుపడింది; పార్టీ నాయకత్వంలోను, ప్రభుత్వ నాయకత్వంలోను కీలకమైన పార్టీ కార్యకర్తల అభివృద్ధి గమనార్హంగావుంది.

మన మహానాయకుడు, మహామహోపాధ్యాయుడు అయిన వ్లాడిమిర్ ఇల్యిచ్ లెనిన్ శ్రామిక ప్రజానీకం స్వేచ్ఛా, సౌఖ్యాలకొరకు, కమ్యూనిజంకొరకు సాగిస్తున్న పోరాటంలో వారికి ఉత్తేజం కలిగించి, సారథ్యం వహించేందుకు కమ్యూనిస్టుపార్టీని స్థాపించి నిర్మించారు. సోవియట్ రాజ్యంలో పార్టీ నాయకత్వ పాత్రను కుంచపర్చటానికి లేదా బలహీనపర్చటానికి జరిగిన ప్రతి ప్రయత్నాన్ని లెనిన్ గట్టిగా ప్రతిఘటించారు. పార్టీనిగురించి లెనిన్ చేసిన ఉపదేశాలనే కేంద్రకమిటీ

సదా తు. చ. తప్పకుండా పాటిస్తూవచ్చింది. కాగా మనం సమీక్షించుకొంటున్న ఈ దశలో ప్రభుత్వ వ్యవహారాలలోను, మొత్తం దేశ ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక రంగాలలోను అత్యధికమైన పాత్రను పార్టీ నిర్వర్తించిందని ఈనాడు మనం చెప్పుకోగలం.

సోవియట్ ప్రభుత్వాన్ని మరింత సుస్థిరం చేసేందుకూ, సోషలిస్టు ఆర్థిక సాంస్కృతికాభివృద్ధిని యింకా యితోధికం చేసేందుకూ, శ్రామిక ప్రజల జీవన ప్రమాణస్థాయిని మరింతగా పెంపొందించేందుకూ సాగిస్తూన్న పోరాటంలో పార్టీ ప్రజాసామాన్యంతో తన సంబంధాలను అపారంగా విస్తరింపచేసుకొన్నది; ప్రజలతో మరింత సాన్నిహిత్యం పొందింది.

అయితే సమీక్షించుకొంటున్న యీ దశలో మనపార్టీ మేఘావృతంకాని నిర్మలాకాశం క్రింద, ఎత్తుపల్లాలులేని సుకరమైన రోడ్డువెంట అప్రతిహతంగా పురోగమించిందని భావించటంమాత్రం పొరపాటే కాగలదు. అలాంటి దానికి మనం దూరాన వున్నాం. మనం పెద్దపెద్ద విజయాలే సాధించినా, కొన్ని వైఫల్యాలు కూడా పొందకపోలేదు. సంతోషదాయకమైనదెంతో వున్నా, విచారకరమైన విషయాలు కూడా లేకపోలేదు. అయితే పార్టీ విజయాలను గాంచి ఎగిరిపడలేదు; వైఫల్యాలను చూసి దిగులు చెందలేదు. పార్టీ తాను చేపట్టిన మార్గం వెంట గుండెదిటవుతోను, ఆత్మవిశ్వాసంతోను ముందుకు సాగిపోతూనే వుంది (దీర్ఘ హర్షధ్వానాలు).

19 వ పార్టీ మహాసభ అనంతరం కొద్దిరోజులకే మరణగాఢసి జోసెఫ్ విస్సారినోవిచ్ స్టాలిన్‌ను మననుంచి వేరుచేసింది. దానితో పార్టీ కార్యకర్తలలో గందరగోళం వ్యాపిస్తుందనీ, పార్టీనాయకత్వంలో మనస్పర్థలు పెచ్చరిల్లుతాయనీ, దేశీయ, వైదేశిక విధానాలను అమలు జరపటంలో పార్టీ నాయకత్వం తటపటాయిస్తుందనీ సోషలిజానికి శత్రువులైనవారు ఆశించారు. అయితే అలాంటివారి ఆశలన్నీ అడియాసలైపోయాయి. పార్టీ మొత్తంగా కేంద్రకమిటీ చుట్టూ మరింత సన్నిహితంగా సమీకృతమైంది; అప్రతిహతమైన మార్క్సిజం - లెనినిజం యొక్క పతాక ప్రతిష్ఠను మరింతగా యినుమడింపచేసింది (దీర్ఘ హర్షధ్వానాలు).

సామ్రాజ్యవాదులు తమ చిరకాలబంటూ, పార్టీయొక్క, ప్రభుత్వంయొక్క నాయకస్థానాలలోకి వంచనా పద్ధతులలో జొరబడిన బెరియాపైన ప్రత్యేకమైన ఆశలెన్నో పెట్టుకొన్నారు. ప్రమాదకరమైన ఆ శత్రువూ, అతని పరివారమూ కలిసి పన్నిన నీచమైన పన్నాగాలను కేంద్రకమిటీ పూర్తిగా తుదముట్టించింది. పార్టీకి, పార్టీ సమిష్టినాయకత్వానికీ అదొక గొప్ప విజయం అని చెప్పాలి.

నైచ్యానికి పాల్పడ్డ ఈ విద్రోహ ముఠాను నిర్మూలించినందువల్ల పార్టీ మరింతగా పటిష్ఠమైంది; దేశాన్నెదుర్కొంటున్న సమస్యలను జయప్రదంగా పరిష్కరించగల్గింది. పార్టీ మరింతగా సంఘటితం కాగల్గింది. పార్టీ అభేద్యతకు దాని సిద్ధాంత నిర్మాణ ఐక్యతే మూలం; పార్టీ ఐక్యంగా వున్నంతకాలమూ ఎలాంటి శత్రువులుగానీ, ఎలాంటి కష్టాలుగానీ పార్టీకి ప్రమాదం తెచ్చిపెట్టజాలవు. ఒక ఐక్య

శక్తిగా పార్టీ పనిచేస్తే ఎలాంటి పరిస్థితినైనా అది ఎదుర్కొనగలుగుతుంది; అలా ఐక్య శక్తిగా పనిచేస్తే పోరాటంలో భయానికి ఎట్టి తావు ఉండదు; తన కార్యవిధానాలను అమలుజరపటంలో ఎలాంటి తటపటాయింపులుండవు; కష్టాలకు వెరచి వెనకడుగు వేయటం అంటూ వుండదు. ఇంతకు ముందెన్నడూ లేనంతగా ఈనాడు మన పార్టీ సుసంఘటితమైంది; కేంద్ర కమిటీచుట్టూ పార్టీ మరింత సన్నిహితంగా సమీకృతమై, లెనిన్ మహనీయుడు చూపెట్టిన రాజమార్గం వెంట ఆత్మ విశ్వాసంతో దేశాన్ని ముందుకు నడిపిస్తోంది (మిన్నుముట్టే దీర్ఘ హర్షధ్వానాలు).

అనేక సంవత్సరాల, దశాబ్దాలకాలంలో పార్టీ ఐక్యత నిర్మించబడుతూ వచ్చింది; అసంఖ్యాక శత్రువులతో సాగించిన పోరాటాలమధ్య అది కాకలుతీరింది. ట్రాట్‌స్కీవాదులు, బుఖారిన్‌వాదులు, బూర్జువా జాతీయవాదులు, తదితర దుష్ట ప్రజాశత్రువులు, పెట్టుబడిదారీ విధానాన్ని పునరుద్ధరించ తలపెట్టినవారంతా కలిసి పార్టీలోని లెనినిస్టు ఐక్యతను లోపలనుంచి విచ్ఛిన్నంచేయాలని అన్నింటికి తెగించి నానాతంటాలు పడ్డారు- ఫలితంగా వారంతా నేలకరిచారు.

కమ్యూనిస్టుపార్టీలో గల ఈ ఐక్యతకు మొత్తం సోవియట్ సమాజంయొక్క నైతిక, రాజకీయ ఐక్యత మూలకందంగానూ, మార్క్సిజం—లెనినిజం సూత్రాలు పటిష్ఠమైన పునాదులుగాను వున్నాయి. వ్యక్తులు మన పార్టీలో చేరేది స్వార్థ ప్రయోజనంకోసం కాదు; పార్టీ మహదాశయమైన కమ్యూనిజాన్ని స్థాపించేందుకు సహాయపడాలనిమాత్రమే వారు పార్టీలో చేర్తారు.

పార్టీ నాయకత్వం వ్యక్తిగత సంబంధాలనో, పరస్పర ప్రయోజనాలనో ఆధారం చేసుకొని ఏర్పడిందికాదు; కొన్ని భావాల, సూత్రాల ప్రాతిపదికపైన ఏర్పడిన పరస్పర క్షమాభావానికిగానీ, వ్యక్తిగత వైమనస్యానికిగానీ ఎలాంటి తావు లేనట్టి సమిష్టి క్రియాత్మక నాయకత్వం అది.

ఒకానొక పార్టీ నాయకుడు తన కృషిలో తప్పులు చేసినట్లు ఎప్పుడు బయట పడినా, ఆ తప్పులను సరిదిద్దటానికి అవసరమైన చర్యలను కేంద్రకమిటీ ఏకగ్రీవంగా గైకొన్నది. అనేక పార్టీ యూనిట్లు, వ్యక్తులు - వీరిలో కేంద్రకమిటీ సభ్యులుకూడా ఉన్నారు - కేంద్రకమిటీ విస్తృత సమావేశాల్లో వెరపు, మమతలులేని బోల్షివిక్ విమర్శకు లోనుచేయబడ్డారు. పార్టీ తమ యందుంచిన అత్యున్నత విశ్వాసాన్ని నిల బెట్టుకోలేకపోయిన కొందరు ఉన్నతోద్యోగులు కేంద్రకమిటీనుంచితొలగించబడ్డారు. అలా చేసినందువల్ల ఐక్యమత్యం సడలిపోలేదు సరిగదా, మరింత పటిష్ఠవంతమైంది.

సిద్ధాంతాన్ని ఆధారం చేసుకొన్న విధానమే సరియైనదని లెనిన్ మనకు ఉపదేశించారు. పార్టీ ప్రయోజనాలకు హానికరమైన ఏ ఒక్కచర్య ఏనాటికీ తీసు కోరాదు - అన్న ఈ మూలసూత్రాన్ని పార్టీలో ఐక్యతకోసం జరిపే పోరాటంలో కమ్యూనిస్టులు శిరోధార్యంగా పాటిస్తూ, వ్యవహరిస్తారు. పోతే, మనం సమీక్షించు కొంటున్న ఈ దశలో అద్వితీయమైన నూతన విజయాలను పార్టీ సాధించిందన్న వాస్తవిక విషయం పార్టీ, దాని కేంద్రకమిటీ కమ్యూనిస్టు కార్యకర్తలమధ్య ఐక్య

తను పరిరక్షించుతూ పెంపొందించిందనటానికి ఒక నిదర్శనం (దీర్ఘహస్త ధ్వానాలు).

సమీక్షించబడుతున్న కాలంలో మనం ప్రయాణంచేసినమార్గం గురించి ఒకసారి పర్యావలోకనస్తే, కేంద్రకమిటీ దేశాన్ని రాజకీయంగా అత్యున్నత స్థాయిలో నడిపించిందని ఘంటాపథంగా చెప్పవచ్చు. పార్టీని, ప్రభుత్వాన్ని ఎదుర్కొంటున్న సమస్యల పరిష్కారానికి పార్టీ సరియైన పద్ధతులనే కనుగొన్నది; దేశాన్ని సామ్యవాదంతో లెనినిస్టుపంథాను ముందుకు నడిపించింది.

మన సోషలిస్టు దేశ ఆర్థిక స్తోమతను మరింతగా సుస్థిరంచేయుటం, దాని పవిత్రమైన సరిహద్దులను మరింత అభేద్యంగా తయారుచేయుటం, ప్రజల జీవన, సాంస్కృతికస్థాయిని పెంపొందించటం—ఇదే పార్టీయొక్క, కేంద్ర కమిటీయొక్క ప్రధాన కర్తవ్యం.

మన కమ్యూనిస్టుపార్టీ పాలకపక్షంగావుంది. అందువల్ల పార్టీనాయకత్వం పైనా, పార్టీ స్థానిక యూనిట్లు సాగించే కార్యకలాపాలపైనా మనం సాగించే ప్రతిపెద్ద కార్యంయొక్క జయాపజయాలు చాలా వరకు ఆధారపడి వుంటాయి. కాబట్టి దేశాన్నెదుర్కొంటున్న కర్తవ్యాలను సక్రమంగా నిర్వహించాలంటేఅందుకు ముఖ్యంగా పార్టీ యూనిట్లన్నింటిశక్తి స్తోమతులను సమీకరించాల్సి వుంటుంది; తప్పులు చేయటాన్ని చూసి సహించరాదన్న భావాన్ని ప్రతి పార్టీ సభ్యునిలోను కలిగించాల్సి వుంటుంది.

సమీక్షించబడుతున్న కాలంలో కేంద్రకమిటీ విస్తృత సమావేశాలు తరచుగా జరిగాయి; పార్టీ జీవితంలోను, జనరల్‌గా దేశజీవితంలోను కూడా ఆ సమావేశాలు అత్యంత ప్రధానమైన పాత్రనునిర్వర్తించాయి. ఈ సమావేశాలలో కేంద్రకమిటీ లెనినిస్టు సాంప్రదాయాని కనుగుణ్యంగాను, నిర్మొగమాటంగాను, సిద్ధాంతానికి తు. చ. కట్టుబడుతూను వ్యవసాయ పారిశ్రామికాభివృద్ధి విషయంలో దొర్లిన తీవ్రమైన తప్పిదాలను పార్టీముందు, ప్రజలముందు అరమరలు లేకుండా బహిర్గతం చేసింది; ఆ తప్పిదాలను తొలగించే మార్గాలేమిటో విశదీకరించింది; దేశ ఆర్థికాభివృద్ధినిరవధికంగాకొనసాగేందుకు, శ్రామికప్రజల జీవన సాంస్కృతిక స్థాయిని పెంపొందించేందుకు నిర్వర్తించవలసిన కర్తవ్యాలేమిటో, వాటినిఎలా నెరవేర్చాలో విడమర్చి చెప్పింది.

ఆర్థికాభివృద్ధికి సంబంధించినకార్యకలాపాలలోని లోపాలను విమర్శించేటప్పుడు కేంద్రకమిటీ ఒక విషయాన్ని దృష్టిలో వుంచుకొన్నది. మనం ముందుకు సాగేందుకు అవరోధాలుగా తయారైన లోపాలు, కష్టాలు, మంచి చెడ్డలు - వీటిని ప్రజలముందుంచటానికి పార్టీ వెనకాడరాదన్న విశ్వాసంతో కేంద్రకమిటీ అందుకు పూనుకొన్నది. పొరపాట్లను, తప్పిదాలను అంగీకరించటానికి జంకే వ్యక్తి అసలు విప్లవ యోధుడు కాడు. కాబట్టి మన లోపాలను దాచిపెట్టుకోవలసిన అగత్యం లేదు. ఎందుకంటే మనం చేపట్టిన పంథా సరియైనది; కమ్యూనిజం నిర్మాణకృషి

జయప్రదంగా సాగిపోతోంది. లోపాలను తొలగించటానికి ప్రజలతోడ్పాటును ఎంత ఎక్కువగా స్వీకరిస్తామో, అంతగా అవి తగ్గిపోతుంటాయి.

విమర్శ, ఆత్మ విమర్శలను అన్నివిధాల పెంపొందించుకోవాలని కేంద్రకమిటీ పార్టీ యూనిట్లను ఆదేశించింది; విమర్శనాత్మకదృష్టితో జరిగిన కృషి పర్యవసానాన్ని సమీక్షించుకోమనీ, ఆత్మవంచనను, ప్రగల్భాలను, మోసాన్ని ప్రతిఘటించేందుకు సంకల్పసిద్ధులు కండి అనీ నిర్దేశించింది. ఒకప్పుడు పార్టీలోని కొన్నియూనిట్లలో ప్రబలంగా వుండిన అలసత్వమే లేకపోయినట్లయితే, వాస్తవిక విషయాలను మసిపూసి మారేడుగాయ చేసే ధోరణే లేకపోయినట్లతే, ఇప్పుడు మనం ఏ లోపాలనైతే తొలగించుకోవాలని కృషిచేస్తున్నామో, వాటిలో హెచ్చుభాగం అసలు జరగకనే పోయేవి. పార్టీని యింకా పటిష్ఠతర మొనర్చటానికి, లోపాలను సత్వరంగా తొలగించుకొనేందుకు, కమ్యూనిస్టు నిర్మాణానికి సంబంధించిన అన్ని రంగాలలోను కొత్త కొత్త విజయాలను సాధించేందుకు సిద్ధాంతబద్ధమైన బాహాటవిమర్శ, ఆత్మవిమర్శలే తిరుగులేని సాధనాలు కాగలవు.

పార్టీ ఐక్యత యింకా సుస్థిరం కావాలన్నా, పార్టీ యూనిట్లలో యితోధిక కార్యోత్సాహం కల్గించాలన్నా లెనిన్ రూపొందించిన పార్టీ ప్రమాణాలను పునరుద్ధరించవలసి వుంటుంది; ఆ ప్రమాణాలు లోగడ తరచు ఉల్లంఘించబడ్డాయి.

సమిష్టి నాయకత్వంఅన్న లెనినిస్టుసూత్రాన్ని పాటిస్తూ, దానిని అన్ని విధాలా పటుతరం చేయటం అత్యంతావశ్యకమైన విషయం. సోవియట్ కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ ఈ విషయంలో ఆదర్శవంతంగా ఉండడానికి యత్నించింది. ఇటీవల సంవత్సరాలలో మన పార్టీకి సమిష్టినాయకత్వం వహిస్తూవచ్చిన కేంద్రకమిటీపాత్ర ఎంతగా వృద్ధిచెందిందో ప్రతివారికీ తెలుసు. కేంద్రకమిటీ అధ్యక్షవర్గం పార్టీ జీవితానికి, జనరల్‌గా దేశానికి సంబంధించిన ప్రధాన సమస్యలను తన దృష్టిపథంలో వుంచుకొంటూ, ఒక సమిష్టి సంస్థగా రెగ్యులర్‌గా పనిచేయ సాగింది.

పార్టీ సభ్యుల సాధారణ ప్రజల సృజనాత్మక కార్యకలాపాలను పెంపొందించటమే కేంద్రకమిటీ కర్తవ్యం; అందుకోసం అది చరిత్రలో వ్యక్తిపాత్ర ఏమిటి అన్న విషయం గురించి మార్క్సిస్టు - లెనినిస్టు దృక్పథం ఎలా వుంటుందో విపులమైన ప్రాతిపదికపై వివరించేందుకు కేంద్ర కమిటీ కొన్నిచర్యలుతీసుకొంది. వ్యక్తిఆరాధన, ఒకానొక నాయకుణ్ణివీరుడుగానూ, మాంత్రికుడుగానూచిత్రించటంఅన్నవిమార్క్సిజం-లెనినిజం మూలభావానికే విరుద్ధమైనదని కేంద్రకమిటీ తీవ్రంగా ఖండించింది. అంతేకాక, వ్యక్తి ఆరాధన పార్టీ పాత్రను, ప్రజల పాత్రను కుంచపరుస్తుంది; వారి సృజనాత్మక కృషిని తగ్గించటానికి దారి తీస్తుంది. వ్యక్తి ఆరాధనతత్వం చలామణీ అయింది కనుకనే పార్టీలో సమిష్టినాయకత్వ పాత్రపట్ల తక్కువచూపు చూడటానికి దారితీసింది. కొన్ని కొన్ని సందర్భాలలో ప్రమాదకరమైన పొరపాట్లు చేయటానికి కారణభూతమైంది. మనపార్టీ గేయమైన (యాన్థమ్) 'ఇంటర్నేషనల్'లో

ఇలా వుంది: "కరుణించి, రక్షించే మహానుభావులెవరూ మనకు అవసరంలేదు. మన కర్తవ్యాన్ని మనంతమనంగా నిర్ధారించుకోవాలి; మనమే నిర్ణయించుకోవాలి, చక్కగా నిర్వర్తించాలి..." (మిన్నుముట్టే హర్షధ్వానులు). విప్లవకరమూ, సృజనాత్మకమూ అయిన ప్రజల పాత్రపట్ల, సమిష్టి పాత్రపట్ల సరియైన మార్క్సిస్టు అవగాహన ఏమిటో సైన పేర్కొన్న ఉత్తేజపూరితమాటల్లో వ్యక్తమవుతోంది. మార్క్సిస్టు సిద్ధాంతాయుధాన్ని ధరించిన కమ్యూనిస్టుపార్టీ నాయకత్వానగల ప్రజలు అప్రతిహతమైన మహాశక్తి; నూతన జీవిత సృష్టికర్తలు వారే; వారే చరిత్ర నిర్మాతలు (దీర్ఘ హర్షధ్వానులు).

పార్టీ వ్యవహారాలలో లెనినిస్టు సూత్రాలను అమలుజరపటంతో పార్టీ యూనిట్ల రాజకీయ కార్యకలాపాలు ఇతోధికమయ్యాయి; శ్రామికప్రజలతో పార్టీ యూనిట్లకు గల సంబంధాలు పటుతరమయ్యాయి; ప్రజలలో వాటి పలుకుబడి పెరిగింది; పర్యవసానంగా మన పార్టీ యూనిట్లు మరింత బలపడ్డాయి. ఆర్థిక, సాంస్కృతికాభివృద్ధికి సంబంధించిన కర్తవ్యాలను అంతకంత కెక్కువ సామర్థ్యంతో నిర్వర్తించసాగాయి.

అందువల్ల సమీక్షించుకొంటున్న దశలో పార్టీ ఐక్యత మరింత పటుతరమైంది. దాని రాజకీయ, ఆర్థిక పాత్ర యితోధికమైంది; ప్రజలలో దాని పలుకుబడి పెరిగింది. పెద్దపెద్ద అంగలతో ఆర్థికాభివృద్ధి సాగేందుకు, జీవనప్రమాణస్థాయిని పెంపొందించేందుకు పార్టీ సర్వసమగ్రమైన కార్యక్రమాన్ని రూపొందించింది; ఈ కార్యక్రమాన్ని అమలు జరిపేందుకు మొత్తం జనసామాన్యాన్నంతా సమీకరించింది; కమ్యూనిస్టు నిర్మాణానికి సంబంధించిన రంగాలన్నిటిలోను గణనీయమైన విజయాలను సాధించింది.

అయితే పార్టీ బలమూ, పలుకుబడీ ఇంతకుముందెన్నడూ లేనంతగా వృద్ధిచెందిన యీనాడు సైతం మనలో ఉపేక్షాభావం ఏమాత్రం ప్రవేశించరాదు. నిరవధికాభివృద్ధి సాధించాలంటే, పార్టీ యూనిట్లన్నింటినీ పకడ్బందీగా సదాసమీకరించుకొని సిద్ధంగా వుండాలి; పార్టీపనిలోని ప్రతి అంశాన్ని నిరంతరం మెరుగు పర్చుకొంటూ తీర్చి దిద్దుకోవాలి; అన్నిటికంటే ముఖ్యంగా మనం పార్టీనిర్మాణ, సిద్ధాంత కార్యకలాపాలస్థాయిని పెంచుకోవలసి వుంటుంది.

## 2. పార్టీ నిర్మాణానికి సంబంధించిన కృషి

పార్టీ, పార్టీ కేంద్ర కమిటీ నిర్మాణ సంబంధమైన కార్యకలాపాలలో లెనిన్ ఆదేశాలను పాటిస్తూ ముందుకు సాగాయి. దేశాన్ని జయప్రదంగా ముందుకు నడిపించాలంటే ప్రజాసామాన్యాన్ని ఒప్పించగల్గిన సామర్థ్యం, పార్టీ కార్యవిధానాన్ని ఆచరణరీత్యా అమలుజరపగల నిర్మాణ పాటవం అవసరమని లెనిన్ ఆదేశించారు. కర్తవ్యాలను నిర్మాణయుక్తంగా, జయప్రదంగా నిర్వహించేందుకు వీలుగాను,ఆర్థికాభి

వృద్ధికి సంబంధించిన రంగాలన్నింటిలోను ఆచరణయుక్త నిర్మాణ చాతుర్యాన్ని కార్యకర్తలు సంతరింప చేసుకొనేందుకు వీలుగాను పార్టీ కృషి చేసింది.

మనపార్టీ అధికారంలోకివచ్చిననాటినుంచీ లెనిన్ ఆర్థిక కార్యకలాపాలలో పార్టీ కృషిని నిరంతరం జతపర్చుతూ వచ్చారు. సుప్రసిద్ధమైన గోయెల్రో ప్రణాళికను- ఆర్థికాభివృద్ధి ప్రణాళికను- పార్టీ రెండవ కార్యక్రమంగా ఆయన వర్ణించారు. ఆ సందర్భంలో వ్లాడిమియర్ ఇల్యిచ్ యిలా అన్నారు: "మన కార్యక్రమం కేవలం పార్టీ కార్యక్రమంగానే వుండిపోవటానికి వీలులేదు. అది మన ఆర్థికాభివృద్ధికి సంబంధించిన కార్యక్రమం కావాలి; లేకపోతే చివరకు పార్టీ కార్యక్రమంగా కూడ దానికి ఎలాంటి ప్రయోజనం ఉండదు. రెండవ పార్టీ కార్యక్రమాన్ని, మొత్తం జాతీయార్థికవిధానాన్నంతా పునర్నిర్మించి ఈనాటి సాంకేతిక స్థాయికి దానిని తెచ్చేందుకు ఉపకరించే ప్రణాళికను పార్టీ కార్యక్రమంతో జతపర్చవలసి వుంటుంది."

(లెనిన్ రచనలు: సంపుటి 31, 482వ పేజీ)

ఆర్థికాభివృద్ధికి సంబంధించిన ఆచరణ సంబంధమైన సమస్యలను పరిష్కరించడంలో పార్టీ కార్యకర్తలకు ఉన్నత బాధ్యతాయుత భావాన్ని అనేక సంవత్సరాలుగా కల్గించలేదన్న సంగతి అంగీకరించక తప్పదు. పర్యవసానంగా పడకకుర్చీ నిరంకుశాధికార ఆర్థిక నాయకత్వం ప్రబలిపోయింది. అనేకమంది పార్టీ అధికారులు ఆర్థికాభివృద్ధికి సంబంధించిన నిర్మాణాంశాలపట్ల తగినంత సమయాన్ని వినియోగించలేదు; శ్రద్ధ చూపలేదు; ఆర్థిక విషయాల లోతుపాతులను తరచి చూడలేదు. కాబట్టే ప్రజాసామాన్యాన్ని సమీకరించటంఅన్న కర్తవ్యం తరచుగా మాటల మురికి కూపంలోను, కాగితాల సముద్రంలోను తేలియాడుతూ వచ్చింది.

ఆర్థిక కార్యకలాపాల్ని నిర్దిష్టమైన పద్ధతిలో నడిపేందుకు పార్టీ కార్యకర్తలు, పార్టీ సభ్యులు పూర్తిగా పూనిక వహించి, దానిపైన దృష్టిని లక్ష్యం చేయాలని కేంద్ర కమిటీ ఆదేశించింది; ఆర్థిక విషయాలపట్ల అంటీ అంటని వైఖరికి స్వస్తి చెప్పాలి; పారిశ్రామికసంస్థలు, సమిష్టి వ్యవసాయక్షేత్రాలు, ట్రాక్టర్ కేంద్రాలు ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలు మున్నగువాటి సాంకేతిక, ఆర్థికాది విషయాలను మరింత సమగ్రంగా, లోతుగా పరిశీలించాలి; ఆవిధంగా వాటి కృషిని, తీరు తెన్నులను నిర్ధరించటానికి అవసరమైన అపారమైన విజ్ఞానాన్ని సముపార్జించుకోవాలి. తాము చేయవలసిన పనులను శ్రద్ధతో పరిశీలించి, నిర్మాణ సంబంధమైన ఆచరణ యుక్త కృషికి పూనుకోటానికి మారుగా, ఆర్థిక కర్తవ్యాలను గురించి "జనరల్"గా ఉపన్యాసాలు దంచుతూ, పడక కుర్చీ పద్ధతులను కొనసాగిస్తున్న పార్టీఅధికారులు యిప్పుడు నిశితంగా విమర్శించబడుతున్నారు. అభినవ "మిత్రోఫానుష్కాలు" ఈనాడు అనేక మంది మనకు దొరుకుతారు (పాన్‌విజిన్ రచించిన 'ది మైనర్' అన్న హాస్య ప్రధాన నవలలోని ప్రధానపాత్ర - అనువాదకుడు). వాస్తవమైన సజీవకృషినుంచి దూరంగా వుండాలని వారు చూస్తుంటారు. అలాంటివారిని నాయకస్థానాలనుంచి తొలగించాలి.

మనం ఈ చర్యలను తీసుకొన్న ఫలితంగా పారిశ్రామిక, వ్యవసాయిక రంగాలకు చెందిన కీలకశాఖలలో స్థానిక పార్టీ యూనిట్లు తమ నిర్మాణ కృషిని కొంత మేరకు బాగుపర్చుకొన్నాయి. ఆర్థిక విధానాన్ని నడిపించే కృషిని వారు మరింత సమర్థవంతంగాను, నిర్దిష్టంగాను, ఫలదాయకంగాను నిర్వహించగల్గుతున్నారు.

దురదృష్టవశాత్తు అనేక పార్టీ యూనిట్లలో రాజకీయకృషిని, ఆర్థిక కార్యకలాపాల్ని ఒకదానితో మరొక దానిని పోటీపెట్టే హాస్యాస్పదమైన స్థితి యింకా కొనసాగుతూనే వుంది. పార్టీపని ఒకటనీ, ఆర్థిక, ప్రభుత్వ సంబంధమైన పనులు వేరొకటనీ భావించే పార్టీ "నాయకులు" మనకు కన్పిస్తారు. పైగా "శుద్ధపార్టీ"పని నుంచి తమను ప్రక్కదారికిలాగి, ఆర్థిక, సాంకేతిక, భూగర్భశాస్త్రీయ పరిశీలనలు, ఉత్పత్తి పరిశీలనలు చేసేటట్లు ఎవరో తమ మెడలు వంచుతున్నారని ఈ "నాయకులు" ఫిర్యాదు చేస్తున్నారు.

పార్టీపనిపట్ల ఏర్పరచుకొన్న అలాంటి దృక్పథం ప్రధానంగా పొరపాటు దృక్పథం; హానికరమైనది కూడా.

సోవియట్ కమ్యూనిస్టుపార్టీ పాలకపక్షం కాబట్టి, సోవియట్ భూభాగంలో జరిగే ప్రతీవిషయం మొత్తం పార్టీకి, పార్టీసభ్యునికి అత్యంత ఆసక్తిని కలిగించేదే కాగలదు. కేవలం ప్రేక్షకునివలెచూస్తూ ఉండే హక్కు ఏ కమ్యూనిస్టుకూలేదు.

అందుకనే ఆర్థిక సంబంధమైన కృషినుంచి పార్టీ పనిని వేరుచేయరాదని కార్యకర్తలను పార్టీ కోరుతోంది. వ్యాపారపు లోతుపాతులు గ్రహించి, వారు నిర్దిష్టమైన విధంగా ఆర్థిక నాయకత్వం నెలకొల్పుకోవలసి వుందని కోరుతోంది. అంటే దీని అర్థం పార్టీ యూనిట్ల విధులను, ఆర్థిక సంస్థల విధులను కలగాపులగం చేయటమని గానీ, ఆర్థిక సంస్థలను పార్టీ యూనిట్లను లోబర్చమనిగానీ కానేకాదు. అలాచేస్తే వ్యక్తిగత బాధ్యతలనేవి లేకుండాపోయి బాధ్యతారాహిత్యానికి దారితీస్తుంది. పోతే పార్టీకృషి యావత్తూ ప్రజలను సమీకరిస్తూ వారికి శిక్షణ గరపటంపైనా, ఆర్థిక విధానాన్ని నడపటంలో శక్తియుక్తులను ప్రదర్శించటంపైనా, సోషలిస్టు ఆర్థిక వ్యవస్థ నిరంతరాభివృద్ధి చెందేటట్లు చేయటంపైనా, సోవియట్ ప్రజల జీవన ప్రమాణాలను పెంపొందింప చేయటంపైనా, వారి సంస్కృతిని ముందుకు కొనిపోవటంపైనా లగ్నంకావాలని మాత్రమే దాని అర్థం.

పార్టీ నెదుర్కొంటున్న కర్తవ్యాలతో సరితూగగల స్థాయికి నిర్మాణ సంబంధమైన కృషి చేరుకోవాలంటే, పార్టీ యంత్రాన్ని సర్వతోముఖంగా మెరుగుపర్చవలసి వుంటుంది. అదిప్పటికీ తలబరువుగానే వుంది. అసలు ఏ విషయంలోనైనా లాంఛనాల తంతు (ఫార్మలిజం) హానికరమే. అందులోనూ ప్రజలకు సంబంధించిన విషయాల దరిదాపులకైనా కూడా దానిని రానీయరాదు. అలాంటి లాంఛనాల తంతు యిప్పటికీ పార్టీ యంత్రంలో మనకు కన్పిస్తోంది. పార్టీలోని అత్యున్నత నిపుణులు అన్నిరకాలైన సంఖ్యావివరాలను, అనేక సందర్భాలలో అసలు ఎందుకూ పనికిరాని సమాచారాన్ని సేకరిస్తూ ఎక్కువగా కాలక్షేపం

చేస్తున్నారేగాని, నిర్మాణ సంబంధమైన కృషిలో అంతగా తలమునకలౌటమేలేదు. అందువల్ల ఆ యంత్రం చేసేపనిలో హెచ్చుభాగం వృథాప్రయాస అవుతోంది.

పార్టీ నిర్మాణ కృషిలో ప్రధానమైన విషయం ప్రజలలో పనిచేయటం - ప్రజలకు నచ్చచెప్పి, పార్టీ రూపొందించిన రాజకీయ, ఆర్థిక కర్తవ్యాల నిర్వహణకు వారిని సమాయత్త పర్చటం. పార్టీ యంత్రంలోని అనేకమంది కార్యకర్తలు నిత్యం ప్రజల మధ్య వుండటానికి మారుగా తమ తమ ఆఫీసుల్లో కూర్చుని, రీములకొలదీ తీర్మానాల రికార్డులను తయారుచేస్తున్నారు; కాగా జీవితంమాత్రం వారిని తప్పుకొని ముందుకు సాగిపోతోంది. అలాంటి స్థితిని ఇంకెంతమాత్రం కొనసాగనిచ్చేందుకు వీలులేదు.

ఈ సందర్భంలో సమిష్టి వ్యవసాయక్షేత్రాలను నడిపించే తీరును గురించి పదే పదే ప్రస్తావించాల్సి వుంటుంది. వ్యవసాయోత్పత్తిని త్వరత్వరగా పెంపొందించేందుకు అవసరమైన భౌతిక, నిర్మాణ సంబంధమైన పూర్వోపాదానాలన్నింటినీ (ప్రీ రిక్విజిట్స్) పార్టీ, ప్రభుత్వం చేకూర్చిపెట్టాయి. ఒకప్పుడు కొద్ది కాలంలోనే లోగడ దళిత స్థితిలో వుంటూ వచ్చిన వేలాది సమిష్టి వ్యవసాయక్షేత్రాలు అగ్ర శ్రేణికి చేరుకోగల్గాయి. అయితే అనేక సమిష్టి వ్యవసాయక్షేత్రాలు ఎంతో నెమ్మదిగా పురోగమిస్తున్నాయి. వ్యావసాయికరంగానికి చెందిన పశుగణక్షేత్రాలనే తీసుకొంటే, వేగంగా అభివృద్ధిచెందిన క్షేత్రాలు ప్రతి జిల్లాలోను మనకు కన్పిస్తాయి; ఒక్క సంవత్సరంలోనే అవి మాంసాన్ని, పాడిని రెండింతలు, మూడింతలు చేశాయి. అయితే చాలా తక్కువ ఉత్పత్తి సూచికలుగల సమిష్టివ్యవసాయక్షేత్రాలు కూడా మనకు తరచుగానే కన్పిస్తున్నాయి.

వ్యావసాయిక రంగంలో, ముఖ్యంగా పశుగణాభివృద్ధి విషయంలో, అందుబాటులో వున్న సదవకాశాలన్నింటినీ పూర్తిగా వినియోగించుకొనేందుకు ఇకవున్న అవరోధం ఏమిటి? నిర్మాణ సంబంధమైన కృషిలోని బలహీనతే అందుకు ప్రధాన కారణమని చెప్పవలసి వుంటుంది.

ప్రతి సమిష్టి వ్యవసాయ క్షేత్రంలో వుండే నిర్దిష్ట పరిస్థితికి తగినట్లుగా అనేకమంది జిల్లా అధికారులు వ్యవహరించటంలేదు. నాయకత్వంలోని లోపాలను ఆ విషయం వ్యక్తంచేస్తోంది. సమిష్టి వ్యవసాయక్షేత్రాలకు వారు ఒసగే నాయకత్వం లాంఛనపూర్వకమైనది మాత్రమే; వారిలో వాస్తవిక విషయపరిజ్ఞానం లోపిస్తోంది. కీలకసమస్యలను-ప్రతిక్షేత్రంయొక్క అభివృద్ధికి సరియైన ప్రణాళికవేయడం, సమిష్టి వ్యవసాయదారుల శ్రామికకృషిని నిర్మాణయుక్తంగా వినియోగించటం - తరచు వారు తమదృష్టిలో వుంచుకొనే వుంచుకోటంలేదు. తత్ఫలితంగా నూతనాంశాలు తరచు స్వతంత్రంగా, సద్యోజాతంగా పరిస్థితులను ఛేదించుకొని ముందుకొస్తున్నాయి. ఇది సాధారణపద్ధతేనా? కాదు. మొట్టమొదట అత్యున్నత అనుభవంలోని సారాంశాన్ని మీరు పరిశీలించాలి. అటుపిమ్మట వెనకబడవున్న సమిష్టి వ్యవసాయక్షేత్రానికో, శ్రమదళం వద్దకో వెళ్ళి, పురోగామి అనుభ

వాన్ని ప్రవేశపెట్టేందుకు శాయశక్తులా సాయపడాలి; ఆ అనుభవాన్ని ఉదాహరణగా తీసుకొని, అత్యంత సమర్థవంతంగా పనులను నిర్వహించట మెలాగో సమిష్టి వ్యవసాయదారులకు చూపించాలి. నాయకత్వంలో వుండవలసిన ప్రధాన విషయం ఇదే.

క్షణం తీరిక వుండని " సోమరిపోతుల " తరగతికి చెందిన అనేకమంది ఈనాటికీ నాయకస్థానాలు ఆక్రమించుకొని కూర్చున్నారు. వారిని చూసీచూడగానే అహర్నిశలు పనిచేసే వారిలాగా కన్పిస్తారు; నిజానికి కావలసినంత పనికూడా వారు చేస్తారు; అయితే ఆ పనివల్ల ఎట్టి ప్రయోజనం వుండదు. వారు జరిపే మహాసభలు అర్థరాత్రివాకా, 'కోడి కూసేదాకా' సాగుతూవుంటాయి; అటుతర్వాత వ్యవసాయ క్షేత్రాలలో మెరుపు పర్యటనకు వుపక్రమిస్తారు; వెనుకబడినవారిని చెడామడా చివాట్లు పెడతారు; ఇంకా ఎక్కువ మహాసభలు ఏర్పాటుచేస్తారు; జనరల్ వుపన్యాసాలు-సాధారణంగా వాటిని ముందే తయారుచేసుకుంటారు-దంచుతారు. "అగ్నిపరీక్షలో నెగ్గమనీ" "కష్టాలను అధిగమించమనీ", "పెద్దమార్పు తీసుకురావాలనీ", "విశ్వాసాన్ని నిల్పుకోమనీ" యిత్యాది ఆదేశాలను వ్యవసాయదారులకు జారీచేస్తారు. కాని, అలాంటి నాయకులు యింతగా కష్టపడ్డా సంవత్సరాంతంలో కూడా పరిస్థితులు ఏమాత్రం బాగుపడక యథాతథంగానే మిగిలిపోతాయి. "నిలువు ఈత ఈదుతున్నాం, గమనం పిసరూ లేదు; గమ్యం అసలేలేదు" అన్నట్టు వుంటుంది. (సభలో సంచలనం)

స్వీకరించే ప్రతిజ్ఞలపట్ల బాధ్యతారహితమైన వైఖరిని మరొక పెద్ద జబ్బుగా మారింది; అనేకమంది పార్టీ, ప్రభుత్వ అధికారులలో ఈజబ్బు నరనరాన జీర్ణించుకుపోయింది.

వివిధ ప్రాంతాలలోను, జిల్లాలలోను సమిష్టి వ్యవసాయ క్షేత్రాలు తమ సోషలిస్టు ప్రతిజ్ఞలను ఎలా నెరవేర్చుతున్నాయో ఒకసారి తనిఖీచేస్తే, మాటలకు చేతలకు మధ్య పెద్ద వ్యత్యాసం వుంటున్నట్లు మనకు కన్పిస్తుంది. నిజానికి ఆ ప్రతిజ్ఞలు నెరవేర్చ డ్డాయో లేదో తనిఖీ చేయటం అంటూ జరుగుతున్నదా ? లేదు. దానిని ఒక నిబంధనగా పాటించటంలేదు ప్రతిజ్ఞలు నెరవేర్చకపోయినప్పుడు నైతికంగాగానీ, భౌతికంగాగానీ, ఎలాంటి బాధ్యతా ఎవరు వహించడం లేదు.

పెద్ద పెద్ద ప్రతిజ్ఞలను స్వీకరించేవారి పేర్లు పత్రికలలోను, రేడియోలలోను కొండ కెత్తబడతాయి; కాని, తాము స్వీకరించిన ప్రతిజ్ఞలను విధిగా నెరవేర్చాల్సిన బాధ్యత వున్నప్పటికీ, వారు వాటిని నిల్పుకోటంలో విఫలమైనప్పుడు అలాంటి వారిని గురించి తూర్పారపట్టటంలేదు. తాము స్వీకరించే ప్రతిజ్ఞల విషయంలో వారు మరింత హెచ్చు బాధ్యతాయుతంగా ప్రవర్తించేటట్లు చేయాలి. ఒకసారి నీవు ప్రతిజ్ఞ స్వీకరిస్తే ఆరు నూరైనా, నూరు ఆరైనా దానిని నెరవేర్చాలి.

"ఆడినమాట తప్పరు" అన్న లోకోక్తిని గుర్తుంచుకోవాలి.

నిర్మాణ సంబంధమైన కృషిని, ముఖ్యంగా జిల్లాలస్థాయిలో, గట్టిపట్టుదలతో మెరుగుపర్చుకోవలసి వుంటుందనీ, మన కార్యకర్తల కృషినీ, వారి అభివృద్ధినీ కడుజాగరూకతతో గమనిస్తుండాలనీ, ప్రజలను సమీకరించే కళలో వారిని దిట్టలుగా తయారుచేయాలనీ పైన పేర్కొన్నదానినిబట్టి స్పష్టమవుతోంది.

జిల్లా స్థాయిలో వుండే పార్టీ, ప్రభుత్వ అధికారులకు మహత్తర ప్రాధాన్యం గలదని పార్టీ ఎల్లప్పుడూ చెప్తూనే వచ్చింది. ఎందుకంటే పార్టీ, ప్రభుత్వ నిర్ణయాలు అమలుజరగటం అన్న విషయం వారిపైననే చాలావరకు ఆధారపడి వుంటుంది. ఈ విషయంలో పార్టీకృషి చాలావరకు సఫలమైందనే చెప్పాలి. తత్ఫలితంగా జిల్లాలలోని కార్యకర్తలు చాలామంది నిజమైన ప్రజానిర్మాతలుగాను, నాయకులుగాను, అభివృద్ధిచెందారు. అయితే అనేకసందర్భాలలో, ఈనాటి అవసరాలకు తగినంతగా జిల్లాసంస్థల కృషి లేదన్న విషయం విస్మరించేందుకు వీలులేదు.

యంత్రాల, ట్రాక్టర్ల కేంద్రాలలో తగినంతమందిలేరనీ, సమిష్టివ్యవసాయ క్షేత్రాలలో తగినంతమంది నాయకవ్యక్తులులేరనీ లోగడ మనం సరిగానే హెచ్చరిస్తూ వచ్చాం. అలాంటి కార్యకర్తల సంఖ్యను పార్టీ ఎక్కువచేసినమాట నిజమే. అయితే అంతా సవ్యంగానే వుందని చెప్పగలిగిన పరిస్థితి మాత్రం యింకా ఏర్పడ లేదు. ఈ కృషిని విడవకుండా మనం కొనసాగించాలి. అయితే జిల్లాస్థాయిలో అంటే జిల్లా పార్టీ కమిటీలలోను, జిల్లా సోవియట్ కార్యనిర్వాహక వర్గాలలోను, కార్యకర్తలకు సంబంధించిన పెద్దలోపం ప్రస్తుతం వున్నది. జిల్లాకమిటీల యొక్క నిర్మాణ కార్యకలాపాలు ఉండవలసినంత బాగుగాలేవు.

వ్యవసాయాభివృద్ధిని సాధించటంలో దేశం యిప్పుడు గురుతర కర్తవ్యాలను నిర్వహించవలసివుంది కనుక జిల్లాకమిటీలలో యింకా ఎక్కువమంది అనుభవజ్ఞులూ, సమర్థవంతులూ అయిన కార్యకర్తలు వుండాలి. దీని ప్రాధాన్యం ప్రత్యేకంగా అధిక మైంది. గ్రామీణ ప్రాథమిక పార్టీ యూనిట్లలోను, యంత్ర, ట్రాక్టర్ కేంద్రాల లోను, సమిష్టి, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలలోను, జిల్లా స్థాయిలోవున్న ఉద్యో గులు స్వయంగా పనిచేస్తుంటారు. వస్తుసంపదను ఉత్పత్తి చేసే స్త్రీ పురుషుల శ్రామిక కృషిని వారు సమీకరిస్తారు. తత్కారణంగా వారు సాగించే కార్య కలాపాలపైననే మనం తలపెట్టిన కార్యభారాల జయాపజయాలు చాలావరకు ఆధార పడి వుంటాయి.

జిల్లా కమిటీల్లోని నాయకస్థానాలలోను, జిల్లా సోవియట్ల కార్య నిర్వాహకవర్గాల్లోని నాయక స్థానాలలోను సుశిక్షితులైన కమ్యూనిస్టులను, ఉత్పత్తి లోని మంచిచెడ్డలు తెలిసిన ఉత్సాహవంతులైన ప్రజానిర్మాతలను నింపేటట్లు మనం చూడవలసివుంది. వ్యవసాయ సంబంధమైన పరిజ్ఞానంలేనిదే జిల్లా ఉద్యోగులు తమ విధులను సరిగా నిర్వర్తించనూలేరు; సమిష్టి వ్యవసాయ దారులలోను, యంత్ర

ట్రాక్టర్ కేంద్రాలలోని కార్మికులలోను, ప్రభుత్వ క్షేత్రాల కార్మికులలోను గౌరవ మన్ననలను పొందనూలేరు.

పార్టీ పనిలోని ప్రధానాంశాలలో ఆర్థికాభివృద్ధి అన్నది ఒకటి. ఒకానొక పార్టీ అధికారిచేసిన కృషి మంచిచెడ్డలను ఆయన ఆధ్వర్యంలోవున్న ఆర్థిక యూనిట్ సాధించిన సత్ఫలితాలను ఆధారం చేసుకొని ముఖ్యంగా నిర్ణయించాలి. ఈ అంశాన్ని గ్రహించలేని అధికారులకు ఆర్థికాభివృద్ధి కృషికి సారథ్యం వహించగలిగిన సామర్థ్యం ఉండదు; పార్టీపనికి తగదుకనుక అలాంటివానిని సకాలంలో తొలగించాలి. ప్రభుత్వం సమిష్టి వ్యవసాయ క్షేత్రాలలో అభివృద్ధిచెందిన స్థానిక కార్యకర్తలను జిల్లా స్థాయికి ప్రమోట్ చేయటంద్వారాను, అలాగే పట్టణాలలోనుంచి, పారిశ్రామిక కేంద్రాలనుంచి వ్యక్తులనుతీసుకొచ్చి జిల్లా స్థాయి కార్యకలాపాలలో నియమించటం ద్వారాను జిల్లా పార్టీ యూనిట్లను ఇక ముందుకూడా పటిష్ఠతర మొనర్చుతూండాలి.

కామ్రేడ్స్, నాయకస్థానాలలోగల వ్యక్తుల భౌతిక బాధ్యతలనుకూడా పెంచవలసిన అవసరముందని వేరే చెప్పనవసరంలేదు; అందుకోసం వారి వేతనాలు కొంతవరకు ఫలితాలనుబట్టికూడ నిర్ధారించబడుతూ వుండాలి. ప్రణాళికను పూర్తి చేసినా, లేక దానిని మించిపోయినా వారు ఎక్కువ డబ్బుపొందటానికి అర్హులు; ప్రణాళికను పూర్తిచేయకపోతే వారి వేతనాలు తగ్గితీరాలి. పార్టీ అధికారులు నిర్వహించాల్సిన బాధ్యతలు నిర్మాణ, సిద్ధాంత రంగాలకు సంబంధించి వుంటాయి కనుక, ఆర్థిక కార్యకలాపాల ఫలితాలతో వారికి ప్రత్యక్ష సంబంధం వుండదు కనుక వారి విషయంలో పై సూత్రాన్ని వర్తింపచేయ వీలులేదని కొందరు అభ్యంతరం చెప్పవచ్చు. అయితే పార్టీనిర్మాణకృషి ఉత్పత్తిపై ప్రయోజనకరమైన ప్రభావాన్ని ప్రసరించకపోయినప్పుడు దానిని సఫలీకృతమైన కృషిగా పరిగణించవచ్చా? ఉత్పత్తిని యితోధికంచేసే కర్తవ్యంతో జతపర్చకుండా పార్టీ నిర్మాణ, సిద్ధాంత కృషిని కొనసాగించటం అంటే అర్థం ఎలాంటి ప్రయోజనంలేని పని చేస్తుండటమే కాగలదు.

పార్టీ నిర్మాణకృషికి సంబంధించిన లోపాలు గ్రామీణ ప్రాంతాలకు మాత్రమే పరిమితమైలేవు; పట్టణ పార్టీయూనిట్లలోకూడ మనకు అలాంటి లోపాలు కనిపిస్తాయి. నిజమే; పరిశ్రమలకు సంబంధించినంతవరకు పరిస్థితి మొత్తంమీద కొంత మెరుగుగానేవుంది. అయితే యీ రంగంలోకూడా పురోగామి పరిశ్రమలు, వ్యష్టి కర్మాగారాలతోపాటు వెనకబడివున్నవాటి సంఖ్యకూడా ఏమంత ఎక్కువగాలేదు. అలా వెనకబడి వుండటానికిగల కారణాలలో ఒకటి ఆ పరిశ్రమలలోని పార్టీ యూనిట్లు నూతనమైన, అభివృద్ధికరమైన పద్ధతులను ముందుకు తీసుకొచ్చేందుకు తగినంత సమధికోత్సాహంతో పాటుబడకపోవటమూ, దళితస్థితికీ, జడత్వానికీ వ్యతిరేకంగాగట్టి పోరాటం సాగించకపోవటమూ అని చెప్పాలి.

పార్టీ యూనిట్లను ఎదుర్కొంటున్న కర్తవ్యాలతో సరితూగగల నిర్మాణ కృషి రూపాలను రూపొందించుకొనటంపైననే పార్టీనిర్మాణకృషి చాలావరకు ఆధార

పడివుంటుంది. మారుతున్న పరిస్థితులకు అనుగుణంగా పనిపద్ధతులను, పార్టీయూనిట్ల స్వరూపాన్ని ఎప్పటికప్పుడు చక్కదిద్దుకుంటూ, అన్వర్తించుకోవాలి. ఇది స్థానిక పార్టీయూనిట్లకేకాక, సోవియట్ కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీకి సైతం వర్తిస్తుంది.

పార్టీయూనిట్ల స్వరూపాన్ని తిరిగి మూసలోపోసి, వాటిల్లోయింకా ఎక్కువ కార్యకర్తలు పనిచేసేటట్లు చూడటానికి గత దశలో అనేక చర్యలు గైకొనబడ్డాయి. గ్రామీణప్రాంతంలో పార్టీ నిర్మాణకృషిని మెరుగుపర్చాలంటే గ్రామీణ జిల్లా పార్టీ కమిటీల స్వరూపాన్ని మార్చకతప్పదని కేంద్రకమిటీ గుర్తించింది. ఆ యా జిల్లా కమిటీల, కార్యదర్శుల నాయకత్వాన అధ్యాపక దళాలను ఆ యా ట్రాక్టర్, యంత్రాల కేంద్రాలకు నియమించాము. అలా నియమించినందువల్ల వారు స్వయంగా కొన్నికొన్ని వ్యవసాయక్షేత్రాలలో పార్టీ నిర్మాణకృషికి సంబంధించిన నిర్దిష్ట కర్తవ్యాలను నిర్వహించవలసి వస్తుంది. అప్పుడు ఆ వ్యవసాయక్షేత్రాలలోని కృషి బాగుపడుతుందని భావించాం. అందువల్ల అట్లాంటి పునర్నిర్మాణం తప్పనిసరి అవుతుంది.

అయితే, ఈ చర్య తీసుకొన్నందువల్ల సర్వే సర్వత్రా సత్ఫలితాలు కలిగాయని మాత్రం చెప్పలేము. ఇందుకు కారణం ఏమిటి? ట్రాక్టర్, యంత్ర కేంద్రాలకు జిల్లా పార్టీ కమిటీల కార్యదర్శులను నియమించినందువల్లా, అధ్యాపక దళాలను ఏర్పరచినందువల్లా జిల్లా కమిటీ ప్రథమ కార్యదర్శి ఇంతకు పూర్వంలాగానే, ట్రాక్టర్, యంత్ర కేంద్రాలు, సమిష్టి వ్యవసాయ క్షేత్రాల సారథ్యంనుంచి దూరమై పోవటం సంభవించిందని కొందరు వాదిస్తున్నారు; దీనివల్లనే జిల్లా స్థాయిలో జనరల్ వ్యవసాయ నాయకత్వం దెబ్బతిన్నట్టుగా వారు పేర్కొంటున్నారు. అయితే పాత నాయకత్వ పద్ధతులను పునరుద్ధరించాలని కోరుకుంటున్న వ్యక్తులే అలాంటి ప్రకటనలు చేస్తున్నారు. పాత నాయకత్వ పద్ధతులవల్ల గ్రామీణ ప్రాంతాలలోని కృషికి వ్యక్తిగత బాధ్యత వహించటం అన్నది చాలావరకు లేకుండా పోయిందన్న విషయం మనం గుర్తుంచుకోవాలి.

జిల్లా పార్టీకమిటీల కార్యదర్శుల కృషినీ, మెషిన్, ట్రాక్టర్ కేంద్రాలలో పనిచేస్తున్న అధ్యాపకుల కృషినీ జిల్లాపార్టీ కమిటీలు, జిల్లాకమిటీల ప్రథమ కార్యదర్శులు సక్రమంగా నడపటంద్వారా సమిష్టి వ్యవసాయదారులు సాగించే నిర్మాణ కృషినిబాగుపర్చవచ్చు. నిర్మాణాన్ని ఎక్కడైతే సరియైనదారిలోకి తెచ్చారో అక్కడల్లా పరిస్థితి బాగుపడింది.

అనేక జిల్లాలలో జిల్లాకమిటీల కార్యదర్శులుగాను, మెషిన్ ట్రాక్టర్ కేంద్రాలలో అధ్యాపకులుగాను ఆ పదవులకు అవసరమైనంత రాజకీయ పరిజ్ఞానం, తదితరఅర్హతలు లేనివారిని నియమించారు; అలానియమించబడినవారు తమబాధ్యతలను సరిగా నిర్వహించలేకపోయారు. ఈ పునర్వ్యవస్థీకరణవల్ల సర్వే సర్వత్రా సత్ఫలితాలు కలగకపోవటానికి ప్రధానకారణం యిదే.

జిల్లా పార్టీ కమిటీల స్వరూపాన్ని మనం తిరిగి మార్చుకోవలసివుందని కొంత మంది కామ్రేడ్స్ అంటున్నారు. అలాంటి పనికి పూనుకొనేముందు మనం ఒకటికి రెండుసార్లు ఆలోచించుకోటం మంచిది. మళ్ళీ కొత్తరకమైన పునర్వ్యవస్థీకరణను అమలుజరపటం ఏమంత ప్రయోజనకరమైనదిగా తోచటంలేదు. ప్రజలలో బాగా పనిచేయగలిగిన మంచిమంచి అగ్రనేతలను అవసరమైనచోట్ల జిల్లాకమిటీల కార్యదర్శులుగా నియమించి, తద్వారా కార్యకర్తలను పటిష్టం చేయటం మంచిది. పార్టీనాయకత్వాన్ని వుత్పత్తికి సన్నిహితంగా తీసుకురావాలన్న విధానాన్ని పాటిస్తుండటం అవసరం; పార్టీ కార్యకలాపాలలో వ్యక్తిగత బాధ్యతను తిరిగి పూర్తిగా పునరుద్ధరించాలి.

రష్యన్ ఫెడరేషన్‌లోని వివిధ మండలాలలో, వివిధ ప్రదేశాలలో పార్టీ నాయకత్వాన్ని బాగా మెరుగుపర్చటం అన్నది తక్షణావసరమైన విషయంగా పార్టీ కేంద్రకమిటీ పరిగణిస్తోంది. రష్యన్ ఫెడరేషన్‌లో 78 ప్రదేశాలు, మండలాలు, స్వయంపాలిత రిపబ్లిక్‌లు ఉన్నాయి. వాటన్నిటిలోను విభిన్నమైన పరిస్థితులు, విశిష్టమైన లక్షణాలు ఉన్నాయి. రష్యన్ ఫెడరేషన్‌లోని వివిధమండలాలలోను, ప్రదేశాలలోను, స్వయంపాలిత రిపబ్లిక్‌లలోను మరింత నిర్దిష్టమైన కార్యనిర్వాహణ నాయకత్వం నెలకొనేటట్టు చూసే నిమిత్తం ప్రత్యేకమైన కేంద్రపార్టీ సంస్థ నొకదానిని స్థాపించటం అవసరం. అందుకోసం రష్యన్ ఫెడరేషన్ వ్యవహారాలను చూసేందుకై కేంద్రకమిటీ తరఫున ఒక బ్యూరోను నియమించటం అవసరమని కేంద్రకమిట భావిస్తోంది.

పార్టీ నిర్మాణ, రాజకీయ కార్యకలాపాలను బాగుపర్చాలంటే, కార్యకర్తలను ఎంచుకోటానికీ, కేటాయించటానికీ ప్రత్యేక ప్రాధాన్యం వున్నదని కేంద్రకమిటీ అభిప్రాయపడుతోంది; కార్యకర్తలసిద్ధాంత పునాదినీ, జనరల్ అవ్వాతలనూ పెంపొందించటంఎంతో అవసరమని కేంద్రకమిటీ భావిస్తోంది. పార్టీకి, ప్రభుత్వానికి, ఆర్థిక రంగానికిచెందిన విభిన్న శాఖలలో పనిచేసేందుకు పార్టీ అనేకమంది కార్యకర్తలను అభివృద్ధిచేసి, సిద్ధాంత శిక్షణగరపి, రాటుదేరేటట్లు చేసినందుకు పార్టీ గర్వపడవచ్చు.

అయితే పార్టీ కార్యకర్తలను అభివృద్ధి చేయడంలోగల ప్రమాదకరమైన లోపాలను, పొరపాట్లను గమనించకపోవడం పొరపాటే అవుతుంది. ఉదాహరణకు పార్టీ పాఠశాలలలో పట్టాలుపొందిన విద్యార్థులకు ఆచరణ సంబంధమైన ఆర్థిక విషయాలకుచెందిన మూలసూత్రా లేమిటోకూడా తెలియకుండా పోవటం తరచు జరుగుతోంది. అందుచేత కార్యకర్తలకు శిక్షణ గరిపేందుకు ఉద్దేశించబడిన పార్టీపాఠశాలలను పునర్వ్యవస్థీకరించి వాటిలో శిక్షణపొందే విద్యార్థులకు మార్క్సిస్టు-లెనినిస్టు సిద్ధాంతాలను బోధించటంతోపాటు ఉత్పత్తికి సంబంధించిన కీలకవిషయాలనుకూడా నేర్పాలి. ఉన్నత పార్టీపాఠశాలలలో శిక్షణపొందే విద్యార్థులకు ఉన్నత మార్క్సిస్టు విద్యను బోధించటంతోపాటు సాంకేతిక పాఠశాలలలోని పాఠ్యవిషయాలకు సరితూగ

గలిగినవిధంగా ఏదో ఒక పారిశ్రామిక శాఖలోనో, వ్యావసాయిక శాఖలోనో ఆచరణయుక్తమైన విషయ పరిజ్ఞానాన్ని ఇవ్వాలి.

పాత కార్యకర్తలను సక్రమంగా వినియోగించుకొంటూనే, మరొకప్రక్క ఆచరణయుక్తమైన కృషిలో తమ సామర్థ్యాన్ని నిరూపించుకొన్న యువజనులను సాహసించి నాయకత్వ స్థానాలలో నియమించాలన్న సూత్రాన్ని అనేక పార్టీ సంస్థలు పాటించటంలేదు.

అలాగే నాయకత్వ స్థానాలకు స్త్రీలను ప్రమోట్ చేయటంలో అనేక పార్టీ సంస్థలు, సోవియట్ సంస్థలు బెదురుతున్నాయి. అలాంటి వ్యవహారాన్ని చూస్తూ మిన్నకుండజాలం. పార్టీ నాయకత్వ స్థానాలలోను, ప్రభుత్వ పదవుల లోను, ముఖ్యంగా పార్టీ కమిటీల కార్యదర్శులుగాను, శ్రామిక ప్రజా ప్రతినిధుల సోవియట్ల కార్యవర్గాలలోను, పారిశ్రామిక, ప్రభుత్వ సమిష్టి వ్యవసాయ క్షేత్రాల మెషీన్, ట్రాక్టర్ కేంద్రాల వ్యవహర్తలుగాను బహుకొద్దిమంది స్త్రీలు మాత్రమే పనిచేస్తున్నారు.

కార్యకర్తలను చీటికిమాటికి యిక్కడనుంచి అక్కడకు, అక్కడనుంచి యిక్కడకు మార్చుతున్నారు. రెండు ప్రధానమైన లోపాల వల్ల అది జరుగుతోంది. కార్యకర్తలను ఎంచుకొని శిక్షణగరపటంలోగల లోపం మొదటిది; ఉద్యోగులను అనవసరంగా ఒక పనినుంచి మరొకపనికి మార్చుతూండటం రెండవ కారణం. కార్యకర్తలగురించి, వారి గుణగణాల గురించి పరిశీలన జరపటంలో పార్టీసంస్థలు తరచుగా పైపైన మాత్రమే చూస్తున్నారు; కొన్ని సందర్భాలలో రాజకీయ, తదితర అర్హతలను పరిగణనలోకితీసుకోకుండా ప్రమోట్ చేస్తున్నారు; ఒకచోటనుంచి మరొకచోటకు మార్చుతున్నారు.

ఈనాడు పార్టీని ఎదుర్కొంటున్న కర్తవ్యాలను జయప్రదంగా నిర్వర్తించాలంటే పార్టీ సభ్యులను జాతీయ ఆర్థికవిధానంలో సక్రమంగా కేటాయించటం ఎంతో ప్రధానం. జాతీయార్థికవిధానంలోని అనేక శాఖలలో పనిచేస్తున్న చాలా మంది కమ్యూనిస్టులు నిర్ణయాత్మకమైన ఉత్పత్తిక్రమాలతో ఎలాంటి సంబంధంలేని పనిపాటలలో నిమగ్నమైవుండటం చాలా శోచనీయమైన పరిస్థితి. ఉదాహరణకు బొగ్గు పారిశ్రామిక సంస్థలలో 90 వేలమంది కమ్యూనిస్టులు పనిచేస్తుంటే, వారిలో 38 వేలమంది మాత్రమే బొగ్గుగనులలో ప్రత్యక్షంగా పనిచేస్తున్నారు. కమ్యూనిస్టుపార్టీ సభ్యులుగానీ, క్యాండిడేట్ సభ్యులుగానీ 30 లక్షల మందికిపైగా గ్రామీణప్రాంతాలలో నివసిస్తున్నారు. వారిలో సగంకన్నా తక్కువమంది మాత్రమే సమిష్టి, ప్రభుత్వ వ్యవసాయక్షేత్రాలలోను, మెషీన్, ట్రాక్టర్ కేంద్రాలలోను పనిచేస్తున్నారు.

పార్టీ అభివృద్ధిని క్రమబద్ధంచేసే విషయంపట్ల, ముఖ్యంగా పార్టీసభ్యత్వంలో పారిశ్రామిక కార్మికుల నిష్పత్తిని యితోధికంచేసే విషయంపట్ల స్థానికపార్టీ కమిటీలు తగినంత శ్రద్ధ చూపటంలేదు; స్థానిక పార్టీ కమిటీల నిర్మాణ కృషిలోని ప్రమాదకర

లోపాలలో అదొకటి. పార్టీలోకి తీసుకొనే కొత్తసభ్యులలో హెచ్చుమంది అగ్రగామి కార్మికులు, ముఖ్యంగా కీలక వృత్తులలో పనిచేస్తున్నవారు, అగ్రగామి సమిష్టి వ్యవసాయదారులు, సోవియట్ మేధావివర్గంలోని అత్యుత్తములు ఉండేటట్లు చూడాలి.

లక్షల సంఖ్యలోగల పారిశ్రామిక, వృత్తి, ఆఫీసు కార్మికులను అభివృద్ధి చేయటంలో ట్రేడ్‌యూనియన్లు ప్రముఖపాత్ర నిర్వహించవలసి వుంటుంది. అలాగే వుత్పత్తిని యితోధికంచేసి, మెరుగుపర్చేందుకు వారి సృజనాత్మకశక్తులను సరియైన పద్ధతిలో నడపటంలోను, శ్రామికప్రజల జీవనప్రమాణాన్ని పెంపొందించటంలోను, వారి సాంస్కృతిక, సాంకేతిక స్థాయిని పెంపొందించటంలోను ట్రేడ్‌యూనియన్లు పెద్ద పాత్ర నిర్వహించవలసి వుంటుంది. అయినప్పటికీ, ట్రేడ్‌యూనియన్లయొక్క కార్యకలాపాల స్థాయిమాత్రం అవసరాలకు తగినంతగా లేదు; పార్టీ నిర్దేశించిన కర్తవ్యాలను నిర్వర్తించటానికి ఆ కార్యకలాపాలస్థాయి ఏమాత్రం సరిపోదు. సోవియట్ ట్రేడ్‌యూనియన్ల కేంద్రకౌన్సిల్‌తోసహా, మన ట్రేడ్‌యూనియన్ సంస్థ లన్నింటియొక్క కార్యకలాపాలలోను, ప్రధానంగా పోరాటపటిమ, సృజనాత్మక ఉద్వేగం, నిశితమైన వైఖరి, సిద్ధాంతానికి కట్టుబడివుండటం లోపిస్తోంది; కీలక ప్రాధాన్యంగల సమస్యలను-అవి శ్రామికోత్పాదకశక్తి పెంపుదలకు సంబంధించిన చర్యలే కావచ్చు; లేదా వేతనాలకు, గృహనిర్మాణానికి, కార్మికుల తదితర ఉద్యోగుల నిత్యజీవితావసరాలకు సంబంధించిన సమస్యలే కావచ్చు - వెలుగులోకి తెచ్చే విషయంలో ఆ సంస్థలు చొరవను ప్రదర్శించటంలేదు. ప్రతి పారిశ్రామిక సంస్థలోను ఉమ్మడి ఒప్పందాలు కుదుర్చుకోటం జరుగుతున్నా, వాటిని అమలు జరపకపోవటం తరచు సంభవిస్తోంది. అమలు జరుగుతున్నా, అంతా సవ్యంగానే వున్నట్లు ట్రేడ్‌యూనియన్లు నోరు మూసుకొని కూర్చుంటున్నాయి. ఒక్కమాటలో చెప్పాలంటే పారిశ్రామిక నిర్వాహకులతో ట్రేడ్‌యూనియన్లకు ఎలాంటి వివాదాలు లేకుండా పోయాయి; వారిద్దరిమధ్యా శాంతి, సామరస్యం నెలకొన్నాయి. అయితే, మన ఆశయానికి సంబంధించిన ప్రయోజనాలకు భంగం రాకుండా అంకట్టే నిమిత్తం సంబంధాలు బెడిసిపోయినా జంకవలసిన అవసరం లేదు; కొన్ని సందర్భాలలో మంచి కీచులాట ప్రయోజనకరంగా వుంటుంది.

పరిపాలనకు, నిర్వహణకు చెందిన నిజమైన లెనినిస్టు పాఠశాలలగా ట్రేడ్‌యూనియన్లను మనం మార్చవలసివుంటుంది. లక్షలాది ఫ్యాక్టరీ, ఆఫీసు, తదితర కార్మికులకు కమ్యూనిజాన్ని బోధించే పాఠశాలగా వాటిని మార్చాలి. దీనిని సాధించటంలో మన పార్టీ ట్రేడ్‌యూనియన్లకు ఆచరణరీత్యా యిప్పటికన్నా ఎక్కువగా సహాయపడాలి. ఉత్పత్తి మహాసభలను, ఉత్సాహవంతులైన పారిశ్రామిక కార్మికుల సమావేశాలను యిప్పటికన్నా ఎక్కువగా ట్రేడ్‌యూనియన్లు ఉపయోగించుకోవాలి. ఉత్పత్తి నిర్వహణలో కార్మికుల పాత్రనుపెంచే యితర రూపాలనుకూడా యింకా ఎక్కువగా వినియోగించుకోవాలి.

మన దేశ సామాజిక జీవనంలో మహోన్నతమైన లెనినిస్టు యువక కమ్యూనిస్టు సమితి అత్యంత ప్రధానస్థానం అలంకరిస్తోంది. 1 కోటీ 80 లక్షల మందికి పైగా యువతీయువకులు అందులో సమీకృతమై వున్నారు. ఆర్థిక, సాంస్కృతికాభివృద్ధి కార్యక్రమంలో యువక కమ్యూనిస్టు సమితి క్రియాత్మకపాత్ర నిర్వహిస్తోంది. కమ్యూనిస్టు భావాలను యువతీయువకులకు రంగరించి నూరిపోయటంలో పార్టీకి అది తోడ్పడుతోంది. అయితే, యువక కమ్యూనిస్టుసమితి సంస్థల కార్యకలాపాలలో ముఖ్యంగా సిద్ధాంత, విద్యాసంబంధమైన కృషిలో ప్రధానమైన లోపాలు ఉన్నాయి. ఆచరణయుక్తమైన కార్యకలాపాలలో యువకులను సమీకరించటంలో యువక కమ్యూనిస్టుసమితి సంస్థలు విఫలమైన ఉదంతాలు అనేకం ఉన్నాయి. నడుంవంచి పనిచేయటానికి మారుగా తీర్మానాలు చేయటం, పెద్దపెద్ద బహిరంగ సభలను ఆర్భాటంగా జరపటంవంటి పెడధోరణి కన్పిస్తోంది. ఈ లోపాలన్నింటినీ తొలగించాలంటే, యువక కమ్యూనిస్టుసమితిని నడపటంలో పార్టీ కృషిని బాగుపర్చుకోటం ముఖ్యావసరం. ఎందుకంటే యువక కమ్యూనిస్టు సమితి బలానికీ, సృజనాత్మకశక్తికీ మూలం అదే.

సోవియట్ కమ్యూనిస్టుపార్టీ నిబంధనావళిలో కొన్ని పాక్షికమైన మార్పులు చేయవలసిన అవసరం ఏర్పడింది; పార్టీ నిర్మాణ కార్యకలాపాలను బాగుపర్చటంకోసం ఆ మార్పులు తప్పనిసరి అవుతున్నాయి. పార్టీ నిబంధనావళిలోని కొన్ని నిబంధనలు పార్టీ జీవితంలో పరిణితి చెందిన ప్రమాణాంకు అనుగుణంగాలేవని అనుభవంలో రుజువైంది. పార్టీ ప్రాంతీయ కమిటీలు, ప్రదేశ కమిటీలు, యూనియన్ రిపబ్లిక్‌లలోని కేంద్ర కమిటీలు, అలాగే కొన్ని జిల్లా, నగర కమిటీలు యిప్పుడు నలుగురు లేక అయిదుగురు కార్యదర్శులను కలిగియున్నాయి; అయితే నిబంధనావళిలో ముగ్గురు కార్యదర్శులు మాత్రమే ఉండవచ్చునని పేర్కొనబడింది. పార్టీ సంస్థలు ప్రతిపాదించిన సూచనలకు అనుగుణంగా పార్టీ కమిటీల విస్తృత సమావేశాలకు సంబంధించిన నిబంధనలను మార్పు చేశాం. నిబంధనావళిలో ఈ మార్పులు వ్యక్తం కావాలి. పార్టీ మహాసభలను జరపటానికి సంబంధించిన నిబంధనలను మార్చవలసివుందని దేశంలోని పలు ప్రాంతాలకు చెందిన పార్టీ కమిటీలు సూచించటం ముదావహం. యూనియన్ రిపబ్లిక్‌లలోను, వివిధ ప్రదేశాలలోనూ, మండలాలలోను, ప్రాంతాలలోను, నగరాలలోను (అనేక జిల్లాలుగా విభజించబడిన నగరాలు) రెండేళ్ళకు ఒకసారి కమ్యూనిస్టుపార్టీ మహాసభలను జరుపుతూండటం సరియైన పద్ధతి. వివిధ మండలాలుగా విభజించబడిన యూనియన్ రిపబ్లికులలో (యూక్రెయిన్, బైలో రష్యా, కజఖ్‌స్తాన్, ఉజ్‌బెకిస్తాన్) నాలుగేళ్ళకు ఒకసారి కమ్యూనిస్టుపార్టీ మహాసభలు జరపాలి.

గత పార్టీ మహాసభలో కేంద్రకమిటీ కంట్రోలు కమిషన్‌ను పార్టీకంట్రోల్ కమిషన్‌గా మార్చటానికి నిర్ణయించాం; వివిధ రిపబ్లిక్‌లలోను, ప్రదేశాలలోను, మండలాలలోను ఆయా స్థానిక పార్టీలతో నిమిత్తం లేకుండానే తన ప్రతినిధులను

ఆ యా ప్రాంతాలలో నియమించే అధికారం పార్టీ కంట్రోలు కమిషన్‌కు ఒసగ బడింది. అలాంటి ప్రతినిధుల అవసరం ఏమాత్రం లేకే లేదని ఆచరణలో రుజువైంది.

పార్టీ నిబంధనావళికి సంబంధించిన ముసాయిదా సవరణలు మహాసభ ప్రతినిధు లందరికీ అందాయికనుక ఇక వాటినిగురించి నే నిక్కడ ప్రస్తావించను.

పార్టీసంస్థలు, పార్టీసభ్యులు అంతాకూడా అనుదిన కార్యకలాపాలలో పార్టీ నిబంధనలను పాటిస్తున్నారా, లేదా అన్నదానిని మనం జాగ్రత్తగా కనిపెట్టు తుండాలి. పార్టీనిర్మాణ, కార్యకలాపాల స్థాయి పెంపొందాలంటే పార్టీ నిబంధనలను పాటించటం చాలా ముఖ్యం.

## 3. సిద్ధాంతకృషికి సంబంధించిన కొన్ని సమస్యలు

కామ్రేడ్స్, మనం అప్రతిహతంగా ముందుకుపోవాలంటే కమ్యూనిస్టులకు, జనరల్‌గా ప్రజలకు మార్క్సిస్టు - లెనినిస్టు పరిజ్ఞానం కలుగజేయటం, విప్లవకర సిద్ధాంతాన్ని సృజనాత్మకంగా అభివృద్ధిచేస్తూండటం ఎంతో అవసరం.

మనం సమీక్షించుకొంటున్న దశలో సిద్ధాంత రంగానికి సంబంధించిన కృషిని మెరుగుపర్చడంకోసం కేంద్రకమిటీ అనేక చర్యలు తీసుకొన్నది. మార్క్సిజం-లెనినిజానికి సంబంధించిన మూలగ్రంథాలను చాలా ఎక్కువగా ప్రచురించాం. కారల్ మార్క్స్, ఫ్రెడరిక్ ఏంగెల్స్ రచన లన్నింటినీ కలిపి 30 సంపుటాలుగా ప్రకటించటానికి నిర్ణయించాం. మొదటి సంపుటాలు యిప్పటికే వెలువడ్డాయి. వి. ఐ. లెనిన్ రచనల నన్నింటినీకలిపి 35 సంపుటాలుగా ప్రకటించాం; ఆ సంపుటాల నాలుగో ముద్రణకూడా పూర్తయింది; కమ్యూనిస్టుపార్టీ, సోవియట్ రాజ్య సంస్థాపకులు, నాయకులు అయిన లెనిన్ జీవిత చరిత్రకు సంబంధించిన కొత్త కూర్పును ప్రకటించాం. మార్క్సిజం - లెనినిజం మూలపురుషులు రచించిన గ్రంథాలను పఠించినప్పుడుమాత్రమే మనకు సామాజిక పరిణామక్రమ సూత్రాలను గురించిన సమగ్ర అవగాహన ఏర్పడుతుంది; భవిష్యత్తును స్పష్టంగా చూడగలుగుతాం; కమ్యూనిజం విజయంపొందితీరుతుందన్న సోవియట్ ప్రజల విశ్వాసం యినుమడిస్తుంది; కమ్యూనిస్టు నిర్మాణానికి దోహదమిస్తుంది. పార్టీ మహాసభలలోను, కేంద్రకమిటీ విస్తృత సమావేశాలలోను ఆమోదించబడిన నిర్ణయాలను పార్టీసభ్యులు యింతకు పూర్వంకన్నా యింకా ఎక్కువగా అధ్యయనం చేస్తున్నారు. పార్టీ రూపొందించిన దేశీయ, వైదేశిక విధానాలు ఆ నిర్ణయాలలో స్పష్టీకరించబడ్డాయి.

మార్క్సిజం - లెనినిజానికి సంబంధించిన పరిజ్ఞానం జీర్ణం చేసుకోటంలో కొంత అభివృద్ధి సాధించబడినప్పటికీ, మొత్తంమీదచూస్తే సిద్ధాంతకృషి యిప్పటికీ అసంతృప్తికరంగానే వుందని చెప్పాలి. మన సిద్ధాంతికకృషి ఆచరణయుక్తమైన కమ్యూనిస్టు నిర్మాణంనుంచి వేరుపడిపోవటమే యిప్పుడున్న ప్రధానలోపం అని చెప్పాలి.

1920 లోనే, శాంతియుత నిర్మాణకృషిలోకి పరివర్తనచెందే పరిస్థితులలో ప్రచారానికి సంబంధించిన కర్తవ్యాలు ఎలా నిర్వర్తించాలో వివరిస్తూ లెనిన్ యిలా చెప్పారు: "సోదాహరణంగా కమ్యూనిజంఅంటే ఏమిటో వివరించి చెప్పటం పాత ప్రచారపద్ధతి. అయితే, ఈ పాతప్రచారపద్ధతి యిప్పుడు పనికిరాదు. సోషలిజాన్ని ఎలా నిర్మించాలో మనం ఆచరణలో నిరూపించి చూపించాలి. ఆర్థికాభివృద్ధి కృషిలో సంపాదించిన అనుభవాన్ని ఆధారంచేసికొని మనం యిక ప్రచారం సాగించాలి. మనం నిర్వర్తించవలసిన అతి ముఖ్యమైన కర్తవ్యం యిది. దీనిని ఎవరైనా పాత పద్ధతిలో అర్థంచేసుకొంటే, రైతులలోను, కార్మికులలోను ప్రచారం సాగించే కృషిలో అలాంటివారంతా తప్పకుండా విఫలులవుతారు. మన రాజ్యంయొక్క ఆర్థికాభ్యున్నతిని సాధించటమే యిప్పటి మన ప్రధాన కార్యవిధానం. ఎక్కువ పుట్ల ధాన్యాన్ని పండించాలి; ఎక్కువ టన్నుల బొగ్గును ఉత్పత్తిచేయాలి; అలా ఉత్పత్తి అయిన ధాన్యాన్ని, బొగ్గును సాధ్యమైనంత సక్రమంగా ఉపయోగించటం ఎలా?.........వాటిపైననే మన ఆందోళన, ప్రచారం అంతా ఆధారపడి వుండాలి." (వర్క్స్, 31 వ సంపుటి, 346 వ పేజీ)

మహామేధావియైన లెనిన్ యిచ్చిన ఈ ఆదేశాలను మనం మన కార్యకలాపాలన్నింటిలోను పాటిస్తుండాలి. మార్క్సిస్టు అధ్యయనంపట్ల అలసత్వభావం ప్రదర్శించేవారికి వ్యతిరేకంగాను, మార్క్సిస్టు సిద్ధాంతాన్ని యింకా అభివృద్ధి పర్చాలన్న విషయాన్ని నిర్లక్ష్యం చేసేవారికి వ్యతిరేకంగాను పోరాటం సాగించాలి. అయితే అదేసమయంలో పిడివాదులలాగా మార్క్సిస్టు సిద్ధాంతాన్ని జీవితంనుంచి దూరంచేసి మనం చూడలేము. విప్లవకర సిద్ధాంతం అన్నది ఏవో కొన్ని పడికట్టు సూత్రాల పుట్టకాదు; ప్రపంచాన్ని పరివర్తనీకరించటంలో, కమ్యూనిజాన్ని నిర్మించటంలో కార్యాచరణకు ఉపకరించే సమరశీల మార్గదర్శిని అది. ఆచరణనుంచి దూరమైపోయిన సిద్ధాంతం మృతాత్మకమైనదని మార్క్సిజం - లెనినిజం మనకు ఉపదేశిస్తోంది. అలాగే విప్లవకర సిద్ధాంత దీపికతో తేజోమయంకానట్టి ఆచరణ అంధప్రాయమైనదనికూడా అది ఉపదేశిస్తోంది.

మన పార్టీ కార్యకర్తలు, అందులోనూ ముఖ్యంగా సిద్ధాంతరంగంలోకృషి చేస్తున్నవారు శిరోధార్యమైన ఈ ప్రవచనం ఒకటి ఉందని గమనించారా? గమనించారు; అనేకమంది దానిని కంఠస్థంకూడా చేశారు. అయినప్పటికీ, సిద్ధాంత రంగంలో పనిచేస్తున్న పార్టీ ఉద్యోగులు నేల విడి సాముచేసినట్లు తమ కృషిని సాగిస్తున్నారు; కమ్యూనిస్టు నిర్మాణానికి చెందిన ఆచరణయుక్త కర్తవ్యాల నిర్వహణకు, సిద్ధాంత కృషికి ఎలాంటి సంబంధంలేకుండా చేస్తున్నారు. పైగా, నిత్యాచరణకు, సిద్ధాంత కార్యకలాపాలకుమధ్య సంబంధం ఏర్పరచాలని కొందరు ప్రయత్నిస్తూంటే, అవి సిద్ధాంతాన్ని మకిలిపర్చటమనీ (వల్గరైజేషన్), వినియోగవాదమనీ (యుటిలిటేరియలిజం) వారు ఆరోపిస్తున్నారు; సిద్ధాంత ప్రాధాన్యాన్ని తక్కువ అంచనా వేస్తున్నారని వారు వక్కాణిస్తున్నారు.

అలాగే అర్థశాస్త్రానికి సంబంధించినంతవరకు పరిస్థితికూడా ఏమంత బాగా లేదు; సోవియట్ ఆర్థికవిధానానికి సంబంధించిన వివిధసమస్యలపైన మన ఆర్థిక శాస్త్రవేత్తలు యింతవరకు చెప్పుకోదగిన కృషి ఏమాత్రం జరపనేలేదు; సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ ఏర్పాటుచేసిన మహాసభలలో పారిశ్రామిక, వ్యావసాయిక రంగాలలోని కీలకసమస్యలపై సాగిన చర్చలలో వారు పాల్గొనలేదు. కమ్యూనిస్టు నిర్మాణానికిచెందిన కార్యాచరణ కృషినుంచి మన ఆర్థిక సంస్థలు, ఆ సంస్థలలోపనిచేస్తున్నవారు గణనీయంగా దూరమైపోయారని పై విషయం సూచిస్తోంది.

పెట్టుబడిదారీ విధానపు బంధనాలనుంచి విముక్తమై, నూతన జీవితాన్ని సంతరింపచేసుకొంటున్న కోటానుకోట్ల ప్రజల సృజనాత్మక కృషినుంచే కమ్యూనిజం పెల్లుబుకుతుందని లెనిన్ మనకు ఉపదేశించారు. అయితే ఈ సత్యాన్ని అందరూ గ్రహించలేదు. కమ్యూనిజం గురించి ఒక ఉపన్యాసం దంచి, పార్టీపట్ల తాము నిర్వర్తించవలసిన కర్తవ్యం అంతటితో పూర్తయినట్లు భావించే పార్టీసభ్యులు యిప్పటికీ ఉన్నారు. మార్క్సిజం-లెనినిజాన్ని మనం సదా జీర్ణం చేసుకొంటూనే వుంటాం......; కమ్యూనిస్టు నిర్మాణానికి సంబంధించిన సిద్ధాంత విషయాలను నిరంతరం ప్రచారం చేస్తూనేవుంటాం; అందులో సందేహమేమీలేదు. అయితే అంతవరకు మాత్రమే మనం పరిమితమై వుండజాలం. మన ప్రచారకులు, ఉపన్యాసకులు కార్యాచరణలో దాని చూపించాలని ప్రజలు కోరుతున్నారు. అగ్రగామి కార్మికులు అమలు జరిపిన పద్ధతులను గురించి ప్రజలకు విడమర్చి చెప్పాలి; ఆ యా కర్మాగారాలలోను,, సమిష్టివ్యవసాయ క్షేత్రాలలోను వుండే పరిస్థితులలో ఆ అనుభవాన్ని ఎలా ఉపయోగించుకోవాలో సలహా చెప్పాలి. అయితే మన ప్రచారకులు, ఉపన్యాసకులు ఆవిధంగా చేయగలగాలంటే సిద్ధాంత సమస్యలతోపాటు నిర్దిష్టమైన ఆర్థికసమస్యలను గురించికూడా వారు తెలుసుకోవలసి వుంటుంది; సమస్యలను పైపైన తరుస్తూ కాక, వాటి మంచి చెడ్డలను పూర్తిగా తెలుసుకొని మాట్లాడుతుండాలి. సమస్యలోని కీలకం ఇదే.

సోషలిజంనుంచి క్రమంగా కమ్యూనిజంవైపుకు మనదేశం సాగిపోతున్న ఈ సమయంలో, మార్క్సిజానికి సంబంధించిన మూలగ్రంథాలను అధ్యయనం చేయటం మాత్రమేగాక, మార్క్సిస్టు - లెనినిస్టు సిద్ధాంతాన్ని విడమర్చి చెప్పటంమాత్రమే కాక, సిద్ధాంతాన్ని ఆచరణ రూపంలోకి మార్చటం, భౌతిక, సాంస్కృతిక పరిపూర్ణతకు పాటుబడటం, మన దేశస్థులలో కమ్యూనిస్టు మనస్తత్వాన్ని పెంపొందించటం కూడా చాల ముఖ్యమైన విషయం అవుతుంది. కేవలం ప్రచారంద్వారానే ఉత్పత్తిని ఇతోధికం చేయటానికి, శ్రామికప్రజల జీవన స్థితిగతులను బాగుపర్చటానికి ఆచరణలో అనుదినం కృషిచేయు నవసరం లేకుండానే కమ్యూనిజాన్ని నిర్మించగలమని ఎవరైనా భావించుతున్నట్లయితే, అలాంటివారు విస్సన్న చెప్పిందే వేదంఅనే పిడివాదంలోకి దిగజారిపోతున్నారని చెప్పవలసివుంటుంది.

అర్థం పర్థంలేని రాజకీయ వాచాలత్వానికి స్వస్తిచెప్పాలి; రాజకీయ వాచాలత్వాన్ని లెనిన్ పదేపదే నిశితంగా ఖండిస్తూ వచ్చారు. మాటలకు, చేతలకు మధ్య అగాధం లేకుండా చూడమనే మన కార్యనిర్వాహకులను ప్రజలు కోరుతున్నారు. మొండిగా వాదించే ఈ పిడివాదులతో సిద్ధాంత రాద్ధాంత చర్చలకు దిగవలసిన అవసరంలేదు. మార్క్సిస్టు - లెనినిస్టు ఉపదేశాలను విజ్ఞాన దీపికలుగా చేపట్టిన సోవియట్ ప్రజలు ప్రపంచ పరివ్యాపిత చారిత్రక ప్రాధాన్యంగల దానిని, సామ్యవాదాన్ని నిర్మించారు. సామాజిక పరిణామక్రమ సూత్రాలకు చెందిన విషయ పరిజ్ఞానాన్ని ఆధారం చేసుకొని, మార్క్సిజం - లెనినిజంయొక్క చరిత్రను, సిద్ధాంతాన్ని నిరంతరం అధ్యయనంచేస్తూ సోషలిస్టు వ్యవస్థవల్ల మనకు సిద్ధించే సదవకాశాలన్నింటినీ పూర్తిగా వినియోగించుకోవాలి; కమ్యూనిజానికి బలీయమైన భౌతిక, ఉత్పత్తి ప్రాతిపదికను సాధ్యమైనంత త్వరలో సమకూర్చేందుకు సకలవిధాలా పాటుబడాలి; తద్వారా పారిశ్రామిక ప్రజలకు భౌతిక, సాంస్కృతిక ప్రయోజనాలను యితోధికంగా సమకూర్చిపెట్టాలి. మననుంచి సోవియట్ ప్రజలు అపేక్షిస్తున్నది ఇదే; వారి అపేక్షలను సాధ్యమైనంత తక్కువకాలంలో మనం తీర్చగలగాలి.

ఇంతకుముందులాగానే యికముందుకూడా మార్క్సిజం - లెనినిజం మన మహోద్యమానికి వెలుగుబాట చూపిస్తూనే వుంటుంది. మనం చేయవలసిన దల్లా ఒక్కటే - విప్లవకర సిద్ధాంతాన్ని పడికట్టురాళ్ళులాగా ఉపయోగించక సృజనాత్మక పద్ధతులలో ఉపయోగించాలి. ఆచరణలో కమ్యూనిజాన్ని నిర్మిస్తూ, మనం తాజాగా సంతరింపచేసుకొన్న చారిత్రకానుభవ సారాంశాన్నీ, సజీవమైన వాస్తవిక విషయాల పరిశీలననూ ప్రాతిపదికగా చేసుకొని ఆ సిద్ధాంతాన్ని మరింతగా పరిపుష్టం చేయాలి. అయితే, అనేక రంగాలలో అతి ప్రధానమైన ఈ కృషి ఎంతో వెనకబడివుండటం విచారకరమైన విషయం.

మరొక విషయం : వివిధ దేశాలలో మార్క్సిజంలోని వివిధాంశాలు ప్రధానమైనవిగా ముందుకు వస్తుంటాయని లెనిన్ మనకు ఉపదేశించారు. మన సమాజం యిప్పుడు అత్యున్నతమైన శ్రామికోత్పాదక స్తోమతను సాధించేందుకు, దేశంయొక్క కీలక ఆర్థిక కర్తవ్యాన్ని నిర్వర్తించేందుకు పాటుబడుతున్నది కనుక, అలాంటి ఈ దశలో మార్క్సిస్టు సిద్ధాంతానికి సంబంధించిన ఆర్థికాంశం, ఆచరణ యుక్తమైన ఆర్థిక సమస్యలు ప్రధానమైనవిగా ముందుకు వస్తాయి.

గత 17 సంవత్సరాలలోను మన ప్రచారం ప్రధానంగా సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీ సంక్షిప్తచరిత్రను ఆధారంచేసుకొనే సాగించబడింది. భవిష్యత్తులో కూడా మనం సాగించే ప్రబోధక కృషికి పార్టీయొక్క మహత్తర చరిత్రే మూలంగా వుంటుంది. దీనిదృష్ట్యా పార్టీచరిత్రమైన మార్క్సిస్టు పాఠ్యగ్రంథాన్ని ప్రజానురంజకమైన పద్ధతిలో సిద్ధపర్చటం అవసరం; చారిత్రక సత్యాలను ఆధారం చేసుకొని దానిని రచించాలి. కమ్యూనిజాన్ని నిర్మించేందుకు పార్టీ సాగించిన చారి

త్రిక ప్రాధాన్యంగల పోరాటాన్ని గురించి శాస్త్రీయ అవగాహనను ఆ గ్రంథం ఇవ్వాలి; ఈనాటివరకు గల చారిత్రిక గాథ అంతా అందులో వుండాలి.

ప్రస్తుతదశలో మార్క్సిజం - లెనినిజానికి చెందిన ఆర్థిక సంబంధమైన ఉపదేశాలు, పరిశ్రమ, వ్యవసాయం, నిర్మాణం, రవాణా, వాణిజ్యం మున్నగు వాటికి సంబంధించిన నిర్దిష్ట ఆర్థికసమస్యలు అత్యంత ప్రముఖస్థానం ఆక్రమిస్తున్నాయి. నిజానికి ఆచరణయుక్తమైన కమ్యూనిస్టు నిర్మాణంతో పెనవేసుకొనివున్న మార్క్సిస్టు-లెనినిస్టు ఆర్థికసమస్యలనే మన ప్రచారంలో కీలకాంశంగా చేసుకోవాలి.

ఉన్నత పాఠశాలలలోను, పార్టీ అధ్యయన తరగతులలోను శిక్షణపొందే, విద్య నభ్యసించే మన కార్యకర్తలు మార్క్సిస్టు - లెనినిస్టు సిద్ధాంతానికి సంబంధించిన ప్రముఖ సూత్రాలను ఆకళింపు చేసుకొనేనిమిత్తం సులభగ్రాహ్యమైన పద్ధతిలో, సంక్షిప్త రూపంలో ఒక పాఠ్యగ్రంథాన్ని తయారుచేయటం అవసరం. మార్క్సిస్టు తత్వశాస్త్రానికి సంబంధించిన మూలసూత్రాలను సులభంగా అర్థంచేసుకొనేందుకు వీలుగా మరొక గ్రంథాన్నికూడ తయారుచేయాలి. శాస్త్రీయమైన భౌతికవాద దృక్పథాన్ని ప్రచారంచేయటానికి, అభివృద్ధి నిరోధకమైన భావవాద తత్వశాస్త్రాన్ని (ఐడియలిస్టు ఫిలాసఫీ) ఎదుర్కోటానికి ఆగ్రంథాలు అమూల్యంగా ఉపకరించగలవు.

పార్టీయొక్క నూతన కార్యక్రమం యింతవరకు మనం తయారుచేసుకోనేలేదు. దానిని తయారుచేసుకోవలసిన గురుతర బాధ్యత మనముందున్నది. అనేక పంచవర్ష ప్రణాళికలకాలంలో సాధించవలసిన దీర్ఘకాల ఆర్థిక, సాంస్కృతికాభివృద్ధి ప్రణాళికను దృష్టిలో వుంచుకొని ఈ కార్యక్రమ ముసాయిదాను రూపొందించవలసి వుంటుందని వేరే చెప్పనవసరంలేదు.

పార్టీ ఏనాడో పరిష్కరించివేసిన కొన్ని స్పష్టమైన సమస్యలపై కొంత మంది గందరగోళం తెచ్చిపెట్టారు; అలాంటివారిని సరిదిద్దవలసిన అవసరం వుందని కేంద్రకమిటీ భావిస్తోంది. వుదాహరణకు సోవియట్ యూనియన్‌లో సోషలిస్టు నిర్మాణానికి, కమ్యూనిజానికి క్రమానుగతంగా పరివర్తన చెందటానికి సంబంధించిన సమస్యనే తీసుకోండి. ఇంతవరకు మనం సోషలిజానికి ప్రాతిపదికను, పునాదినిమాత్రమే వేశామంటూ కొందరు తప్పుడు సూత్రీకరణలను చేశారు.

అయితే 1936 లో సోవియట్ యూనియన్ రాజ్యాంగచట్టాన్ని ఆమోదించిన నాటికే సోషలిస్టువ్యవస్థ జయప్రదమై, జాతీయార్థిక విధానంలోని శాఖలన్నింటిలోను బాగా వేరు తన్నుకొనిపోయిందన్న విషయం జగద్విదితం. అంటే దానిఅర్థం అప్పటికే మన దేశంలో సోషలిస్టు సమాజం చాలావరకు స్థాపించబడిందన్నమాట. అప్పటి నుంచీ సోషలిస్టు ఉత్పత్తి సంబంధాలను గట్టి పునాదిగా చేసుకొని ఆ సోషలిస్టు సమాజం అభివృద్ధి చెందసాగిందన్నమాట. అందుచేత సోషలిజానికి పునాదినిమాత్రమే వేశామని చెప్పటమంటే, భవిష్యదవకాశాలకు సంబంధించిన కీలక సమస్యపై పార్టీ సభ్యులను, జనరల్‌గా ప్రజలను పెడమార్గం పట్టించటమే కాగలదు.

సోషలిస్టు అభివృద్ధికి సంబంధించిన సమస్యపై బండిని మరొక ప్రక్కకు లాగే వారుకూడా మనలో లేకపోలేదు. సోషలిజంనుంచి కమ్యూనిజానికి క్రమానుగతంగా పరివర్తన చెందటం అన్న సమస్యను తీసుకొని, కమ్యూనిస్టు సమాజానికి చెందిన సూత్రాలను అమలు జరపవలసిన తరుణం రానేవచ్చిందన్నట్లు మన ప్రముఖ కార్యకర్తలలో కొందరు చిత్రిస్తున్నారు. సోషలిస్టు నిర్మాణం యిప్పటికే పరిపూర్తి అయిందని కొందరు అహంభావులు నిర్ణయంచేశారు; అది కమ్యూనిజానికి ఫలానానాటికి పరివర్తన చెందవలసివుంటుందని సవివరమైన కాల నిర్ణయం చేయటానికి పూనుకొంటున్నారు. అలాంటి ఊహాజనిత భావాల ప్రాతిపదికమైన భౌతిక ప్రోత్సాహం కల్పించాలి అన్న సోషలిస్టు సూత్రంపట్ల నిర్లక్ష్యవైఖరి తలెత్తుతోంది. సోవియట్ వాణిజ్యం విషయంలో వస్తు మార్పిడిపద్ధతిని సరాసరి ప్రవేశపెట్టివేయాలన్న ప్రతిపాదనలు చేసినవారుకూడా ఉన్నారు; అవి ఏ మాత్రం అర్థంలేని ప్రతిపాదనలు. ఒక్కమాటలో చెప్పాలంటేభరోసాభావం విస్తరిస్తున్నమాటలవి. భారీ పరిశ్రమలను తేలిక పరిశ్రమలకు పోటీపెట్టి, సోవియట్ ఆర్థికాభివృద్ధి తొలిదశలో మాత్రమే భారీ పరిశ్రమలకు అగ్రతాంబూలం యివ్వటం అవసరమవుతుందనీ, మన మిప్పుడు చేయవలసిందల్లా తేలిక పరిశ్రమలను త్వరత్వరగా అభివృద్ధిచేసుకోటమేననీ వాదించిన ప్రబుద్ధులుకూడా లేకపోలేదు.

సోషలిస్టు నిర్మాణంలో సాధించిన విజయాలను తక్కువఅంచనా వేయాలని చేసిన ప్రయత్నాలను పార్టీ సకాలంలోనే తిప్పికొట్టగల్గింది; సోషలిస్టు ఆర్థికాభివృద్ధికి సంబంధించిన మూలసూత్రాల విషయంలో ప్రమాదకరమైన గందరగోళాన్ని వ్యాపింపచేస్తూ, నేలవిడిచి సాముచేసిన చందంగా అడుకూ పొంకూ అందని పథకాలను వేసేవారినీ, హుక్కా పీలుస్తూ కలలుగనేవారిని పార్టీ సకాలంలో సరిదిద్దుతుంది.

అత్యున్నతంగా అభివృద్ధిచెందిన పెట్టుబడిదారీ దేశాలను మన దేశం యింతవరకు ఆర్థికంగా తలదన్నలేదన్న విషయాన్ని అహంభావంవల్ల అంధత్వం ప్రాప్తించిన వారుమాత్రమే విస్మరించగలరు; అలాగే మన సమాజంలోని సకల జనులకు సుఖప్రదమైన జీవితాన్ని సమకూర్చిపెట్టగల్గినంతగా మన ఉత్పత్తి స్థాయి యింకా పెరగనేలేదన్న విషయాన్నీ ఆర్థిక, సాంస్కృతిక రంగాలలో ఈనాటికీ అనేక లోపాలు, లోపభూయిష్టమైన నిర్మాణ పద్ధతి వున్నదన్న సంగతినీ అలాంటివారు మాత్రమే అలక్ష్యం చేయగలరు.

సిద్ధాంత పొరపాట్లవల్ల ఊహాజనితమైన భ్రమలు, కార్యాచరణలో ప్రజలు సరిగా ప్రవర్తించటానికి ఆటంకాలు తయారవుతాయన్న సంగతినీ, మన సిద్ధాంతకృషిలో తప్పుడు ధోరణికి అవి దారితీస్తాయన్నవిషయాన్నీ గుర్తించాలి.

సిద్ధాంత కృషిలో పార్టీసంస్థలు యింతకు ముందుకన్నా మరింత జాగరూకత వహించి మెలగవలసివుంటుంది; మార్క్సిస్టు సిద్ధాంతంయొక్క పరిశుద్ధతను గట్టిగా కాపాడాలి. బూర్జువాసిద్ధాంతం తిరిగి ప్రత్యక్షం కాకుండా అరికట్టేందుకు గట్టి

పోరాటం సాగిస్తుండాలి; వ్యక్తుల మనస్సులలో యింకా మిగిలివున్న పెట్టుబడిదారీ విధానపు అవశేషాలను తుడిచిపెట్టేకృషిని యితోధికం చేయాలి; ఆఅవశేషాలనుబుజాన వేసుకొని వూరేగేవారిని తూర్పారబట్టాలి.

ఈ సందర్భంలోనే మరొక విషయాన్నికూడా పేర్కొనవలసివుంటుంది. విభిన్న ఆర్థిక, రాజకీయ వ్యవస్థలుగల దేశాలమధ్య శాంతియుత సహజీవనం సాధ్యం అన్న సూత్రం పూర్తిగా సరియైనదే; అయితే ఆ సూత్రాన్ని సిద్ధాంత రంగంలోకూడ అమలు జరపాలని కొంతమంది ప్రయత్నిస్తున్నారు. ఇది చాలా ప్రమాదకరమైన పొరపాటు. పెట్టుబడిదారీ విధానంతో శాంతియుత సహజీవనం నెరపటానికీ, ఆర్థికంగా పోటీ చేయటానికీ మనం సిద్ధంగా వున్నామంటే అర్థం, బూర్జువా సిద్ధాంతానికి వ్యతిరేకంగాను, మానవుల మనస్సులలో యింకా మిగిలిపోయిన పెట్టుబబడిదారి విధానపు అవశేషాలకు వ్యతిరేకంగాను సాగించే పోరాటాన్ని సడలిస్తామని కాదు. బూర్జువా సిద్ధాంతం ఏ విధంగా ప్రజల పాలిటి అశనిపాతం వంటిదో, అది ఏ విధంగా అభివృద్ధి నిరోధక స్వభావం కల్గినదో వివరిస్తూ అహర్నిశలు దానిని తూర్పారబట్టుతూండటమే మన కర్తవ్యం.

పాతప్రపంచానికి చెందిన కాలదోషంపట్టిన భావాలకు, దృక్పథాలకు వ్యతిరేకంగా సాగించే పోరాటంలోనైతేనేమి, కమ్యూనిస్టు సిద్ధాంతాన్ని ప్రజలకు రంగరించి నూరి పోయటంలో నైతేనేమి పత్రికలు, సాహిత్యం, కళలు పెద్దపాత్రను నిర్వహించగలవు. ఈ రంగంలో సాధించిన గణనీయమైన విజయాలను గుర్తిస్తూనే, మన సాహిత్యం, కళలు సోవియట్ జీవితానికన్నా, సోవియట్ వాస్తవికానికన్నా ఎంతో వెనకబడి వున్నాయన్న సంగతి చెప్పక తప్పదు. మన కళలు సాహిత్యం ప్రతిబింబిస్తున్నదానికన్నా సోవియట్ జీవితం ఎంతో సంపన్నమయంగా వుంది. మన రచయితలలోను, కళాకారులలోను కొందరు జీవితంనుంచి దూరమైపోవటం లేదా అని ప్రశ్నించటం సమంజసంగా వుంటుంది.

సంపన్నమయ యితివృత్తం విషయంలో మాత్రమే కాక, కళాత్మక శక్తిలోను, శిల్పచాతుర్యంలోను కూడా మనదేశ కళలు, సాహిత్యం ప్రపంచంలో అగ్రస్థానం ఆక్రమించగలుగాలి. మన కళాకారుల సంస్థలలోను, సంపాదకవర్గ కార్యాలయాలలోను, ప్రచురణాలయాలలోను గల కొంతమంది క్రామేడ్స్ ఆదరాబాదరా నిస్సారమైన రచనలను సాగిస్తున్నారు; వ్యవహారం ఇలా సాగుతూవుంటే మనం చూస్తూ మిన్నకుండజాలం. మిడిమిడి జ్ఞానం, కపటత్వం- ఈ రెండింటినీ తెగినంతగా తూర్పారబట్టటం జరగటంలేదు. కళలఅభివృద్ధికి, ప్రజలలో కళాత్మక విద్యాభివృద్ధికి ఆ రెండూ తీరని ప్రమాదం తెచ్చిపెట్టుతాయి.

సినిమారంగంలో కొంత అభివృద్ధిని సాధించాం; ఇంతకుముందుకన్నా ఇప్పుడు ఎక్కువ చిత్రాలు తయారుచేస్తున్నాం. అయితే ఎక్కువసంఖ్యలో చిత్రాలను నిర్మించాలన్న ఆదుర్దాకొద్దీ చిత్రాలయొక్క సిద్ధాంత, కళాత్మక గుణం విషయంలో మన కార్యకర్తలు అంతిగా శ్రద్ధచూపటంలేదు. దాని ఫలితంగా తక్కువ రకం

చిత్రాలు తయారవుతున్నాయి. ప్రాధాన్యం లేనటువంటి చిల్లర మల్లర విషయాలను చిత్రీకరించటం జరుగుతోంది. ఈ పద్ధతికి స్వస్తి చెప్పాలి. శ్రామిక ప్రజలకు కమ్యూనిస్టు విద్యను గరపటంలో సినిమా ఒక బలీయమైన సాధనమన్న విషయాన్ని గుర్తుంచుకోవాలి.

సోవియట్ వాస్తవికతను సత్యదూరమైన పద్ధతిలో చిత్రించటాన్ని పార్టీ యిప్పటిదాకా ఎదుర్కొంటూ వచ్చింది; ఇకముందూ ఎదుర్కొంటుంది. సోవియట్ వాస్తవికతకు మేలిముసుగు తొడిగేందుకు ప్రయత్నించినా, సోవియట్ ప్రజలు సాధించిన దానిని గేలి చేసేందుకు, అవమానపర్చేందుకు ప్రయత్నించినా పార్టీ చూస్తూవూరుకోదు. కమ్యూనిజాన్ని నిర్మించాలన్న ఉత్తేజ భావంతో సాహిత్య కళారంగాలలోని సృజనాత్మక కళా ఖండాలు తొణికిసలాడుతుండాలి; ప్రజల హృదయాలలోనూ మనస్సులలోనూ ఉత్తేజాన్ని, విశ్వాసాన్ని, సోషలిస్టు మనస్తత్వాన్ని కర్తవ్య నిర్వహణపట్ల సహచర భావాన్ని (కామ్రేడ్లీ సెన్స్) అవి కలిగించగలగాలి.

గ్రామీణ ప్రాంతాలలో సాంస్కృతిక, విద్యా కార్యకలాపాలను మెరుగు పర్చటం మన ప్రధాన కర్తవ్యాలలో ఒకటి. గ్రామీణ ప్రాంతాలలో సాంస్కృతిక కార్యకలాపాలు తరచు నిర్లక్ష్యం చేయబడుతున్నాయి. రేడియో, పత్రికలు, క్లబ్‌లు గ్రంథాలయాలవంటి సాంస్కృతిక సాధనాలను పూర్తిగా ఉపయోగించటంలేదు. కమ్యూనిస్టు నిర్మాణానికి చెందిన ఆచరణ సంబంధమైన కర్తవ్యాలకు, సాంస్కృతిక సంస్థలకు మధ్య తరచు ఎలాంటి సంబంధం లేకుండా పోతూంది. సాంస్కృతిక కేంద్రాలను, క్లబ్‌లను, క్లబ్ రూమ్సును గ్రంథాలయాలను ఉపయోగించు కొంటూ, పార్టీ సంస్థలు ప్రజలతో రాజకీయ సాంస్కృతిక, విద్యాకృషిని సాగించ వలసివుంటుంది. ఉత్తమోత్తమ కార్మికులు సంపాదించిన అనుభవాన్ని ప్రచారం చేయటం ద్వారాను, శాస్త్రీయమైన వ్యవసాయ పద్ధతులను పరిశీలించటానికి అవకాశాలు కల్పించటంద్వారాను, ఈ సంస్థలో వ్యావసాయికాభివృద్ధిని యితోధికంగా సాధించే కార్యక్రమంలో ప్రధాన పాత్ర నిర్వహించాలి.

కమ్యూనిస్టు నిర్మాణంలో విజయ పరంపర సాధిస్తూ, మున్ముందుకు సాగి పోయేందుకు అందుబాటులోవున్న సిద్ధాంత ప్రచార సాధనాలన్నిటినీ మరింత సమర్థవంతంగా వినియోగించుకోవాలి. మన కార్యకర్తలకూ, మొత్తం పార్టీ సభ్యులందరికీ, జనరల్‌గా ప్రజలందరికీ సిద్ధాంత శిక్షణ గరపాలి అన్న లక్ష్యంపైన పార్టీ తన దృష్టిని ఇకముందుకూడా లగ్నం చేస్తూండాలి.

కాబట్టి, పార్టీ పురోభివృద్ధికి నిర్మాణ నాయకత్వం విషయంలోను, సిద్ధాంత, రాజకీయ కార్యకలాపాలలోను మనం నిర్వర్తించవలసిన కర్తవ్యాలు ఇవి :

1. సోవియట్ యూనియన్‌లోని రాజకీయ, సామాజిక, ఆర్థిక, సాంస్కృతిక జీవితానికి సంబంధించిన శాఖలన్నింటిలోను నాయకశక్తిగాను, సారధ్యశక్తిగాను పార్టీ యొక్క పాత్రను అన్నివిధాల యితోధికం చేసేందుకు నిరంతరం పాటుబడుతుండాలి; ప్రజలకు, పార్టీకి మధ్యగల సంబంధాలను యింకా విస్తరింపచేసి, పటిష్ఠ

మొనర్చి పార్టీ పలుకుబడిని యింకా యినుమడింపచేయాలి; పార్టీ యొక్క పార్టీ నాయకత్వం యొక్క ఐక్యతను, సౌహార్దతను పదిలపరుస్తూ, పటిష్ట మొనర్చాలి; పార్టీలో సమిష్టి నాయకత్వ సూత్రాన్ని తు. చ. తప్పకుండా పాటిస్తుండాలి; విమర్శ, ఆత్మ విమర్శలను పెంపొందించాలి; ఆర్థిక, సాంస్కృతికాభివృద్ధి రంగాలన్నింటిలోను గల లోపాలను ధైర్యంగా బయటపెట్టుతుండాలి.

2. పార్టీ ఆంతరంగిక ప్రజాతంత్రాన్ని పెంపొందించాలి; ఆ ప్రాతిపదికపై పార్టీ సంస్థలయొక్క, పార్టీ సభ్యులందరియొక్క చొరవను, బాధ్యతలను పెంపొందించాలి; పార్టీ యూనిట్ల నిర్మాణ కార్యకలాపాలను మెరుగుపర్చి, కమ్యూనిస్టు నిర్మాణానికి సంబంధించిన కార్యాచరణ కర్తవ్యాలను పార్టీ యూనిట్లు చక్కగా పరిష్కరించ గలిగేటట్లు చేయాలి; కార్యకర్తలను ఎంచటంలోను, వారికి శిక్షణ గరపటంలోను, వారిని ఆ యా రంగాలకు కేటాయించటంలోను పరిస్థితిని బాగు పర్చాలి; కమ్యూనిస్టు నిర్మాణ కర్తవ్యాలను నిర్వర్తించేందుకు వీలుగా ట్రేడ్ యూనియన్ల, యువక కమ్యూనిస్టు సమితి సంస్థల పాత్రను ఎక్కువ చేయాలి.

3. పార్టీ సంస్థలన్నింటిలోను సిద్ధాంత స్థాయిని పెంపొందించాలి; పార్టీయొక్క సిద్ధాంత చారిత్రకానుభవాన్ని కమ్యూనిస్టులు సృజనాత్మకంగా జీర్ణం చేసుకొనేటట్లు చూడాలి. మన సిద్ధాంత కృషిలో నిఘాను ఎక్కువచేసి, బూర్జువా సిద్ధాంతానికి వ్యతిరేకంగా రాజీకి ఆస్కారం లేనట్టి పోరాటం సాగించాలి; ప్రజలకు కమ్యూనిస్టు విద్యను గరపటానికీ, వ్యక్తుల మనస్సులలో యింకా మిగిలివున్న పెట్టుబడిదారీ విధానపు అవశేషాలను తుడిచిపెట్టడానికీ యితోధికంగా కృషి చేయాలి; ఇందుకోసం మనకు అందుబాటులోవున్న సిద్ధాంత, ప్రచార సాధనాలన్నింటినీ-ప్రచారం, ఆందోళన, పత్రికలు, రేడియో, సాంస్కృతిక, విద్యాసంస్థలు, శాస్త్రీయ, సాహిత్య కళ యిత్యాది సంస్థలన్నింటినీ—పరిపూర్ణంగా ఉపయోగించుకోవాలి.

కామ్రేడ్స్, సోవియట్ ప్రజలు మహత్తరమైన మహాప్రస్థానం పూర్తిచేశారు. తమ కమ్యూనిస్టుపార్టీనాయకత్వాన వారు మహత్తరమైన చారిత్రక విజయాలను సాధించారు. ఇంటా బయటాగల శత్రువులతో జీవన్మరణపోరాటం సాగిస్తూ మనం ఆ విజయాలను సాధించుకొన్నాం. సోవియట్ ప్రజలు అనేక కష్టాలను, అవాంతరాలను గడిచి గట్టెక్కారు. తమ దేశంయొక్క రూపురేఖలను చక్కగా తీర్చి దిద్దే ప్రణాళికలను, సోషలిస్టు ఆర్థికాభివృద్ధిని సాధించే మేటి ప్రణాళికలను వారు పట్టుదలతో, గట్టిగా అమలుజరుపుతున్నారు.

సోవియట్ యూనియన్ సాధించిన విజయాలు మన ప్రజల, మన మిత్రుల హృదయాలను పులకరింపచేస్తున్నాయి; వారిని ఉత్తేజ పరుస్తున్నాయి. చివరకు మన శత్రువులుసైతం తమ ధోరణిని మార్చుకొంటున్నారు. మొదటి సోవియట్ పంచవర్ష ప్రణాళికను ప్రకటించినప్పుడు వారు దానిని అవహేళన చేశారు; సోవియట్ రాజ్యంయొక్క శక్తిని తక్కువ అంచనా వేసుకున్నారు.

పోతే యిప్పుడు వారి గుండెల్లో రైళ్లు పరుగెత్తుతున్నాయి. సోవియట్ యూనియన్ లోని కార్మికవర్గం, శ్రామిక రైతాంగం, యావత్ప్రజానీకం సాధించిన అఖండ విజయాలు గుడ్డివారికిసైతం ఈ నాడు కొట్టొచ్చినట్లు కన్పిస్తున్నాయి. తమ భవిష్యత్తును తమ చేతులలోకి తీసుకొన్న పిమ్మట, పార్టీ నాయకత్వాన ప్రపంచంలో కల్లా మొట్టమొదటి కార్మిక కర్షక రాజ్యమేర్పరచుకొన్న తరువాత మన ప్రజలు తమ సర్వశక్తులను ధారపోస్తూ కమ్యూనిస్టు సమాజ నిర్మాణానికి ఉపక్రమించారు; ప్రపంచ ప్రజలందరకూ ఉత్తేజం కలుగజేసే ఆదర్శాన్ని నెలకొల్పుతున్నారు (దీర్ఘ హర్షధ్వానాలు).

సోవియట్ భూమి ఈనాడు జాంబవంతుని అంగలు వేసుకొంటూ ముందుకు సాగిపోతోంది. ఉపమానాల్ని ఉపయోగించవలసివస్తే, మన చరమ లక్ష్యమైన కమ్యూనిస్టు సమాజం కనుచూపు మేరలో కన్పించేంటంత శిఖరాగ్ర స్థాయిని చేరుకొన్నాం (దీర్ఘ హర్షధ్వానాలు).

ఈ శిఖరాగ్రాన్ని చేరుకొనటంలో మన దేశం ఎన్నో యిడుములను, వర్ణింపనలవికాని యిక్కట్టులను అనుభవించింది. అయితే ఎన్ని కష్టాలు ఎదురైనా, సోవియట్ ప్రజల వజ్ర సంకల్పం ఈషణ్మాత్రం చలించలేదు. ఈ కష్టాలను అధిగమించడానికి వారు సాగించిన జీవన్మరణ పోరాటంలో సోవియట్ భూమిలోని శ్రామిక జనానీకం నిగ్గుతేరారు. ఆహారం, వస్త్రాలు, యిళ్ళు, జీవిత సుఖాలు, తదితరమైన వాటి నెన్నింటినో సోవియట్ ప్రజలు చైతన్యపూరితులై త్యజించారు. పారిస్‌లోని తాజా సింగారంతో పోల్చుకుంటే మన మెంతో వెనకబడి వున్నామనీ, యింకా పురాతన పద్ధతి దుస్తులనే ధరిస్తున్నామనీ కొందరు మనలను విమర్శిస్తున్నారు. నిజమే, దానిని మనం కాదనటం లేదు.

మనంతట మనమే అనేక సౌఖ్యాలను త్యజించాం; అంతకుతప్ప మరో మార్గం మనకు లేకపోయింది. అక్టోబరు మహావిప్లవం సాధించిన చారిత్రక విజయాలను పదిలపర్చుకొని, పుంఖానుపుంఖంగా పెంపొందించుకొనేందుకు సాధ్యమైనంత తక్కువ కాలంలో బలీయమైన సోషలిస్టు పరిశ్రమను, మొత్తం మన దేశార్థికవ్యవస్థ పునాదులను, మన రక్షణస్తోమత పునాదులను మూలకందమైన సోషలిస్టు పరిశ్రమలను, మనం సృష్టించుకోవలసివచ్చింది. మన వ్యవసాయాన్ని సమూలంగా పునర్నిర్మించుకోవాల్సివచ్చింది. ప్రజలలోనుంచి మేధావులైన కొత్త కార్యకర్తలను సృష్టించుకొని, సోషలిస్టు సమాజాన్ని నిర్మించుకోవాల్సి వచ్చింది.

సోవియట్ సోషలిస్టు రాజ్యంయొక్క శక్తి స్తోమతులు ఏపాటివో చూదామని మన శత్రువులు పదే పదే ప్రయత్నిస్తూ వచ్చారు. కాని వారి ప్రయత్నాలన్నీ పూర్తిగా వమ్మైపోయాయి; యుద్ధాలతో జూదమాడే జూదగాళ్ళ మాడు పగిలింది. (మిన్నుముట్టే హర్షధ్వానాలు) సోవియట్ రాజ్యం మూడు పూలు ఆరుకాయలుగా దినదిన ప్రవర్ధమాన మవుతున్నది. నూతన ప్రపంచానికి చేరుకొనే మార్గమేదో మానవాళికి అది ధ్రువతారగా వెలుగొందుతూ, దారిచూపుతోంది (దీర్ఘ హర్షధ్వానాలు).

ఇప్పటి ఆరో పంచవర్ష ప్రణాళిక కాలంలో సోవియట్ యూనియన్ జాంబవంతుని అంగలతో మరింతగా ముందుకు సాగిపోతుంది. భారీపరిశ్రమలను ఒకప్రక్క అభివృద్ధి చేసుకొంటూనే, మరొక ప్రక్క వాడకం వస్తువులను ఉత్పత్తి చేసే జాతీయార్థిక శాఖలను పెంపొందించేందుకు విస్తృత ప్రాతిపాదికను సమకూర్చుతున్నాం.

మహోన్నత లక్ష్యమైన కమ్యూనిస్టు నిర్మాణాన్ని సాధించటానికి కంకణం కట్టుకొన్న మన పార్టీ సృజనాత్మక శక్తితో తొణికిసలాడుతోంది. బలోపేతమైన కార్యదీక్షతో ఉట్టిపడుతోంది; వజ్ర సంకల్పంతో నిండిఉంది. మానవజాతి చరిత్రలో అంతకన్నా మహోదాత్తమూ, మహోన్నతమూ అయిన లక్ష్యం మరొకటి లేదు; ఇక ఉండబోదు. సమాజంలోని ఉత్పత్తిశక్తు లన్నింటినీ కమ్యూనిజం పరిపూర్ణంగా అభివృద్ధిచేస్తుంది; ఆ వ్యవస్థలో సామాజిక సంపద ఆధారాలన్నీ స్వేచ్ఛగా పారుతూవుంటాయి; ప్రతివ్యక్తి ఉత్సాహంతో తనకు చేతనైనంత వరకు పనిచేస్తాడు; అందుకు ప్రతిఫలంగా తన అవసరాలకు సరిపోయినంత స్వీకరిస్తాడు. ఈ ప్రాతిపదికమైన ప్రతివ్యక్తీ, కమ్యూనిస్టు సమాజంలోని ప్రతి ఒక్కరూ, సర్వతోముఖంగా అభివృద్ధిచెందటానికి అవసరమైన పూర్వసోపానాలు సృష్టించబడుతాయి (దీర్ఘహర్షధ్వానాలు).

అందుచేతనే కమ్యూనిజానికి సంబంధించిన భావాలు అంత అపారమైన ఆకర్షణ శక్తిని కలిగియున్నాయి; కొత్తవారిని అనేకమందిని తనవైపుకు కమ్యూనిజం ఆకర్షించ గలుగుతోంది. బయటినుంచి వత్తిడితేవటంద్వారా ఒకదేశంలోని ప్రజలు కమ్యూనిస్టు పథాన్ని చేపట్టేటట్టు బలవంతం చేస్తున్నారనటంకన్నా హాస్యాస్పదమైన అభూత కల్పన మరొకటి ఉండబోదు. కమ్యూనిస్టు భావాలు అజేయమైనవన్న విశ్వాసం మనకు ఉన్నది. బూర్జువా అభివృద్ధి నిరోధకులు ఎన్ని 'ఉక్కుతెరలను' నిర్మించినా, అవరోధాలను ఏర్పరచినా ఆ భావాల వ్యాప్తిని, ఆనాటికానాడు మరింత ఎక్కువగా కోటానుకోట్ల ప్రజలలోకి వ్యాపించకుండా అరికట్టటం సాధ్యం కాదు (మిన్నుముట్టే హర్షధ్వానాలు).

అదే సమయంలో సామ్యవాదానికీ, పెట్టుబడిదారీ విధానానికీ మధ్య శాంతియుత సహజీవనం నెలకొనాలనీ, ఆర్థికపోటీ సాగాలనీ మనం గట్టిగా కోరుతాం. వివిధదేశాలమధ్య శాంతి, స్నేహం నెలకొనేందుకు దోహదమిచ్చే కార్యవిధానాన్నే మనం అచంచలంగా అనుసరిస్తుంటాం.

మన పార్టీకి అనేకమంది శత్రువులు, ప్రత్యర్థులు ఉన్నారు. అయితే దానికి అత్యంత విశ్వాసపాత్రులైన మిత్రులుకూడా అంతకన్నా ఎన్నో రెట్లు ఎక్కువగా వున్నారు.

మన ఆశయం అజేయమైనది. సోవియట్ మహాప్రజలతోపాటు, సోదర ప్రజాచైనాలోను, తదితర నూతన ప్రజాతంత్ర దేశాలలోనుగల కోటానుకోట్ల ప్రజానీకం ఆ ఆశయ సాధనకు కంకణధారులై కృషిచేస్తున్నారు. కనుక అది అజేయమైనది (మిన్నుముట్టే హర్షధ్వానాలు.) జాతీయ వలస పీడనను చీల్చుకొని బయట

పడిన జాతులు, దేశాలు ఆ ఆశయాన్ని హృదయపూర్వకంగా బలపర్చుతున్నాయి. కనుక అది అజేయమైనది. ప్రపంచమంతటాగల కష్టజీవులంతా ఆ ఆశయాన్ని సమర్థిస్తున్నారు. కనుక అది అజేయమైనది. మనలను ఎవరూ భయపెట్ట జాలరు; మనం తీసుకొన్న వైఖరులనుంచి మనలను వెనక్కు నెట్టగలిగిన శక్తి ఎవరికీ లేదు. శాంతి, ప్రజాతంత్రం, సోషలిజం పరిరక్షణకు తిలోదకాలిచ్చేటట్లు మనలను ఎవరూ మెడలు వంచలేరు (దీర్ఘ హర్షధ్వానాలు).

మన మహోపాధ్యాయుడైన లెనిన్ మహాశయుడు చూపెట్టిపోయిన మార్గంవెంట సరియైన మార్గంవెంట మనం ముందుకు సాగిపోతున్నాం. కనుక భవిష్యత్తు మనదే (మిన్నుముట్టే హర్షధ్వానాలు). న్యాయం విలసిల్లే సామాజికవ్యవస్థను తలచుకొని ఉత్తేజంపొందిన ప్రజాతంత్ర, సామ్యవాద భావాలుగల కోటానుకోట్ల స్త్రీపురుషులు మనచుట్టూ, మన మిత్రులచుట్టూ సమీకృతమవుతున్నారు.

ప్రపంచాన్ని మార్చివేస్తున్న మార్క్సిజం-లెనినిజం పతాకచ్ఛాయలలో సోవియట్ ప్రజలను సోవియట్ కమ్యూనిస్టుపార్టీ కమ్యూనిజంయొక్క సంపూర్ణ విజయానికి నడిపించుకుపోతుంది. (మిన్నుముట్టే దీర్ఘ హర్షధ్వానాలు - అంతాలేచి నిలబడతారు).

139

# తప్పొప్పుల పట్టిక

| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 6 | 18 | 391 పరిశ్రమలను | 391 పారిశ్రామిక సంస్థలను |
| 6 | 20 | 210 కోట్ల రూబుళ్ళ అప్పు | 2100 కోట్ల... |
| 6 | 34 | 156 పరిశ్రమలను | 156 పారిశ్రామిక సంస్థలను |
| 18 | 23 | కొంతవరకు తగ్గుదల | కొంతవరకు సౌమ్యత |
| 26 | 12 | జర్మనీలోనే వివిధ శక్తుల కలయిక గతంకంటె భిన్నంగావుంది | జర్మనీలోనే వివిధ శక్తుల బలాబలాలు గతంలోకంటె భిన్నంగా వున్నాయి |
| 38 | 18 | పోరాటంద్వారా సామ్యవాదం మాత్రమే పరివర్తన | పోరాటంద్వారా మాత్రమే సామ్యవాద పరివర్తన |
| 51 | 21 | గృహనిర్మాణ సమస్యలు | గృహనిర్మాణ సరుకులు |
| 54 | 27 | తమ ఉత్పత్తులను రెండింటిలో మూడింతలు | తమ ఉత్పత్తిలో రెండింతలు, మూడింతలు |
| 60 | 17 | 1 కోటి 80 లక్షల ఎకరాల్లో | 1 కోటి 80 లక్షల హెక్టార్లలో |
| 60 | 32 | మున్నగు రిపబ్లిక్కులలో | మున్నగు రిపబ్లిక్కులలోని కొన్ని ప్రాంతాల్లో |
| 61 | 25 | జాడుకోసం ప్రత్యేకించారు | బీడుకోసం ప్రత్యేకించారు |
| 61 | 30 | హెక్టారు 1 కి 40.2 టన్నులను, $5\frac{1}{2}$ హెక్టార్లలో హెక్టారు 1 కి 75 టన్నుల పంటను పండించారు. | హెక్టారు 1 కి 40.2 టన్నులను పండించారు. ఇందులో $5\frac{1}{2}$ హెక్టార్ల భూమిలో హెక్టారు 1 కి 75 టన్నుల పంట పండింది. |
| 81 | 30 | రోజుకు 6 గంటల పనిని | రోజుకు 7 గంటల పనిని |
| 82 | 17 | అయిదో పంచవర్ష ప్రణాళిక లక్ష్యాలను | ఆరవ పంచవర్ష ప్రణాళిక లక్ష్యాలను |
| 128 | 11 | ఎక్కువపుట్ల ధాన్యాన్ని | ఎక్కువపూడ్ల ధాన్యాన్ని |
| 128 | 28 | గమనించరు | గమనించారు. |



**మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక**

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA130B163 |
| పుస్తకం పేరు | సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీ |
| తారీఖు | 30/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 147 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | 140 |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Sowmya |
| పేజీలు విడదీసినది | Sowmya |
| స్కాన్ చేసినది | S. Lakshmi |
| పరీక్ష చేసినది | SANDHYA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |